# జీవితంలో మలుపు



కమలాకాంత్



జయంతి పబ్లికేషన్స్
గోపాలరెడ్డిరోడ్డు :: విజయవాడ-2

# అంకితం

శ్రీ వేంకటేశ్వరుని
పాదపద్మములకు

4

ఇందలి రచనలు

ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజనతా

మొదలగు పత్రికలలో ప్రచురించబడినవి.

వారికి అభివందనములు.

# జీవితంలో మలుపు

సాయంకాల మైనది. పగలంతా సలసలా కాగిపోయిన వాతావరణం చల్లబడింది. చల్లటి పిల్లవాయువు వీస్తున్నది. దూరాన సన్నగా కనిపించే పర్వత శ్రేణులూ, గాలికి అల్లలాడే పచ్చటి పొలాలూ, చల్లటి పిల్లతిమ్మెరలకు మైమరచి ఊగిసలాడిపోయే వృక్షజాలం, కెంపు రంగులో మునిగి తేలుతున్న ఆకాశం, తమ తమ గూళ్ళకు తిరిగిపోతూ, ఆనందంతో కిచ కిచ లాడుతూ, ఆకాశంలో పల్టీలు కొట్టుతున్న పక్షుల గుంపులు, వీటితో ప్రకృతి శోభాయమానంగా ఉన్నది.

పెద్ద పెట్టున రొద చేస్తూ వచ్చి ప్రయాణీకుల్ని ఒక్క కుదుపు కుదిపి స్టేషనులో ఆగింది రైలు. స్టేషనులో రద్దీ తక్కువగానే ఉంది. రామారావు బండి దిగాడు పెట్టె, బెడ్డింగుతో సహా. తెల్లటి గ్లాస్కో ధోవతి, లాల్చీ కట్టుకొన్నాడు. నుదురు విశాలంగా ఉంది అతని ముఖంలో కళ ఉట్టిపడుతున్నది. బండి దిగి చుట్టూ ఒకసారి కలయ జూశాడు- ఊరు వాతావరణం ఎట్లా ఉన్నదోనని. ఫరవాలేదనుకొని తృప్తి పడ్డాడు.

"ఎక్కడికి వెళ్ళాలి బాబూ సామాను తెస్తా" నంటూ యింతలో ఒక ముసలితాత అడిగాడు తలపాగా చుట్టుకొంటూ.

"ఈ ఊరి హెడ్ మాస్టర్ గారిల్లు తెలుసునా తాతా?" రామారావు ప్రశ్నించాడు తాత ముఖంలోకి చూస్తూ.

"ఆ దొరగారిల్లు తెలియకపోవడ మేంటి బాబూ! ప్రకాశరావుగారు చాలా మంచోరు. మీరా దొరగారి కేమ యినా చుట్టాలా బాబూ! పదండి తీసుకెళ్తాను" అంటూ పెట్టె, బెడ్డింగూ నెత్తి నెత్తుకున్నాడు ముసలివాడు.

రామారావు హ్యాండ్ బ్యాగ్ పట్టుకొని తాత ననుస రించాడు. కళ్ళు చెదరిపోయేటట్లు చుట్టూ పచ్చటి పొలాలు, మధ్యలో పొడుగాటి పెద్ద కాలవా, కాలవ వెంబడి ఒక అర మైలు నడి స్తేనేగాని ఊరు రాదు. కాలవ నీరు నిర్మలంగా ఉంది: పిల్లలు కాలవలో స్నానం చేస్తూ, నీళ్ళు చిమ్ముకొంటూ కేరింతలు కొడుతున్నారు. కాలవ ఒడ్డున వత్తుగా పచ్చగడ్డి పెరిగి ఉంది. అక్కడక్కడ ఆవులు గడ్డిమేస్తున్నవి.

తాత సరాసరి తీసుకెళ్ళి ఒక పెంకుటింటి ముందు ఆగి, "ఇదేనండి బాబూ ప్రకాశరావుగా రిల్లూ"అంటూ సామాను దించాడు. తాతకు కూలీ డబ్బు లిచ్చి పంపేశాడు రామా రావు. ఇంటి తలుపులు లోపలికి వేసి ఉన్నవి. వెళ్ళి రెండు సార్లు తలుపు తట్టాడు.

"ఎవరువారు...?" తలుపులు తెరుచుకొన్నవి. ఒకనడి వయస్కుడు బయటకు వచ్చాడు. "ఎవరుకావాలి నాయనా" చక్కగా అడిగాడాయన.

"నేనీ ఊరికి క్రొత్తగా టీచరుగా వచ్చానండీ. ప్రకా శరావుగారు కావాలి."

"ప్రకాశరావును నేనేనోయ్. మీపేరు రామారావు కదూ? మొన్ననే మీ పోస్టింగ్ ఆర్డరు కాపీవచ్చింది. మీ కోసరం ఒక చిన్న గదికూడా చూచివుంచాను. అవన్నీ రేపు

చూచుకోవచ్చునుగాని, పైకి, అవి లోపలికి తెచ్చుకో నాయనా''-తీయగా మాట్లాడారు హెడ్‌మాస్టరు. తాత చెప్పింది అక్షరాలా నిజమనిపించింది రామారావుకు.

"మీకు యిబ్బంది లేకపోతే చాలా కృతజ్ఞుణ్ణి" అంటూ సామాను లోపలికి తీసుకొనివెళ్ళాడు రామారావు

మర్నాడు రామారావు స్కూల్లో చార్జి తీసికొన్నాడు. ఆరోజే యిల్లుకూడా చూచుకొని ప్రవేశించాడు. రెండు మూడురోజులు గడిచిపోయినవి. రామారావుకు అంతా క్రొత్తక్రొత్తగా వున్నది పల్లెటూరి వాతావరణం.

తెల్లవారితే ఆదివారం. రేపు రోజల్లా ఎట్లా గడపాలా అనుకొన్నాడు రామారావు. అనుకొంటుండగానే నిద్దర పట్టింది.

తెల్లవారుజామున ఎందుకో ఎవరో తట్టినట్లు మెలకువ వచ్చింది రామారావుకు. ప్రక్కనేవున్న యిల్లుగలవారి భాగంలోనుండి "రామా నన్ను బ్రోవరా, లోకాభి రామా నన్ను బ్రోవరా''-అంటూ త్యాగరాజు కృతి కమ్మని కమనీయ కంఠంతో, హరి కాంభోజి రాగంతో వినబడుతున్నది. రామారావు నిద్దర మత్తొదిలింది.

రామారావు ఆ కంఠంలోని మాధుర్యానికి పరవశం చెందాడు. పాట ఆగిపోయింది. రామారావు ప్రాణం గిజగిజ లాడింది. రామారావువంటి కళాపిపాసి ఆ తీయని గానల హరికి పరవశం చెందాడంటే ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు. రామారావు గొప్ప చిత్రకారుడు. అతని అందమైన కుంచె మలపులలోనుండి ఎన్నో చిత్రరాజాలు వెలిసినవి. ఒకసారి

అతని తైలవర్ణ చిత్రానికి అఖిల భారత చిత్రకళా ప్రదర్శనంలో ప్రథమ బహుమతి లభించింది. ఎప్పుడూ అతని చిత్రాలు పెద్ద మాగజైనుల్లో పడుతూనే ఉంటాయి.

'మరోసారి ఆ పాట వినబడితే ఎంత బాగుండును'- అనుకొన్నాడు రామారావు.

రూము కిటికీలు తెరచి వెలుపలికి చూచాడు రామారావు. చల్లటిగాలి కిటికీగుండా దూసుకొనివచ్చి శరీరాన్ని గిలిగింతలుపెట్టింది. ఇంకా చిరుచీకటి ప్రపంచాన్నావరించేవున్నది. నక్షత్రాలు కాంతివంతంగా ప్రకాశిస్తున్నవి. ఎక్కడో ఒక కోడి ఊళ్ళోవారికి మేలుకొలుపు పాడుతున్నది. పొలాలకు వెళ్ళే ఎద్దుల మెడలోని గంటారవళి సన్నగా వినబడుతున్నది. రామారావు కాలకృత్యాలు తీర్చుకొని స్నానాదులు కానిచ్చాడు.

తెల్లవారింది. ఎనిమిదిగంటలు కావస్తోంది. తెల్లటి పైజామా, లాల్చి తొడుక్కొని ఏమీతోచక పోవడంతో బయటకు నడిచాడు రామారావు కాలక్షేపం కోసం. ఇంటి వారి భాగం తెరిచేవుంది. వాకిలి కెదురుగా పడకకుర్చీలో కూర్చుని ఒక యువతి ఏదో మాగజైను తిరగవేస్తూ దేన్నో తదేకంగా చూస్తోంది.

"నమస్కారమండీ, క్షమించాలి. ఏదో పనిమీద ఉన్నట్లున్నారు" అన్నాడు రామారావు.

ఆ యువతి తలెత్తి చూచింది. ఆమె ముఖంలో శాంతం, సహనం మూర్తీభవించి ఉన్నై. ఆమె జీవితంలో

ఇరవై వసంతాలు గడిచివుంటాయి అంతే. ఆమె వదనం నిర్మలంగా ఉంది.

"నమస్కారమండీ!" అని ప్రతినమస్కారం చేస్తూ "ఓహో! మీరా! రండి! కూర్చోండి!" అంటూ సాదరంగా ఆహ్వానించిందామె పమిటచెంగు నిండా కప్పుకొంటూ.

"ఊరంతా క్రొత్తగా ఉందండీ. ఏమీతోచక ఏవైనా కబుర్లు చెప్పుకోందామని యిట్లా బయలుదేరాను" అన్నాడు రామారావు కూర్చుంటూ.

గది విశాలంగా చాలా పరిశుభ్రంగా ఉన్నది. గోడలకు అక్కడక్కడా తైలవర్ణ చిత్రాలు వ్రేలాడుతున్నాయి.

"మీ పేరేమిటండీ? మీరువచ్చి ఇన్నిరోజులైనా పేరే తెలుసుకోలేదు" అన్నదామె.

"నాపేరు రామారావండీ, మరి మీపేరో!"

"నాపేరు నిర్మలండీ. మీకు రూము సౌకర్యంగా ఉందనుకొంటాను" అడిగింది నిర్మల.

"రూము బాగానేఉంది. కానీండీ, తెల్లవారుఝామున మీరు పాడిన త్యాగరాజు కృతి మళ్ళీ వినాలనిపిస్తోంది నిర్మలగారూ!"

నిర్మల బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. చిరునవ్వు నవ్వుతూ "ఆ మ్యాగజైన్ తిరగేస్తూ ఉండండి. ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికెళ్ళింది ఆమె సిగ్గుతో.

"ఇంట్లో ఇంకెవ్వరూ లేరు. విచిత్రంగా ఉంది. ఇంత చిన్న వయస్సులో ఒంటరిగా గడపాల్సిన అవసరమేమో?" అనుకొన్నాడు రామారావు.

రామారావు మ్యాగ్‌జైను తిరగవేస్తూ, తిరగ వేస్తూ ఒకసారి ఏదో చిత్రం ముందు ఆగిపోయాడు. అది తను వేసిన చిత్రమే. క్రింద తన పేరు వ్రాసిఉన్నది.

ఇంతలో నిర్మల రెండు కాఫీ కప్పులతో వచ్చింది.

"భలే వారు మీరు. మ్యాగ్‌జైన్ చూస్తూండమని చెప్పి చక్కగా మోసం చేశారే నిర్మలగారూ!" అన్నాడు రామారావు.

దానికి చిరునవ్వే ఆమె జవాబు. కాఫీ తాగుతూ అడిగిందామె "రామారావుగారి చిత్రాలు మీకెలాగుంటాయి?"

"వాడి చిత్రాల కేమండీ! వాడి చిత్రం ఒకటిఈమధ్య ఫారిన్‌కూడ వెళ్ళిందని పేపర్లో పడ్డదికూడా. వాడూ నేనూ క్లాసుమేటులం. ఇవాళ సాయంత్రం యిక్కడికి వస్తున్నాడు కూడా. మీ కాయన తెలుసునా నిర్మలగారూ?"

"ఆయన నా అభిమాన చిత్రకారుడండీ. ఆయన వేసిన చిత్రాలంటే నా కెంతో ఇష్టం. జీవం ఉట్టిపడ్తూ, ఎంత చూచినా విసుగు ఉండదండీ రామారావుగారూ. ఆయన వస్తేమాత్రం నాకు పరిచయ భాగ్యం లభింపజేస్తారు గదూ!"

"తప్పకుండా– కాని... ఒక షరతు"

"చెప్పండి."

"రామా నన్ను బ్రోవరా..."మళ్ళీ ఒక సారి పాడాలి మీరు" చిరునవ్వు పెదాలమీద తొణికిస్తూ అన్నాడు రామారావు.

ఆమె పాడింది. రామారావు కళ్ళు మూసుకొని ఆ మధుర స్వరలహరిలో లీనమైపోయాడు. పాట ఆగింది. రామా

రావు కళ్ళు తెరిచాడు మైకంలోనుంచి, మైమరచి నాట్యం చేసే నాగసర్పం, నాగస్వరం ఆగిపోగానే ఆగిపోయినట్లు.

"సాయంత్రం అయిదింటికి నారూముకి కాఫీకిరావాలి. పాక శాస్త్రంలో నా ప్రావీణ్యాన్నికూడ చవిచూద్దురుగాని; మీరూ, మీ అభిమాన చిత్రకారుడు రామారావూను."

"సరేనండి...ఉంటా" అంటూ వెడుతున్న రామారావుని చూస్తూ నిలబడిపోయింది నిర్మల సంతోషంతో.

సాయంత్రమైంది. ఎండ తగ్గింది నిర్మల సింపుల్‌గా తయారై రామారావు రూముకు వెళ్ళింది. నిర్మల ఒక్కసారి స్తంభించిపోయింది. రూములో రామారావు ఒక్కడే, తను వేసిన ఒక తైల చిత్రానికి ఫినిషింగ్ టచ్చెస్ ఇస్తున్నాడు. నిర్మల కలా లేక వైష్ణవ మాయా అనుకొన్నది. తనయింట్లో అద్దెకు ఇచ్చిన టీచరు రామారావూ ప్రఖ్యాత చిత్రకారుడు రామారావు, ఒకరే అవడంమూలంగా, నిర్మల హృదయం ఆనందంలో మునిగి తేలింది.

"అయిదింటికల్లా రమ్మన్నారుగా, వచ్చేశానండోయ్ రామారావుగారూ!" అంటూ లోపలికి ప్రవేశించింది నిర్మల.

"రండి! కూర్చోండి!" అంటూ నవ్వుతూ ఆహ్వానించాడు రామారావు.

"భలే మోసం చేశారండీ! ఆర్టిస్టు రామారావుగారు నా క్లాసుమేటు అంటూ ఎన్ని మాయమాటలు చెప్పారండీ? ఇంతకీ కాఫీ చేయడంలో మీ నైపుణ్యాం చూపిస్తానన్నారు గదా! ఏదీ ఎక్కడా కాఫీ తయారుచేసిన జాడే లేదేమిటండీ" అన్నది నిర్మల.

"కాఫీ గీఫీ అంతా రెడీమేడ్ నిర్మలగారూ. ఆ చిత్రం ఎలాగుందో చెప్పండి" అంటూ ప్రక్కనే తగిలించి ఉన్న ప్లాస్కులోనుంచి రెండు కప్పుల కాఫీ తెచ్చాడు.

"చిత్రానికేముందండీ? మీ చిత్రాలగురించి నా అభిప్రాయం ప్రొద్దునే వ్యక్తం చేశాను గదండీ. ఈచిత్రంగూడా చాలా బాగుందని వేరే చెప్పాలా?" అన్నది నిర్మల.

"నిర్మలగారూ! మీ రెంతో చక్కగా పాడుతారండీ! ఈ పల్లెటూళ్ళో పడిఉంటే, మీరు రాణించేందుకు అవకాశాలు లేవు. ఎన్ని ఇబ్బందులు అయినాపడి సంగీత సాధనలో పైకి రండి. మీ గానాన్ని విన్న తరువాత యిదే మీకు చెప్పదలచుకొన్నది."

"ఈ ఊళ్ళో ఈసంగీతమే నాకు సంపాదించి పెట్టోంది. ఇవాళ ఆదివారం క్లాసులులేవు. మిగతా దినాల్లో పగటిపూట పిల్లలు వచ్చి నేర్చుకొని పోతూంటారు. వాళ్ళిచ్చే దాంతోనే వెళ్ళిపోతోంది నా జీవితం" అన్నది నిర్మల.

ఆదివారం గడచిపోయింది. రోజులు దొర్లిపోతున్నవి. ఇద్దరి కళారాధకుల మనస్తత్వాలు ఏకీభవించినవి. నిర్మల గానానికి, ఆమె కంఠంలోని మాధుర్యానికి, పరవశం చెందాడు రామారావు. రావు చిత్రించే జీవన చిత్రాలలోని జీవకళకు దాసురాలయింది నిర్మల. రోజూ సాయంత్రం పూట రావూ, నిర్మల కాలవగట్టువెంట షికారు వెళ్ళేవారు. పచ్చటి పొలాల్నీ, నక్షత్రాల్నీ చూస్తూ, పైరుగాలి తాకిడికి హృదయాలు మైమరచిపోతోంటే ఎన్నో మాటలు మాట్లాడుకొంటూ, ఒకరికొకరు పూర్తిగా అర్థం చేసుకొన్నారు.

ఒకరోజున యథావిధిగా షికారుకు వెళ్లారు ఇద్దరూ. సూర్యు డస్తమించాడు. చల్లటి పైరుగాలి తాకిడికి నిర్మల ముంగురులు రెపరెప లాడుతున్నవి. కాలవ నిర్మలంగా ప్రవహిస్తున్నది. కాలవ నీటిలో చందమామ మసక మసకగా ప్రతిబింబిస్తోంది. కాలవఒడ్డున కొంతదూరంపోయి పచ్చ గడ్డిమీద కూర్చున్నారు యిద్దరూ.

రామారావారోజు మౌనంగా ఉన్నాడు. నిర్మల నిర్మలంగా ఉంది. రామారావు హృదయంలో ఏదో తీరనిఆవేదన పీడిస్తున్నది. నిర్మల తదేకంగా ఆకాశంలో నక్షత్రాలను చూస్తూ గడ్డిపరకలు కొరుకుతున్నది.

"నిర్మలా!" పిలిచాడు రామారావు మెల్లిగా.

"నిర్మలా!" అని సంబోధించడం యిదే మొదటి సారైనా "చెప్పండి" అన్నది రామారావు ముఖంలోకి చూస్తూ నిర్మల.

"నే నడిగింది ఫలించదేమోనని అనుమానంగా ఉన్నది నిర్మలా!"

"నాయందు మీకంత అపనమ్మకం ఉందంటే, ఇన్ని రోజులనుండీ నన్నేమీ అర్థం చేసుకోలేదన్నమాటేగా?"

"నిన్ను వివాహం చేసికొని, నా జీవితం వెన్నల మయం చేసుకోవాలనిపిస్తోంది నిర్మలా!"

ఝుంఝూ మారుతానికి జలజలలాడే మాధవీలతలాగా కంపించిపోయింది నిర్మల వెంటనే తేరుకొని...

"మీ అభిప్రాయం బాగానేవుంది రామారావు గారూ! చాలా సంతోషం! నా గురించి మీరు పూర్తిగా

తెలిసికోనకుండానే మీ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారా లేక తెలిసే అడిగారా? బహుశా మీకు నా పూర్వ వృత్తాంతము తెలియదనుకుంటా."

"నీ వెనుకటి గాథతో నాకేమీ సంబంధంలేదు నిర్మలా. అది వినంగానే నా అభిప్రాయం మార్చుకొనే తక్షణికోన్మాదినికూడా కాను."

నిర్మల నిట్టూర్చింది. "నేను వివాహితను రామారావు గారూ" అన్నది నిర్మల తలవంచుకొని. రామారావు క్షణ కాలం స్తంభించిపోయాడు. తేరుకొని తలవంచుకొని వున్న వాడల్లా నిర్మల ముఖంలోకిచూచాడు. ఆమె ముఖం గంభీరంగాఉంది. నిర్మల తిరిగి చెప్పడం మొదలు పెట్టింది.

"వినండి రామారావుగారు... నా జీవితం ప్రమోదు కారిపోయింది. నాకు చిన్నప్పుడే, పదిహేనేళ్ళ ప్రాయంలోనే వివాహమైనది ప్రసాద్‌తో. అతని కప్పుడు ఇరవై ఏళ్ళుండేవి. వివాహమైన కొన్నాళ్ళకే ఆయన సైన్యంలో చేరారు. నన్ను కాటికి కాళ్ళు చాచిన మాఅమ్మదగ్గరే వదలివేసి. ఆయనక్కూడా కావలసినవాళ్ళు ఎవ్వరూ లేరు. ఆయన వెళ్ళిన రెండేళ్ళకే మా అమ్మకూడా నన్ను ఒంటరిదాన్నిచేసిపోయింది. అప్పటి నుండి సంగీతంమీదా, యీ యింటిమీదా జీవితం వెళ్ళబుచ్చుతున్నా. ఆయన వెళ్ళిన రెండేళ్ళ వరకూ ఉత్తరాలొచ్చేవి. తరువాత ఆయన దగ్గర్నుండి ఉత్తరంముక్కకూడా రాలేదు. ఒక రోజున యుద్ధంలో బాంబు పడి ఎంతోమంది మరణించినట్లు, మరణించినవారి పేర్లతోసహా పేపర్లోపడ్డాయి. ప్రాణాలు పోగొట్టుకొన్న వాళ్ళలో ప్రసాద్ కూడా ఉన్నాడు.

నా కున్న ఒక్క ఆధారం దాటిపోయారు. నేను విధవరాల్ని రామారావుగారూ!" అంటూ సూటిగా, ప్రశాంతంగా చూచింది నిర్మల

రామారావు తలవంచుకొని ఉన్నవాడల్లా తలెత్తి నిర్మలను చూచాడు. నిర్మల కళ్ళల్లో నీళ్ళు నిండినవి.

"నిన్ను చాలా బాధపెట్టాను నిర్మలా. విధి నిజంగా నీమీద చిన్నచూపు చూచింది. చిన్నప్పుడే యదార్థంగా ఎన్నో కష్టాలనుభవించావు నువ్వు. జీవన్నాటకంలో ప్రథమ ఘట్టంలోనే ఉన్నావు. ఇప్పటికైనా మించిం దేమీలేదు. నే నిన్ని రోజులనుండీ నా అభిప్రాయం వ్యక్తం చేద్దామను కొంటూనే యిన్నాళ్లూ కాలాయాపన చేస్తూ వచ్చాను. యిప్పటికయినా, నే నడిగే దిదే. నీ మోడుబారిన జీవన వృక్షాన్ని చిగురింప చేసికోవడానికి నీ కర్హత లేదా? అది నీ బాధ్యత కదూ! ఎప్పుడూ ఈ నైరాశ్యంలోనే క్రమ్మి క్రమ్మి కృళ్ళి కృశించి పోవాలనేనా నీ అభిప్రాయం నిర్మలా! జరిగి పోయినదంతా ఒక పీడ కలనుకో. అంతా మంచిపో. నీ అభి ప్రాయం తీరిగ్గా ఆలోచించుకొని చెప్పు" అంటూ లేచాడు రామారావు. నిర్మలలేచి రామారావు ననుసరించింది. ఇద్దరూ ఏ వేవో ఆలోచనల్తో ఇంటికి చేరారు.

నిర్మల యింటికివెళ్ళింది. నిర్మల హృదయం భారంగా ఉంది. పడకగదిలోకెళ్ళి, కిటికీలు తెరచింది. బయటంతా చీకటిగా ఉంది. వెన్నెల ఏమాత్రంలేదు. ఇలా కాలంవెళ్ళబుచ్చుతూంటే తన జీవితంలో కూడా వెన్నెల వేశమాత్రం కూడా లేకుండా పోతుందేమో అని అనుకొన్నది నిర్మల.

"తన అభిప్రాయాన్ని ఆలోచించి మరీ చెప్పమన్నారు. రామారావుగారు. తను మళ్ళీ వివాహం చేసుకోవాలా?" అనుకొన్నది మనస్సులో నిర్మల.

"వివాహం చేసుకోకుండా ఎన్నాళ్ళని యిట్లా గడుపుతావ్?" ప్రశ్నించింది అంతర్యం.

"ఎన్నాళ్ళని యిలా ఉండను? ఎన్నాళ్ళని ఆనందం, సంతోషం లేకుండా జీవితాన్ని నీరసంగా, నిస్సారంగా, నిరాశా, నిస్పృహలతో గడపాలి" అనుకొన్నది నిర్మల.

"తీగ ప్రాకడానికి ఏదో ఆలంబనం అవసరం-జీవనలత పెరిగి పెద్దదై పుష్పించి, పరిమళాలు వెదజల్లాలంటే జీవిత భాగస్వామికావాలి భాగస్వామిలేని జీవితానికి, ఎండిపోయిన తీగకూ వ్యత్యాసం ఏమాత్రంలేదు." ఎన్నో ఆలోచనల్తో గంటలు గడిచిపోతున్నవి. తెల్లారింది.

రామారావుకు తన నిర్ణయాన్ని, వివాహానికి సుముఖురాలైనట్లుగా తెలియబరచింది. రామారావు ఆనందానికి అవధుల్లేవు.

ఆ నెలలోనే హెడ్‌మాస్టర్ ప్రకాశరావుగారింట్లో పెద్దల సమక్షంలో నిర్మలా, రామారావుల పాణిగ్రహణం' ఏ విధమైన అడ్డంకిలేకుండా, ఘనంగా జరిగిపోయింది. అధునిక రీతుల్లో వివాహానికివచ్చిన పెద్దలందరికీ, అతని చిత్రకళా పరిచయం జరిగింది. అందరూ రామారావును ఎంతో ప్రశంసించారు. నిర్మలా, రావులు, ఒక నూతన ఆనందమయ జీవితానికి పునాదిరాయి వేసుకొన్నారు. సుఖంగా రోజులు దొర్లిపోతున్నవి.

రెండు సంవత్సరాలు గడచిపోయినవి. ఒకరోజు సాయంత్రం చీకటి పడుతున్నది. ఆకాశంలో దట్టంగా మేఘాలావరించి వున్నవి. పెద్దగా రొదచేస్తూ స్టేషన్లో రైలువచ్చి ఆగింది. ఒకకుంటివాడందులోనుండిదిగాడు. అతనికి నడవడానికి కర్ర ఆధారంగా ఉంది. బాగా గెడ్డం పెరిగిఉంది. జుట్టుకు తైల సంస్కారంలేక చిందర వందరంగా ఉంది. అతని కళ్ళు లోతుకు పీక్కుపోయి ఉన్నై. అయినా అతని నేత్రాల్లో ఏదో అర్థంకాని ఆనందం, ఎన్నాళ్ళ నుండో చూడని ఆప్త బంధువును చూడబోయేటప్పుడు కలిగే ఆతురతా కనిపిస్తున్నది. బండి దిగి రెండడుగులు ముందుకు వేశాడు ఆ కుంటి మనిషి. ఇంతలో అతనికి పూర్వ పరిచయమున్న ఒక ముసలి తాత ప్రక్కనుంచిపోతూ కనుపించాడు.

ఆ కుంటి మనిషి కేదో మనసులో మెదిలింది.

"తాతా!" కేకేశాడు. ముసలివాడొచ్చాడు. ఏంగావాలన్నట్లు కనుబొమ్మలతోనే ప్రశ్నించాడు.

"నిర్మలమ్మగారని ఈ ఊళ్ళోనే ఉండేవారు. బావున్నారా? తాతా!" ప్రశ్నించాడు కుంటివాడు.

తాతా బిగ్గరగా నవ్వాడు. ఆ తల్లి కేం? బాగానేఉంది మహాతల్లి. ఆమె ఖర్మకాకపోతే చిన్నప్పుడు పెళ్ళవడమేమిటి? కట్టుకొన్న మొగుడు మిలటరీకి పోవడమేమిటి? పోయినవాడు పోక యుద్ధంలో బాంబుపడి దరిద్రపు చావు చావడమేమిటి? పేపర్లోకూడ పడ్డది ఆయన చచ్చిపోయినట్లు... అవన్నీ కాని రోజుల్లే... ఆమెకు మళ్ళీ పెళ్ళయింది... రామారావు బాబుగారితో... పండులాంటి మొగపిల్లాడుకూడా... ఊఁ..."

"తాతా! చాలు. ఇంక చెప్పడం ఆపు తాతా" అంటూ పెద్దపెట్టున అరిచాడు కుంటివాడు. ఆకాశం కాస్త బద్దలై మీద కూలినట్లయిం దతనికి. క్రిందున్న భూమి విచ్చి పాతాళానికి దిగజారిపోయినట్లయింది. చర చరా కుంటుకొంటూ పోయి గభాలున రైలెక్కాడు.

"వీ డెవడో పిచ్చివాడ"నుకొన్నాడు చూచేవారందరు ముసలి తాతతో సహా.

రైలు బయలుదేరింది. కుంటివాడు తలుపుదగ్గరే నుంచున్నాడు. బయట గాఢాంధకారమలుముకొని ఉన్నది. చెట్లూ, పుట్టలూ, టెలిగ్రాఫ్ స్తంభాలూ, జర జరా వెనక్కి జరిగిపోతున్నవి. కుంటి మనిషి ఆకాశం వేపొకసారి చూచాడు. అప్పుడే వాన చినుకులు ప్రారంభమైనవి. ఆకాశంలో తళుక్కుమని కళ్ళు చెదరిపోయేటట్లు మెరుపు మెరిసింది. కుంటివాడు చేతికర్రను వదలిపెట్టాడు. కుంటి కాలుమీద అటూ ఇటూ తూలి పరుగిడుతున్న బండిలో నుండి ఒక్కసారి క్రింద పడిపోయాడు. ఎవరో గొలుసు లాగారు. బండి ఆగింది. కుంటివాడు ప్రాణం విడిచాడు. మర్నాడు ఒక కుంటివాడు రైల్లో నుండి, దూకి మరణించాడని పేపర్లో పడ్డది.



# అన్వేషణ

"ఈ శిల్పంధర ఎంతో దయచేసి చెబుతారా?" ఒక సుందరి మధుర గళస్వనం అతని లీనతను భంగపరచింది.

రవిబాబు తిరిగి చూచాడు. అతను ఒక్కసారి సంభ్రమాశ్చర్యాలలో మునిగితేలాడు. అతనిముందు 'కామిని' నిలబడిఉన్నది. సందేహాస్పదంగా తిరిగి ఆ యువతినే రెప్ప వాల్చకుండా పరీక్షగా చూచాడు రవిబాబు. ఆమె 'కామిని' కాదు. ఆమెకు దగ్గరగా ఉన్నవాడల్లా, ఏదో సంకోచంతో వెనుకకు రెండడుగులువేసి, జీరబోయిన కంఠంతో ఏదో అర్థం కాని ఆవేదనా భరితమైన స్వరంతో, "ఆ శిల్పం అమ్మేది కాదమ్మా!" అని మాత్రం అనగలిగాడు.

ఆమె వదనంలో ఆ శిల్పాన్ని కొని తీసుకవెళ్ళాలనే ప్రగాఢమైన వాంఛా ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రెండు మూడుసార్లు ఆమె తిరిగి ప్రార్థనా పూర్వకంగా రవిబాబును అడిగిచూచింది. కాని, రవిబాబుకు ఆ శిల్పాన్ని మూల్యానికి అమ్మివేయడం ఇష్టంలేదు. సమాధానం నిరాశ కలిగించడంతో, ఆ యువతి వ్యధాభరిత హృదయంతో నిరాశగా కదలి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ ఆ శిల్పాన్ని తనివి తీరా చూసింది.

ఆమె వెళ్ళగానే రవిబాబు వేగంగా రెండడుగులు దగ్గరలోఉన్న కిటికీ దగ్గరకు వేసి అందులోనుంచి ఆమె వెళ్ళిన

దిక్కే చూడసాగాడు. ఆమె కనుమరుగయ్యేవరకు పరీక్షగా ఆమెను చూడసాగాడు.

రవిబాబు అంటే, కవోష్ణ రక్తంతో ఉరకలువేసే ఉత్సాహంతో ఉండే పాతికేళ్ళ నవయువకుడు కాదు; రవిబాబు వయసు 45 సంవత్సరాలు. జీవిత సర్వస్వాన్నీ శిల్పకళామతల్లికి అంకితంచేసి, ఉలి సుత్తులకు తన హస్త నైపుణ్యం తోడుకాగా, నిర్జీవ పాషాణాలకు జీవంపోసి, సజీవ ప్రతిమా రాజాలుగా తయారుచేసి, కళాసేవచేస్తూ ఉదర పోషణం చేసుకొనే ఒక సంపూర్ణ కళామూర్తి రవిబాబు. ఆ యువతి అమ్మమని అడిగిన ప్రతిమను అమ్మ నిరాకరించ డానికిగల కారణం రవిబాబుకు, ఆ శిల్పానికిగల అవినాభావ సంభంధం. ఇదేమిటీ ఆవేదన? ఇలా తన మనస్సు అర్థంలేని వ్యాకులతతో, భరింపశక్యంగాని బాధలతో సతమతమౌతున్న దేమిటి? ఇన్నిరోజులు-రోజులేమిటి-ఇన్ని సంవత్సరాల అనంతరం గత సంఘటనల తుఫానురేగి, తన హృదయసాగరాన్ని కల్లోలితం చేస్తున్నది.

చాలా సేపటి వరకు రవిబాబు కిటికీ దగ్గరే నించొని ఆ వైపే చూడ సాగాడు. ఆ యువతి కనుమరుగై పోయింది. అప్పుడే చంద్రోదయమైంది. పున్నమి... పున్నమి చంద్రుని పండువెన్నెల సమస్త జీవులనూ అమృతవాహినిలో ముంచెత్తుతున్నది. శీతల కిరణ కాంతులు కిటికీగుండా లోనికి వచ్చి రవిబాబుమీద పడుతున్నాయి.

రవిబాబు నిండు చంద్రుని అందాన్ని తిలకించలేదు. శీతల కిరణ పుంజపు పరిష్వగంలో మేను మైమరచిపోనూలేదు.

కాని మొదలకుండా ఆలోచనా నిమగ్నుడై, తన మనోరంగ కారంలో ఏదో వెతుక్కొంటున్నాడు.

ఇరవై నిండు సంవత్సరాల క్రిందటి ఒక కరుణామయ మైన జీవితం, విస్మృతి కఠిన శృంఖలాలను త్రెంచుకొని అతని కళ్ళముందు తారట్లాడింది. తాము నలుగురూ కలిసి ఉండే వాళ్ళు, ఒక హాస్టల్లో— కమలాకాంత్, రవిశాబు, విశ్వం, శ్రీకాంత్. నలుగురిలోనూ ఏదో కళాత్మకమైన శక్తి నిగూఢంగా దాగి ఉండడమే వారి స్నేహానికి కారణం.

కమలాకాంత్ కవి. ఎప్పుడూ ఏదో ఆలోచనా నిమగ్నుడై, ఆకాశంలోకి చూస్తూనో, లేక బాధామయ జీవుల జీవిత పరిధుల్లోకి తరచి - తరచిచూస్తూనో తన హృదయ క్షోభను కాగితంమీద విపులీకరించి కవితలు, గేయాలూ వ్రాస్తూ మిగతావారికి వినిపించి తను ఏదో పెద్ద ఘనకార్యం చేశాననే తృప్తితో ఆనందించేవాడు.

విశ్వం చిత్రకారుడు—ప్రతి వస్తువులోని అందాన్ని పరిశీలించి చూడడం, ఏవేవో ఊహలను దానికి మేళవించి ఆ సౌందర్యాన్ని తన హస్త నైపుణ్యంతో అమూల్యమైన కుంచెద్వారా కాగితంమీద ఉంచి, ఆ సౌందర్యానికి రూప కల్పనచేసి ప్రతిష్టించడం అతని జీవిత పరమావధి.

ఇక శ్రీకాంత్ సంగీతకారుడు. సితార్ వాద్యం వాయించడంలో గొప్ప నైపుణ్యం ఉన్నదతనికి. అతను అలా సితార్ ముట్టుకొని స్వరకంపన కలుగజేశాడంటే, అందరూ ఆ తీయని స్వర లహరిలో మునిగి, తన్మయులై పోవలసిందే.

ఇక రవిశాబు సరేసరి శిల్పి. జీవంలేని శిథిల పాషాణానికి ఒక సజీవ సౌందర్యమూర్తి రూపం కలిగించడమే అతనిలోని ప్రత్యేకత.

ఆ నలుగురు కళాపిపాసకుల జీవితం వారివారి కళారాధనలతో, మందగతితో అలా నడుస్తున్నది.

ఇంతలో వారి జీవితంలో 'కామిని' ప్రవేశించింది. హాస్టల్ క్రింది అంతస్తులో ఉండేదామె. కామినితో నలుగురికీ పరిచయమైంది. పరిచయం స్నేహరూపం దాల్చింది. నలుగురూ తమతమ హద్దులను ఆలోచించుకొన్నారు. కామిని అందమైనదీ, శీలవతిన్నీ. నలుగురూ ఆమెకు స్నేహితులయ్యారు. నలుగురూ తమ కళానైపుణ్యాలను ఆమెకు ప్రదర్శించి తృప్తిపడేవాళ్ళు. కామిని అప్పుడు న్యాయమూర్తి స్థానం ఆక్రమించేది. వాళ్ళతో కలసి నవ్వుతూ మాట్లాడేది. ఉత్తమోత్తమమయిన దానిని ఎన్నికచేసి నిర్ణయించేది.

అటుపోయి సితార్ మధుర తంత్రుల్ని మీటి, తంత్రీనాద పుటల్లో తేలిపోయేది. కమలాకాంత్ కవితలను చదివి, తీయటి ఊహాలోకాల్లో విహరించేది. అటు విశ్వం చేతిలోని కుంచె తీసుకొని బొమ్మకు రంగు వేయడానికి ప్రయత్నం చేస్తూ కిలాకిలా నవ్వేది. రవిశాబు చేతిలోని సుత్తె తీసుకొని రాతిముక్కలను ఒక రూపకల్పనచేసే ప్రయత్నంలో మునిగిపోయేది.

ఆమె వెళ్ళిపోగానే నలుగురూ ఆమె గురించే ప్రసంగించేవాళ్ళు.

"ప్రపంచంలోని సౌందర్యమంతా ఈమెలోనే మూర్తీభవించిందిరా! సౌందర్యరాశి!" అంటూ కిలారుమని నవ్వేవాడు విశ్వం; సౌందర్య పిపాసితుడు.

"నా మృదుమధుర కవితారాజాల శ్రీప్రకరా!" కమలాకాంత్ దూరాకాశంలో ఏదో వెతుక్కొంటూ అనేవాడు.

"అమూల్య సౌందర్యఖనీ! సఖీ! కామినీ! పున్నమి నాటి యామినీ! శోభినీ! నా హృదయ గామినీ!" అని తన సితార్ తీగలను కదిపి వాయిస్తూ, బాణీలను కడుతూ, "ఎలా ఉందిరా?" అంటూ సగర్వంగా నవ్వుతూ చూచేవాడు శ్రీకాంత్. "నా ఈ గానం ఎంత మృదుమధురంగా ఉందో ఆమెకూడా..." అంటూ పగలబడి నవ్వేవాడు శ్రీకాంత్.

రవిబాబు వారనే మాటలను వింటూ అన్నింటికీ తల ఊపేవాడు. అతని శిల్పాల్లో కామిని అందచందాలు ఎక్కడో అక్కడ ప్రతిఫలించేవి. "మంచి స్నేహితురాలే లే" అను కొంటూ అందరూ నవ్వుకొనేవారు. "ప్రపంచంలో ఎవ్వరు ఎవరికి మిత్రులురా? అంతా ఏదో స్వార్థం. స్వార్థంతో గూడిన స్నేహితాలే అన్నీనీ" అన్నాడు కమలాకాంత్ ఒకరోజు మాటల్లో.

"ఏమిట్రోయ్, కవిరాజా! ఇవాళ ఏదో మెట్ట వేదాంతం చెపేస్తున్నావ్. ఏమిటి సంగతి? సవిస్తరంగా చెప్పు" అని అందరూ గోలచేశారు.

"ఏముందిరా! ఇది నగ్న సత్యంరా భాయీ ఆమె నా సామీప్యంలో ఉంటే నాకు ప్రేరణ దొరుకుతుంది. నాకు భావాలు తట్టుతాయి. నా కవితా ప్రవంతి సాక్షిగా, తీయగా

సాగుతుంది. అలాగే విశ్వం చిత్రీకరించడానికి భావాలు స్కెచ్‌లు..."

"ఏమోరా బాబూ! మీకేమోగాని, ఆమె రాగానే ఆమె సుందర శరీరం, పుష్పభ్రమరాన్ని ఆకర్షించిన విధంగా నన్నాకర్షిం చేస్తుందిరా! ఎంత సౌందర్యం! అసలు ఆమె ముందుపుట్టి, తరువాతే అందం, చందం, సౌకుమార్యం అనే పదాలు పుట్టిఉంటాయిరా!" అంటూ శ్రీకాంత్ పగలబడి నవ్వేవాడు. రవిబాబు ఒళ్ళుమండి కోపంతో వణికిపోయేది శ్రీకాంత్ చేష్టల్ని చూస్తుంటే. "ఛీ! వెధవ నీచపు టూహాలు, మురికి ఉద్దేశాలురా మీవి! మీరందరూ జీవితాన్ని కుత్సితపు దృష్టితో చూచేవాళ్ళురా. సిగ్గులేదూ, ఇష్టంవచ్చినట్లు వాగడానికి?" అంటూ తన కోపాన్నంతా వెళ్ళగక్కేవాడు రవిబాబు.

"మరి నువ్వో? ఒరేయ్ రవీ! నువ్వామెను దేవతగా పూజిస్తున్నావా? పూజించు నాయనా. ఎవరు వద్దన్నారు? ఆమె సుందర విగ్రహాన్ని చెక్కి, ఆమె అవయవాలలోని ప్రతి సౌందర్యపు వంపునూ దానిలో ప్రతిఫలింపజేసి, ముందుంచుకొని రేయింబవళ్ళు పూజిస్తూ, తపస్సుచెయ్యి నాన్నా. వూరికే స్నేహితం చేయడంలో లాభం ఏముంది?" అందరూకలిసి వ్యంగ్యధోరణిలో రవిబాబుతో వాదించేవారు.

"ఒరేయ్ రవీ! నువ్వేమో అనుకొంటున్నావు కాని, సౌందర్యాన్ని అనుభవించి, అందులోని మధురిమను పొందడంలోనే జీవిత సఫలిత ఉన్నది. సౌందర్యాన్ని వూరికే ఆరా

ధించడం మూర్ఖులు చేసేపని. వట్టి మూర్ఖత్వం" అనేవాడు శ్రీకాంత్.

ఇటువంటి వాతావరణంలో, రవిబాబుకు ఉండడానికి మనస్కరించేది గాదు. ఎంతో కష్టంగా ఉండేది.

ఒక సారి కామినిని పిలిచి "కామినీ! అసలు అక్కడ కెందుకొస్తావ్? సంకుచిత భావాలూ, కుత్సితపు మనస్తత్వాలూ పేరుకొని కరుడు కట్టుకొనిపోయిన మనుష్యులతో నా నీ స్నేహం? సావధానంగా ఆలోచించుకో. ఎవరిజోలీ లేకుండా జీవితాన్ని గడుపుకో" అని చెప్పి చూశాడు. ఎన్ని సార్లు చెప్పినా ఆమె వింటేగా! ఎప్పటి లాగానే ఉంటూ, తన పద్ధతిని మార్చుకోలేదు.

ఒక రోజున రవిబాబు గదిలోకివచ్చింది కామిని. "రవిబాబూ! నా మూర్తిని చెక్కివ్వరా?" అడిగింది గోముగా.

"మీ రేమంత అందంగా ఉన్నారనీ!" తప్పించుకోవడానికి ఆమె అందాన్ని అడ్డుపెట్టాడు రవిబాబు.

"ఏం ఫరవాలేదులెండి. అందంగా లేకపోతే లేకపోయినాను రవిబాబూ! కనీసం నన్ను నేను చూచుకొని తృప్తి పడడానికైనా నా మూర్తిని చెక్కి యివ్వరూ?" ప్రాధేయపూర్వకంగా అడిగిందామె.

"మిమ్మల్ని మీరు చూచుకొని తృప్తి పడడానికి మీ ఇంట్లో అద్దం చాలాదా కామినీ?"

"కాని, అద్దం మాత్రం మీ రన్న 'అందంగా లేరు' అనే మాట అనలేదే?"

"అయితే అద్దం అబద్ధం ఆడి ఉండాలి."

"పోనీండి. మీరే సత్యసంధులు. ఒప్పుకొన్నానుగా! ప్రాధేయపడ్తున్నాను. నా మూర్తిని చెక్కియివ్వరూ రవి బాబూ!"

"ఎప్పుడైనా నా మనసు సరిగ్గా ఉన్నప్పుడు రండి. తయారు చేస్తాను."

"మీ మన సెప్పుడు సరిగా ఉంటుంది?"

"తెలియదు కామినీ"అంటూ ఓరగా రవిబాబు కామిని వదనంవైపు చూచాడు ఆమె రెప్ప వాల్చకుండా రవిబాబు వైపే చూస్తున్నది. ఆమె ముఖ కవళికలు మారుతున్నాయి. ఆమెకు తెలుసు ఈ రవిబాబు తనకు తానుగా ఈ మాటలు అనడంలేదని. లేకపోతే ఎప్పుడో తన సుందరవదనం, తన రూపు రేఖలు రవిబాబు హస్తాలద్వారా పాషాణంలో ప్రతి ఫలించి, ప్రజ్వలించి ఉండేవి. సమాజపు సంకెళ్ళలో బంధింప బడిన బంధితు డతను.

అ రోజు పూర్ణిమ. విశ్వం మాంచి హుషారుగా ఉన్నాడు. ప్రపంచమంతా వెన్నెల వ్యాపించి ఉంది. కమలా కాంత్ ఏదో సుందర కవితా రచనా నిమగ్నుడై, ఏ వేవో ఊహా లోకాల్లో విహరిస్తున్నాడు.

రవిబాబు నెమ్మదిగా బాల్కనీలో పచార్లు చేస్తు న్నాడు. నాలుగు మూలలా నిశ్శబ్దం ఆవరించింది. కేవలం శ్రీకాంత్ సితార్ మధుర తరంగాలు ఆ నీరవ నిశ్శబ్దతను భంగపరుస్తున్నాయి.

అనుకోకుండా కామిని పైకి వచ్చింది. కోపంతో ఏదో చెప్పాలని వచ్చిన ట్లున్నది ఆమె వదనం.

"రవిబాబూ! శ్రీకాంత్‌గారితో చెప్పండి సితార్ వాయించవద్దని. నాకు నిద్రాభంగంగా ఉన్నది" అన్నదామె రవిబాబుతో.

రవిబాబు ఒకక్షణం ఊరుకొని అన్నాడు: "శ్రీకాంత్ మనం చెప్పినట్లు విని పాటించడానికి మన చేతిక్రింది మనిషా కామినీ? అతని ఇష్టప్రకారం నడచుకోవడానికి అతనికి సంపూర్ణాధికారం ఉన్నది, తెలిసిందా?"

"అలాగా? అయితే నేనే స్వయంగా వెళ్ళి చెబుతాను" అంటూ గబగబా అడుగులు వేసుకుంటూ శ్రీకాంత్ ఉన్న గదివైపు నడిచింది కామిని.

శ్రీకాంత్ తన వాయిద్యంలో సంపూర్ణంగా మునిగిపోయి ఉన్నాడు. అతని హస్తం సితార్ తంత్రులపై నాట్యమాడుతున్నది.

రవిబాబు కామినిని ఆపి 'ఓసి పిచ్చిదానా! ఆ సంగీత ప్రవాహాన్ని ఆపుచేయగలవా? వెళ్ళకు. ఆగిపో!' అని ఆపు చేద్దామనుకొన్నాడు. కాని అతని స్వభావానుగుణంగా మెదలకుండా ఊరుకొన్నాడు.

కామిని, శ్రీకాంత్ వద్దకు వెళ్ళింది. శ్రీకాంత్ సితార్ స్వరంలో ఉద్వేగం ఎక్కువైంది. కొంతసేపటికి సితార్ ధ్వని ఉద్ధృతంగా మారింది. తీగలు గరగరమని చప్పుడుచేస్తూ తెగిపోయిన ధ్వని వినిపించింది రవిబాబుకు. తరువాత శ్రీకాంత్, కామినుల గలగలమని నవ్వే ధ్వని వినిపించింది. తర్వాత అంతా నిశ్శబ్దం.

•

రవిబాబు గట్టిగా కళ్ళు మూసుకొన్నాడు. చంద్రుడు అతనికి మసకగా కనిపించాడు. పిచ్చివాడి మాదిరిగా మెట్లు ఎక్కుతూ తన గదిలోకిపోయి పడ్డాడు.

'శ్రీకాంత్ అన్నది అక్షరాలా యధార్థం. సౌంద ర్యాన్ని అనుభవించడంలోనే ఆనందమట. ఆరాధించడం వట్టి మూర్ఖత్వంట' అనుకొన్నాడు రవిబాబు.

మామూలుగా తెల్లవారింది. రవిబాబు హాస్టల్ వదలి ఇంటికెళ్ళిపోయాడు, ఆ విధంగానైనా మనస్సుకు ప్రశాంతత లభిస్తుందేమోనని. కాని ఇంటివద్ద మరీ అశాంతి చెల రేగడంతో హాస్టల్‌కే తిరిగివచ్చాడు వారంరోజుల తరువాత.

పూర్తిగా ప్రపంచమే మారిపోయినట్లుంది. శ్రీకాంత్ హాస్టల్‌లోలేడు. క్రింద అంతస్తులో కామిని అసలు లేనేలేదు. విశ్వం ఎక్కడికెళ్ళాడో తెలియదు. కమలా కాంత్ మాత్రం ఒక్కడే ఉన్నాడు ఎప్పటిమాదిరిగా. ఆకాశంవైపు దృష్టిసారించి, అర్థంలేని అడ్డదిడ్డపు కవితలు రచిస్తూ- అతని వదనాన్ని చూసి రవిబాబుకు కళ్ళు చెమర్చినవి.

"రవిబాబూ! నువ్వు విన్నావా ఈ సంగతి? శ్రీకాంత్ లేడూ! ఆ దరిద్రుడు ఏంచేశాడో తెలుసా? ఆ అమాయకపు కామిని జీవిత కుసుమాన్ని సంపూర్ణంగా ఆఘ్రాణించి, నిస్సారంచేసి సర్వనాశనం చేశాడు. కామిని అన్నకీ విషయం తెలిసి, శ్రీకాంత్‌ను తుపాకితో కాల్చి చంపేశాడు ఎక్కడికో వెళ్తుంటే. విశ్వం భయపడి హాస్టల్‌వదలి వెళ్ళి పోయాడు ఎక్కడికో" అని జరిగిన విషయం యావత్తూ వివ రించాడు రవిబాబుకు, కమలాకాంత్.

"మరి కామిని ఏమయింది కమలా?" ఆతురతగా కమలాకాంత్ బాహువులను కుదిలించివేస్తూ, వాడిపోయిన అధరాలతో అడిగాడు రవిబాబు.

"ఆమె జాడకూడ తెలియదు రవీ! ఆమె అన్నను మాత్రం పోలీసులు పట్టుకెళ్ళి జైల్లో తోశారు."

"మరి నువ్వేం చేస్తున్నావ్?" పిచ్చిగాచూస్తూ ప్రశ్నించాడు రవిబాబు.

"తమాషా చూస్తున్నా రవిబాబూ! నిజంగా తమాషాగా లేదూ?"

"ఛీ! సిగ్గులేకిపోతేసరి. తమాషా చూస్తున్నాడట—తమాషా! ఎంత పిరికి మనస్తత్వం నీది? నీచుడివి. ఇంత రభస జరిగినా నువ్వు ఇలా నిర్వికారంగా ఏమీ పట్టనట్లు ఉండగలిగావంటే నీవెంత పాషండుడివి కమలాకాంత్! ఛీ! నాముందు లేచిఫో—పోవేం?"

"ఏమిటి రవీ! నువ్వుకూడ అలాగంటావేం? నేనూ ప్రాణం బలిచేయాలంటావు? ఇతర్ల విషయాలలోపడి, కష్టాల్లో ఇరుక్కోనడం మూర్ఖత్వం రవీ. అది నా తత్వానికి పూర్తిగా విరుద్ధం. వారికి బుద్ధిలేక కష్టాల్లోపడితే నాకేం సంబంధం? నువ్వేమన్నా, నా ఉద్దేశ్యాలు నావి. నీభావాలూ ఉద్దేశ్యాలూ నామీద రుద్దటానికి ప్రయత్నం చేయబోకు. నాకు జీవితపు వాస్తవికతనుండి దూరంగా పారిపోవడం చేత కాదు రవీ! విశ్వం పారిపోయాడు. ఎందుకు? పిరికివాడు అతను, అంతే. హాస్టలంతా ఖాళీగా పడివుంది. ప్రతిగదిలోనూ నీరవ నిశ్శబ్దత, ప్రశాంతత నిండి వున్నాయి. నేనేమో, నా కళ

ఏమో! నా కళా సహకారంతో ఈ దుర్ఘటనకు ఒక కవితా రూపం ఇచ్చాను. అత్యాచారాలు చేసేవారికి, వారుచేసే ఘోరకృత్యాలు వారి కళ్ళకు కట్టేటట్లు చూపించి, వాళ్ళని వాళ్ళు తెలుసుకొనేటట్లు చేస్తాను. రండి, రవిబాబూ. కూర్చోండి. నా కవిత వినిపిస్తా."

కాని రవిబాబు కవిత వినలేదు. కనీసం కమలా కాంత్ తో ఒకమాటకూడ మాట్లాడలేదు. కామిని జీవితం ఎలా పరిణమించిందో కదా! రవిబాబు ఆమెను గురించే ఆలోచనలతో వెళ్ళిపోయాడు ఆమె అన్వేషణలోనే. అప్పటినుండి ఇప్పటివరకు ఆమె అన్వేషణలోనే నిమగ్నుడయ్యాడు. ఏదో అర్థంకాని అనుబంధం, అవినాభావ సంబంధం.

నిండు ఇరవై సంవత్సరాలు గడచిపోయినాయి ఆమె అన్వేషణలోనే. పున్నమి చంద్రుడు తన చల్లని వెన్నెల ప్రసరింపజేశాడు. చీకటి వ్యాపించింది. వసంతం వచ్చింది. ఎన్నో గ్రీష్మాలు వచ్చివెళ్ళినవి. కాని అతని ధ్యాస దేని మీదాలేదు. రేయింబవళ్ళు కామినీ ప్రతిమకు రూపం కల్పిస్తూ ఉన్నాడు రవిబాబు.

మూర్తి తయారవుతున్నది. అసలు ఈ ఇవరవై సంవత్సరాలూ రవిబాబు జీవించే ఉన్నాడంటే, ఈ విగ్రహమే కారణం. ఆమె తన కంటికి ఎప్పుడైనా కన్పిస్తుందనే ఆశతోనే.

కామిని రూపు రేఖలను ఎంతో శ్రమించి, అమితమైన ప్రేమ వాత్సల్యాలతో ఈ శిల్పం రూపంలో సురక్షితంగా

బంధించి వేశాడు రవిబాబు. ఆమూర్తిని చూచుకోడానికైనా కామిని తప్పక వచ్చి తీరుతుంది అనుకొన్నాడు.

కాని రాలేదు కామిని. ఆమె రాక కోసం రవిబాబు ప్రతి క్షణాన్నీ లెక్కపెడుతూ క్షణ మొక యుగంగా గడుపుతున్నాడు.

కాని, ఫలితం నిరాశే.

తిరిగి మళ్ళీ ఈ యువతి వచ్చింది అనుకోకుండా. పూర్తిగా కామిని మాదిరిగానే ఉన్నది. ఆమె రాకతో మాని పోబోతున్న గాయాలు తిరిగి రేగినవి. ఆరిపోతున్న జ్వాలలు ద్విగుణీకృత మయినవి.

ఆ యువతి వెళ్ళిపోగానే గత జీవితపు తలపుల మైకం నుంచి తేరుకుని, దీర్ఘంగా విశ్వాసం విడిచి, కొంతసేపు ఇటూ అటూ పచార్లు చేశాడు. 'కనీసం ఆ యువతి పేరైనా అడిగి తెలుసుకోలేదే! ఆమె ఎవరి తాలూకోకూడా తెలుసుకో లేదు తను. ఎక్కడినుంచి వచ్చిం దీమె? ఈ ప్రతిమను కొనా లని ఎందుకంతగా తహ తహ, ఉత్సుకత కనబరుస్తున్నది? ఆమె మళ్ళా వస్తుందో, రాదో!' అనుకుంటూ ఆమెను గురించే ఎంతోసేపు ఆలోచిస్తూ గడిపాడు రవి.

మర్నాడు అదే వేళకు ఆ యువతి మళ్ళీ వచ్చింది.

"మీరు ఈ మూర్తిని నాకు తప్పకుండా ఇచ్చేయాలి; ప్రాధేయ పడుతున్నాను. ఎంత ధరయినా సరే" అన్నది రవి బాబు నుద్దేశిస్తూ.

"ఇన్ని విగ్రహాలూ, ఇన్ని శిల్పాలూ ఉన్నవికదా! దానిన్నే ఇవ్వనన్నా ఎందుకు పదే పదే కోరుతున్నావు అమ్మాయ్!" రవిబాబు అడిగాడు సూటిగా.

"నాకు కళ అంటే ప్రత్యేకమైన అభిమానం మాత్రం ఏమీలేదు. కాని, ఈ ప్రతిమయెడ నాకొక రకమైన ప్రత్యేకమైన గౌరవం, అభిమానం ఉన్నాయి" అన్నదామె వేదనాభరితమైన కంఠంతో.

రవిబాబు ఆ యువతి వైపు రెప్పవాల్చకుండాచూస్తూ "ఏ విధమైన గౌరవ భావం అమ్మాయ్!" అన్నాడు.

ఆమె నయనపు టంచుల్లో వెచ్చటి కన్నీరు తళ తళ మెరిసింది. ఆమె చెక్కిళ్ళు చిక్కటి కన్నీటితో ఆర్ద్రమయినవి జీరబోయిన గొంతుకతో, కన్నీరు చెక్కిళ్ళమీద జారుతుండగా "ఈ ప్రతిమ గౌరవనీయురాలైన నా మాతృమూర్తిది. ఆ అనుబంధమే మిమ్మల్ని ఈ ప్రతిమను అమ్మమని పదే పదే ప్రాధేయ పడేటట్లు చేస్తున్నది" అన్న దామె.

రవిబాబు అదిరిపోయాడు. అతని నవనాడులూ క్షణకాలం స్తంభించి కోలుకున్నాయి. దీర్ఘంగా ఊపిరి పీల్చి "అయితే ఆ మూర్తిని తీసుకు వెళ్లు అమ్మాయ్!" అన్నాడు శాంత స్వరంతో.

ఆ యువతి ఒక్కసారి ఆ మూర్తిని కావలించుకొన్నది. తరువాత దానిని తీసుకొని ప్రపంచంలోని ధన సంపదంతా లభ్యమైనట్లుగా అవధుల్లేని ఆనందంతో వెళ్ళిపోయింది.

"మీ మాతృమూర్తికి నా వందనాలు చెప్పమ్మా" అన్నాడు రవిబాబు.

"ఆమె ఇప్పుడు ఈలోకంలో లేదు. నన్నువిడిచి శాశ్వతంగా దూరమైపోయిందండీ" అన్నది డగ్గుతికతో ఆయువతి.

గాలి వేగానికి కిటికీ రెక్కలు టపటపా కొట్టుకొన్నాయి. బయట తోటలోని పూల వాసన గదిలోకి వ్యాపించింది. రవిబాబుకు ఆమె వెళ్ళిపోవడంకూడా తెలియదు. ఆ ప్రతిమను అంతకు ముందుంచిన స్థలంలా రవిబాబు హృదయంకూడా ఖాళీగా ఉన్నది.

మళ్ళీ ఆ యువతి మరుసటి రోజు వచ్చింది. రవిబాబు కుర్చీలోకూర్చుని కిటికీలోనుండి తోటలోకిచూస్తూ కూర్చొని ఉన్నాడు. ఆ యువతి మెల్లిగా అడుగులు వేస్తూ అతని వెనకాల నిలుచున్నది.

సహజ మృదు స్వరంతో, కృతజ్ఞతా భావంతో "క్షమించండి! మీ పే రేమిటోగాని, నిన్న మీకు ఆ శిల్పం మూల్యం ఇవ్వడమే మరిచాను. కనీసం కృతజ్ఞతలుగూడా చెప్పకుండా వెళ్ళిపోయాను" అన్న దామె.

కాని జవాబు సూన్యం.

ఏమీ జవాబు రాకపోడంతో వెళ్ళి రవిబాబు చెయ్యి ముట్టుకొన్నది. మరుక్షణం అతని ముఖం చూచిఆమె నిలువునా స్తంభించిపోయింది. వెనక్కు రెండడుగులువేసి, వెంటనే పిచ్చిదాని మాదిరిగా భయంతో అక్కడినుండి పరుగెత్తడం మొదలు పెట్టింది. ఎంత విచిత్రం... పాషాణం మూల్యం మనిషి జీవితం.

రవిబాబు ప్రాణవాయువులు కామినిని అన్వేషిస్తూ, అనంత వాయువుల్లో కలిసి వెళ్ళిపోయినవి.

# రాగద్వేషాలు

"మిస్ అరుణా!"

"యస్, డాక్టర్!"

"నాల్గో నెంబర్ గదిలో డెలివరీ కేసొకటుంది. నువ్వు టేకప్ చెయ్...చాల బాధపడ్తోందటామె" అన్నది లేడీ డాక్టర్.

"ఓకే, డాక్టర్!" అంటూ అరుణ గబగబా అడుగు వేస్తు ముందున్న వార్డుకేసి నడచింది.

నాల్గో నెంబర్ గదిలోనుండి బాధామిళితమైనమూలుగు వినపడుతున్నది. ఎర్రని శరీరం, వాడిపోయిన ముఖ వర్చస్సు ఆమెది అరుణ అంతాచూచి పరిస్థితి అవగాహన చేసికొన్నది. గదిలో మూలగా దాయా నీలమ్మ నమలడానికి పొగాకు నలుపుతోంది అరచేతిలో వేసుకొని."

"నీలమ్మా!"

"అమ్మా!"

"ఈమెను డెలివరీ వార్డులోనికి తీసుకొసిరా" అని చెప్పి చకచకా నడుస్తూ వెళ్ళిపోయింది అరుణ.

తనూ ఒక ముద్దులబాబుకు తల్లయింది. తనూ మాతృత్వంలోని మాధుర్యాన్ని చవిచూచింది. తన చిన్నారి రవి కప్పుడే మూడేళ్లు. "బోసినోటితో వచ్చీరాని మాటల్తో ముద్దుగా మమ్మా అని పిలుస్తుంటే, ఎంతో ముద్దొస్తూం

టుంది. డ్యూటీనుండి ఇంటికి వెళ్ళగానే కాళ్ళను పెనవేస్తాడు. బాబు ఇప్పుడేం చేస్తూంటాడో, దాయాతో ఆడుకొంటూ ఉంటాడు—నా ముద్దుల రవి" అని అనుకొంటూ ఉండగానే, నీలమ్మ స్ట్రెచ్చర్‌తో ప్రవేశించింది. అప్పుడే ప్రపంచంలో కడుగుపెట్టిన ఆ పసిగుడ్డును చూచి, రిజిష్టర్‌లో నెంబరు వేసి కొని, తూకాన్ని వ్రాసుకొని, తుండుగుడ్డలో చుట్టి, నీలమ్మ తీసికొని వెళ్ళిపోయింది. అరుణ ఆ యువతికి మందు త్రాగించింది. కొద్దిసేపటికి కళ్ళు తెరచిందామె. ఆమె సన్నగా మూల గడంతో అరుణ అటువైపు తిరిగింది.

"మీకు పుత్రరత్నం కలిగాడు సుమండీ!" అన్నది అరుణ చిరునవ్వు నవ్వుతూ ఆమె వైపుచూచి.

ఆమె పచ్చటి వదనంలో క్షణకాలం సంతోషం వెల్లి విరిసింది. ఆమె లజ్జావదనంలో వేయివెన్నెలలు కాచినట్లు ఆనందం స్పష్టంగా గోచరించింది. వెంటనే ఆమె చూపులు బలహీనంగా వాలిపోయినవి. తిరిగి కళ్ళు తెరచి నాల్గువైపులా చూచిందామె.

"ఏమండోయ్! భయపడ్తున్నారా? ఏమీ భయమవ సరంలేదు. మీ బాబు క్షేమంగానే ఉన్నాడు" అన్నది అరుణ.

"ఎక్కడున్నాడు? ఏడీ?" అన్నదామె ఆతృతతో.

ఇప్పుడే మీ దగ్గర కొస్తాడుగా – ఏమీ ఆదుర్దా పడ కండి" అన్నది అరుణ.

ఆ యువతి వర్చసు అరుణ నెంతో ఆకర్షించింది. కొద్ది క్షణాల క్రితం మాతృత్వాన్ని చవిచూడడం మూలంగా, సహజమైన లజ్జా భారంతో, ఆమె వదనం పండి, రసభరితమైన

ద్రాక్షపండ్ల వలె కనుపించింది అరుణకు. అరుణ ఒకసారి తన గతంలోకి పోయింది. తనుకూడా ఒక రోజున ఆస్పత్రిలో యిలాగే పడిఉంది. అప్పటి దుస్థితి సంఘటనలు, అసలా గతాన్ని తలచుకొంటేనే అరుణ నిలువునా, ఏదో అవ్యక్త మైన భయంతో వణకిపోతుంది. ఆ రోజున... అబ్బ... తనకు భగవంతుడు తప్ప, ఎవ్వరూ దిక్కులేరు. తన ప్రథమ సంతాన మైన రవి, తన ముద్దుల రవి, తన వళ్ళో పడగానే తనెంతి దుఃఖించింది!... తన చిన్నారి రవికోసం తనెన్నో కష్టాల్ని అనుభవించింది. అచ్చంగా హాస్పిటల్ వాళ్ళిచ్చే రొట్టె, పాలతోనే ఎంతో కష్టంతో గడిపేది తాను.

కొన్ని రోజులకు హాస్పిటల్‌నుండి డిశ్చార్జ్ చేశారు. ఇతరుల దయను ఆధారంగా, అండగా ఉంచుకొని తను రోజులు వెళ్ళబుచ్చింది- నర్సు ట్రైనింగ్ తీసికొంది. నర్సు పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. నర్సు ఉద్యోగం దొరికింది. మంచి జీతం ఫరవాలేదు. ఇల్లిచ్చారు. రోజులయితే సుఖంగానే దొర్లిపోతున్నవి. ఇప్పుడు తను తన ప్రాణంలో ప్రాణమైన రవి కోసరం ఏమైనా చేస్తుంది. ఆ ముద్దుల రవే తన సర్వస్వ మూనూ. ఆ చిన్నారి రవే తన కోటి ధనరాసులున్నూ. అటు హాస్పిటల్లో సేవా ధర్మంలో మునిగితేలుతుంది. రోగగ్రస్థుల సేవా సానుభూతుల్లో అరుణ తనను తానే మరచిపోతుంది. తనకు చేతనయినంత వాళ్ళకి సహాయం చేస్తుంది. అదే ఆమెకు ఆనందం. దుఃఖార్తులను, బీదవాళ్ళను చూస్తుంటే అరుణ హృదయం వేయి వ్రక్కలౌతూంటుంది. స్వయంగా తాను

కష్టాల్ని అనుభవించి ఉండడం మూలంగా, వాళ్ళ నెంతగానో ఆదరిస్తుంది.

అరుణ పని పూర్తిచేసికొని బయటకు వచ్చింది. రోగులను చూస్తూ వాళ్ళ అవసరాలను కనుక్కొంటూ, తిరిగి నాల్గవ నెంబరు గది దగ్గరకు వచ్చింది. ఇది వరకంటే ఎక్కువగా ఆమె మొహం అరుణ నాకర్షించింది. మాతృత్వపు కాంతిలో ఆమె వర్చస్సు దివ్యంగా వెలిగిపోతోంది.

"బాబును చూశారా?"

"ఓ చూశానండీ!"

"ఎట్లా ఉన్నాడు? ఎవరి పోలికండీ? మీ పోలికా లేక మీవారి పోలికా?" అరుణ చిరునవ్వుతో ప్రశ్నించింది. ఆమె సిగ్గుతో ముడుచుకుపోయింది.

"చెప్పండీ! సిగ్గెందుకు!"తిరిగి బలవంత పెట్టింది అరుణ.

"ఆయన పోలికే."

"పుత్రరత్నమని తెలిస్తే, చాల ఆనందిస్తారు. కబురంపారా?"

"చూట్టాని కెలాగూ వస్తారుగా అప్పుడే తెలిసేది వేరే కబురంపలేదు."

"మంచిదండీ! వెళ్ళొస్తాను" అంటూ అరుణ బయలుదేరింది. ఆస్పత్రుల్లో ఒకవైపు సంతోషం,ఆనందం,మరోవైపు విచారం, దుఃఖం, ఎడబాటు నిండివుంటాయి. ఏ వార్డులో నన్నా పుట్టంగానే పసిగుడ్డు చనిపోయాడంటే అరుణ మనస్సు వికలమయ్యేది. తనకు కావలసిన వాళ్ళలో ఎవరో పోయినట్లు విచారిస్తుంది. 'ఓ భగవాన్ పుట్టగానే పిల్లాడ్ని చంపి, ఏ

మాతృ హృదయాన్ని క్షోభపడేటట్లు చెయ్యొద్దు! అసలు ఆ శిశువు పుట్టకుండానే ఉంటే మంచిది' అని అనుకొంటూ ఉండేది అరుణ.

"అబ్బ-ఆ పిల్లాడు ఎంత ముద్దొస్తున్నాడు. ఆ తండ్రికి తెలిస్తే ఎంత సంతోషిస్తాడో కదా!...ఇదే ప్రథమ సంతాన మేమో...అయితే ఆనందానికి అవధులుండవు...ఆ పిల్లాడి తండ్రిరాగానే, ఆ గదిలో దృశ్యం; వాతావరణం కడు రమణీయంగా ఉంటుంది-" అని తనలో తాను తలపోస్తూ అరుణ తన డ్యూటీలో మునిగిపోయింది.

కొద్ది సేపయిన తరువాత అరుణ భోజనం చేయడానికి ఇంటికి వెళ్ళింది. భోజనంచేసి, ముద్దుల రవిని ఆడిస్తూ మంచం మీద పడుకొన్నది. ఆమె మనస్సు ఆనందంలో తేలి ఉర్రూతలూగింది.

రవికి కష్టమంటే ఏమిటో తెలియనట్లు పెంచుతున్నది. తను ఏం చేసినా తన రవికోసమే చేస్తోంది. ఈ చిన్నారి రవి ఉండబట్టే, తను ఈ లోకంలో బ్రతికి ఉంది. లేకపోతే ఈ పాపపులోకం,కుళ్ళుసమాజం, సంకుచితస్వభావంకల పాపిష్టిమనుష్యుల్ని వదిలి దూరంగా, ఎంతో దూరంగా ఎప్పుడో,ఏనాడో వెళ్ళిపోయేది. తన మనస్సు ఇంకా ఏదో వెలితి కనిపిస్తూనే ఉంది.రవి తన జీవనాధారం, తన ముద్దులపట్టి. పెద్దవాడయితే "నాన్నా" అని ఎవరిని పిలుస్తాడు? రవి తండ్రి ఎవరు? ఎక్కడున్నారు? తను ఎవరని సమాధానమిస్తుంది? తన దగ్గర తన చిన్న రవివేసే ప్రశ్నలకు జవాబుల్లేవు. రవికి తండ్రి ఉన్నాడు-. కాని రవికి ఆయన్ను 'నాన్నా' అని నోరారా పిలుచుకొనే-

అదృష్టంలేదు. పిలవలేదు. ఆయనకూడ రవిని కొడుకుగా స్వీకరించలేదు. పితృవాత్సల్యాన్ని చూపించలేదు – అప్పుడే నాలుగేళ్ళొచ్చేస్తున్నాయి. తనకు మాత్రమేం తెలుసు – ఆయనెక్కడున్నదీ, ఆయనేం చేస్తున్నదీ, అసలున్నదీ లేనిదీ? నాలుగేమిటి, ఇరవైఏళ్ళు గడచినా, అసలు తటస్థ పడటమంటూ ఒకటి జరిగితే ఒక్కచూపులో, తాను గుర్తుపట్ట గలదు.

స్త్రీ తను తొలిసారి హృదయ పూర్వకంగా మనసారా ప్రేమించిన వారిని ఆజన్మాంతరం జ్ఞాపకం పెట్టుకొంటుంది. ఎన్నటికీ మరువదు.

ఆలోచనల్తో అరుణ ముఖం గంభీరమైనది. గత స్మృతులు, శూలాల్లా హృదయాన్ని, ఒక్క హృదయా న్నేమిటి, శరీరాన్నంతా బాధిస్తున్నాయి. బాధతో, ఆలో చనల్తో మనసు భారమైనది. రవిని దాసీకిచ్చి, డ్యూటీ కొచ్చేసింది.

రోగులను వారి వారి చుట్టాలూ, పక్కాలూవచ్చి చూచిపోయే వేళయింది. అప్పుడే చాలామందివచ్చి, వాళ్ళ వాళ్ళతో మాట్లాడుకొంటున్నారు. అరుణ తన డ్యూటీలో మునిగిపోయి, యిటూ అటూ పనిమీద-పచార్లు చేస్తున్నది.

"సిస్టర్" అంటూ యింతలో ఆ నాల్గోనెంబర్ గది లోంచి సన్నాగా పిలుపు అరుణ చెవిని పడింది.

అరుణ వెళ్ళింది—ఆమె బంధువులెవ్వరో వచ్చారు. ఒక యువకుడు, ఒక ముసలాయన పిల్లవాడిని చూస్తున్నారు. అరుణ దృష్టి ఆ యువకునిమీద పడింది. వెంటనే అరుణ

ఒక్కసారి స్తంభించిపోయింది. నవనాడులూ కృంగిపోయినవి. ఆ యువకుడు ఒక్కసారి నిర్వీణ్ణుడై తేరుకొన్నాడు.

అరుణ ఒక్కసారి కంపించిపోతూ వెనక్కి తిరిగి డాక్టర్ రూములోనికి ఆఘమేఘాలలో పోయిపడింది. శరీరమంతా కంపించిపోతోంది. నుదుటమీద స్వేదబిందువులు మెరుస్తు న్నాయి-మాటలు తడబడుతున్నవి.

"డాక్టర్! నావంట్లో బాగాలేదు-నాకు ఈ రోజు లీవ్ గ్రాంట్ చెయ్యండి, విశ్రాంతి తీసికొంటా. పనిచేయలేను" అన్నది అరుణ.

అరుణ అంటే లేడీ డాక్టరుకు ఎంతో అభిమానం "ఏమయింది? అట్లా ఉన్నావేం అరుణా!" అడిగిందామె.

"తలతిరిగి పోతున్నదండీ! క్వార్టర్కుపోయి విశ్రాంతి తీసికొంటా, దయచేసి శెలవివ్వండి" అన్నది అరుణ దీనంగా.

అరుణ డాక్టర్ అనుమతి తీసుకొని యింటికి చేరింది. ఎంతో కష్టంతో తనను తాను సంభాళించుకొన్నది. లేక పోతే ఎక్కడో పడిపోయేదే!

దాసీది అరుణను చూడగానే భయపడిపోయింది. ఆమె నెప్పుడూ ఇంత క్రితం యిలా చూడలేదు.

"ఏమమ్మా అలా ఉన్నారు?" బెరుకుగా అడిగింది దాసీది.

"ఎట్లా ఉన్నాను?-బాబును తీసుకొని అలా పోయిరా" అన్నది అరుణ.

"అమ్మా మీకు మీరు ... అలా ఉన్నారేమిటమ్మా?" ఇంకా ఏదో అడుగబోయింది దాసీది

"నీ మొహం నీ కేమన్నా మతిపోయిందేమిటే, ఏమయింది నాకు? తల నొప్పిగా ఉందంటే. అలా బాబును షికారుకు తీసికెళ్ళు. పో! అలా తీసికొనిపోయిరా" అన్నది కొద్దిగా గట్టిగా.

దాసీది బాబును వెంటనే బయటకు తీసుకెళ్ళింది. పోతూ పోతూకూడా, ఆమె అరుణవైపు ఒకసారి పరీక్షగా చూచి వెళ్ళింది. ఇవాళ అరుణమ్మగారిలా ఎందుకున్నారో దాసీదానికి అర్థంకాలేదు. దాసీది వెళ్ళగానే అరుణ వెంటనే లోపలినుంచి తలుపులు దభాలున వేసుకొన్నది. వెళ్ళి ప్రక్క-మీద పడిపోయింది. రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకొని, వెక్కి- వెక్కి- ఏడ్చింది. ఇప్పటి వరకు ఆమె హృదయంలో నిగూఢంగా దాగియున్న బాధంతా తువాలా ఒక్క-సారి పెల్లుబికి వచ్చింది. అలా ఎంతసే పేడ్చిందో ఆమెకే తెలియదు. కన్నీరు బుగ్గలపై ఎండిపోయి, చార లేర్పడిన తరువాత, లేచి కూర్చున్నది. ఇటూఅటూ తేరిపార చూచింది. అప్పుడు కానీ అసలు జరిగిందేమిటో జ్ఞాపకానికి రాలా.

"అవును, అవును. నిజంగా ఆయనే. తనెట్లా గుర్తుపట్టకుండా ఉంటుంది? ముమ్మాటికీ ఆయనే. ఆ నాల్గవ నెంబరు గది యువతికి భర్తన్నమాట. ఆయన పిల్లాడేనన్నమాట హు!" కోపంతో కంపించిపోయింది అరుణ. ఈ సంగతి కనుక మొదటే తనకు తెలిసిఉంటే- పిల్లాడ్ని ఈ పాటికి అంతంచేసి ఉండేది. సరే ఇప్పుడుమాత్రం ఏం మించిపోయిందిలే? ఆ పాము పిల్లను ఇప్పుడయినా చంపెయ్యవచ్చు. ఫరవాలేదు. ఆ పిల్లవాడికి ప్రపంచంలో బ్రతికే అధికారంలేదు. అరుణకు తన మీదే

తనకు ఎంతో కోపం వచ్చేసింది శత్రువుల బిడ్డకు జన్మించడా నికి సహాయపడ్డందుకు. తన జీవితాన్ని, తన జీవితంతో పాటు తన ముద్దుల రవి జీవితాన్ని అంధకారమయం చేసిన నీచునికి సహాయం చేసినందుకు.

అరుణ లేచింది. మొహం కాళ్ళూ చేతులూ శుభ్రంగా కడుక్కొని తిరిగొచ్చి కూర్చుంది. రెండు గంటలు గడచి పోయినవి. ఈ రోజు తనకు నైట్ డ్యూటీ కూడా ఉన్నది. తను గనక పోకపోయినట్లయితే రోగుల స్థితి ఎట్లా ఉంటుంది. అరుణ తన మనస్సును పాషాణం చేసికొన్నది. మెల్లిగా హాస్పిటల్ చేరింది.

వాతావరణం చాలా నిశ్శబ్దంగా ఉంది. బయటంతా నిర్మానుష్యంగా ఉంది. అటు పోతూ పోతూ నాల్గవ నెంబరు గదిముందు నిలబడిపోయింది అరుణ. ఇప్పుడామె ఒంటరిగా ఉంది. లోపల ప్రక్కనే పిల్లవాడూ తన చిన్న కళ్ళను మూసు కొని నిద్దురపోతున్నాడు కన్నార్పకుండా అరుణ ఆమెను చూడడం మొదలుపెట్టింది.

"సిస్టర్!" అంటూ అతికోమలంగా పిలిచిందామె.

"ఏమిటి చెప్పండి!" అంటూ నిస్సంకోచంగా లోప లికి వెళ్ళింది అరుణ.

"అప్పుడు మీరలా ఎందుకెళ్ళారో తెలియడంలేదు. ఆయనున్నారే. ఆయనే... పాపాయి తండ్రి" సిగ్గుతో వదనం అరుణారుణమైపోయింది.

"నా కెవ్వరి తండ్రితోనూ కలిసేంత పనిలేదు. అవస రమూ లేదు" అని కఠినంగా జవాబిచ్చి తిరిగింకేమీ మాట్లాడకుండా గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చేసింది అరుణ.

రాత్రి గడిచిపోతున్నది. అరుణ ఆఫీసులో ఈజీచైర్‌లో కాళ్ళు జాపుకొని కూర్చొని విశ్రాంతి తీసుకొంటున్నది. కళ్ళు మత్తుగా ఉన్నవి. కాని ఎందుకో నిద్రపట్టడంలేదు. మనస్సంతా కలవరంగా ఉన్నది. ఏవేవో అర్థంలేని పిచ్చి పిచ్చి ఆలోచనలు వ్యాపిస్తున్నవి మెదడులో.

అర్ధరాత్రయింది. ఇంతలో నర్సు వచ్చింది హడా వుడిగా. "సిస్టర్! నాల్గవనెంబరు గదికి త్వరగా పదండి" అంటూ తొందరపెట్టింది.

"ఎందుకు? ఏమయింది?" ప్రశ్నించింది అరుణ.

"పిల్లాడి ఆరోగ్యం బాగాలేదు-ఊరికే కాళ్ళూ చేతులూ కొట్టుకొంటూ ఉన్నాడు. నాకేమీ బోధపడడం లేదు. మీరే స్వయంగా చూడండి."

"ఫరవాలేదులే. దానంతటదే తగ్గిపోతుంది" అని తన కేమీ పట్టనట్లు అన్నది అరుణ నిర్లిప్తంగా.

అరుణ అధరాలమీద చిరునవ్వు తొణికిసలాడింది. "పిల్లవాడు చనిపోతే బాగుంటుంది. చేసుకొన్న వారికి చేసు కొన్నంత మహాదేవ! భగవంతుడి కన్నీ తెలుసు. పాపం చేసు కొన్న తరువాత ఫలితం అనుభవించక తప్పుతుందా" అను కొన్నది అరుణ.

"సిస్టర్!" అంటూ మళ్ళీ పిలిచింది అరుణను నర్సు.

"ఏమిటీ? చెప్పాగా, అదే తగ్గుతుందని!"

"ఏదండమ్మా పాపం! ఆ అమ్మాయి మొదటి సంతానమేమో తెగ గోలచేస్తోంది పాపం. ఒకటే ఏడుపు. మిమ్మల్ని పిలవమని ఒకటే ఏడుపు పాపం!"

అరుణకు చిరాకెత్తింది. పాపం. హుఁ. పాపంట, పాపం! ఈ రోగులు ఎప్పుడూ యింతే. కొంచెంసేపుకూడ విశ్రాంతి తీసుకోనివ్వరు! అరుణ ముఖంలో కోపం తాండవించింది.

అరుణ వెళ్ళి అడిగింది. "ఏమిటండి ఏడుస్తున్నారు? ఏమయింది చెప్పండి?"

"వచ్చావమ్మా- మీ కోసమే చూస్తున్నా. ఏమయిందో ఏమోకాని, అలా కాళ్ళూ చేతులూ తెగ కొట్టుకొంటున్నాడు. కాస్త చూడండమ్మా!"

అరుణ పిల్లాడ్ని చూచింది. శ్వాస వేగంగా వస్తున్నది. కాళ్ళు చేతులు కొయ్యబారి పోతున్నవి. అరుణ క్షణకాలం స్తంభించిపోయింది.

"అచ్చం రవిమాదిరిగానే ఉన్నాడు. ఎవరైనాచూస్తే రవి తమ్ముడేనా అని అడిగేటట్లున్నారు. రవి పుట్టినప్పుడు కూడా మూర్తిలా ఇలానే ఉండేవాడు" అనుకొన్నది అరుణ.

"త్వరగా చూడమ్మా, నాబాబు నాకు దక్కేటట్లు లేడు" అన్నదామె ఏడుస్తూ.

అరుణ మంచంమీదకు ఒరిగింది. ఆమె ముఖం కోపంతో భయంకరంగా ఉంది. గొంతు యీ పళాన పిసి

కేస్తే! చేతులు వణికినవి. ఇలాగే గొంతు పిసికేస్తే పీడ వదలి పోతుందనుకొన్నది—అరుణ.

ఇదే మంచి సమయం. ఇటువంటి అదును మరెప్పుడు లభించదు.

తాను గర్భవతినని చెప్పినప్పుడు అతను అన్న మాటలు చెవుల్లో గింగురుమన్నవి.

"అయితే చంపెయ్యి. మంచి మందిప్పిస్తా. అప్పుడు కూడా కుదరకపోతే పుట్టగానే పిసికి చంపెయ్!" అన్నప్పుడు సిగరెట్ వయ్యారంగా కాలుస్తూ, నిర్విచారంగా. ఇప్పుడు ఈ సమయంలో "ఆపని నేనే ఎందుకు చేయకూడదు?" అరుణ ఫాలభాగం చెమటతో తడిసిపోయింది. వెంటనే భయంతో పిల్లాడి మంచం దగ్గర్నుండి తొలగిపోయింది.

"సిస్టర్! పిల్లాణ్ణి రక్షించు. చూడమ్మా!" దీనంగా మొరపెట్టుకొన్నది తల్లి.

"నేనేం చేయలేను నాతో కాని పని!" స్పష్టంగా చెప్పేసింది అరుణ. ఆమె హృదయం యింకొకప్పుడయితే ద్రవీభూతమైపోయేదేకాని, ఈ సమయంలో పాషాణం మాదిరిగా తయారయింది.

"సిస్టర్!" అంటూ కరుణాభరితమైన, బాధామిళితమైన ఆ యువతి పిలుపుకూడా ఆమె నాపలేకపోయింది.

అరుణ గది వెలుపలకి వచ్చేసింది. లోపలినుండి ఆ యువతి వెక్కి-వెక్కి ఏడ్చేధ్వని స్పష్టంగా వినబడుతున్నది. అయినా తనేమీ చేయలేదు. ఇటువంటి వాళ్ళమీద దయ జూపడంకూడా మహా పాపమే.

అరుణ ఆఫీసుగదిలో కొచ్చింది. మనసు గజిబిజిగా ఉంది. చూపులు అటూ ఇటూ పరిగిడుతున్నవి. ఎదురుగ్గా గోడమీద ఫ్లారెంస్ నైటింగేల్ చిత్రం వ్రేలాడదీయబడి ఉంది. అత్యంత దయామయురాలైన ఆమె హస్తాల్లో సేవా జ్యోతి దివ్యంగా వెలిగిపోతోంది. ఆమె తన చూపులను ఆ చిత్రంమీదనుండి మరల్చలేకపోయింది. ఆ దయామయి తన వైపే గ్రుచ్చి గ్రుచ్చి చూస్తున్నట్లే ఉంది.

"ఓసీ పిచ్చిదానా! నిర్దోషి అయిన పసిపిల్లాడేం చేశాడు నిన్ను? ఏమీ తెలియని వాడిమీదనా నీ పగ! ఘోరపాపం కదూ!" అన్నట్లు తోచింది. ఇంకా అలాగే చూస్తూ ఉండిపోయింది ఆ చిత్రంవైపు అరుణ.

ఒళ్ళు జలదరించింది. తనేం చేస్తున్నది? ఆ బిడ్డడి అపరాధ మేముందిందులో? వ్యక్తిగత శత్రుత్వానికి, సేవచేయడానికి సంబంధమేమున్నది అసలు? అనుకొంటూ వెంటనే లేచింది అరుణ. నాల్గో నెంబరు గది దగ్గరకు వెళ్ళింది. ఇంకా అదే దృశ్యం. పరిస్థితి ప్రమాదంగా ఉంది. భయపడింది. డాక్టర్ యించార్జ్ యిప్పుడు క్వార్టర్లో నిదుర పోతూంటుంది. అయితే ఏం? ఒక పసి ప్రాణం గిలాగిలా కొట్టుకొంటూ తల క్రిందులవుతుంటే, నిదుర, సుఖం, విశ్రాంతి వీటన్నిట్నీ చూస్తుందా? అనుకొంటూ అరుణ ఆ చిమ్మచీకట్లో, డాక్టర్ ఇంటికేసి నడచింది. లేడీడాక్టరుకు పాతికేళ్ళుంటాయి. చాలా అందంగా ఉంటుంది. అవివాహిత. ముక్కుమీద కోపం, విసుక్కునే స్వభావం. కానీ-కానివేళయినా ఒప్పుకోక

పోతుందా? వచ్చి చూస్తే పిల్లాడూ బ్రతుకవచ్చును. అరుణ తలుపు కొట్టింది.

"ఎవరువారు" అని లోపలినుండి కంఠస్వరం వినిపించింది.

"నేనే అరుణని డాక్టర్!"

"ఏమిటి? ఈ అర్ధరాత్రి ఏమయింది?"

"నాల్గవనెంబర్ రూమ్‌లో పిల్లాడికి సీరియస్‌గా ఉంది డాక్టర్. ఒక్కసారి రావాలి మీరు."

"ఈ అర్ధరాత్రేమిటిలే. రేపు మార్నింగ్ చూద్దాం- ధైర్యం చెప్పు-"

"కాదు డాక్టర్. అసలు హోప్సులేవు. మీరు చూడందే లాభంలేదు. దయచేసి త్వరగా రండి" అన్నది అరుణ.

లోపలినుండి తలుపు తెరుచుకొన్నది.

"ఇప్పుడే వస్తానుండు" అనిచెప్పి లేడీడాక్టర్ లోపలికెళ్ళి డ్రెస్ మార్చుకొని వచ్చింది.

లేడీడాక్టర్ పిల్లవానిని చూసింది. వాని స్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. పరీక్ష చేసింది.

"పిల్లాడికి రక్తం బొత్తిగాలేదు. మన హాస్పిటల్‌లో బ్లెడ్ స్టాకులోకూడా లేదు. ఈ పిల్లవానికి చుట్టాలు ఎవరైనా ఉంటే పిలిపించండి. వాళ్ళ రక్తం పనికిరావచ్చు. లేకపోతే పిల్లవాడు దక్కకపోవచ్చు" అన్నది లేడీడాక్టర్.

"తల్లిస్థితి మరీ అధ్వానంగా ఉంది వీళ్ళ చుట్టాలు అర్ధరాత్రిపూట ఎక్కడున్నారో, ఏమో. ఎవరు పిలుచు

కోస్తారు ఈ సమయంలో. అయినా, చూడండి డాక్టర్ నా రక్తం పనికి వస్తుందేమో'' ఆదుర్దాగా అడిగింది, కాలయాపన చేస్తే ప్రమాదం సంభవిస్తుందేమోననే భయంతో అరుణ.

లేడీ డాక్టర్ ఆశ్చర్యపడింది. వింతగా అరుణవైపు చూచింది. అరుణ స్వభావం, రోగులయెడ చూపే దయ, అన్నీ డాక్టరుకు తెలుసు. భావావేశంలో అలా అంటోందని అనుకొన్నదామె.

"నీరక్తం పనికిరాదు. ఎక్స్పరిమెంట్సు చేసేసమయం కాదిది. అరుణా ప్రాణం రక్షించే సమయం. వీళ్ళ చుట్టాలు తప్పకుండా కావాలి. పిలిపించండి''- అన్నది లేడీ డాక్టర్.

అరుణ హృదయం, ఆగిపోయినంతపనయింది. ఇంతలో మరో ఆలోచన మెరుపులా తట్టింది.

"డాక్టర్ మరయితే, పిల్లాడి రక్తం పనికివస్తుందాండీ'' అన్నది అరుణ ఆతృతతో.

"ఓ పనికి రావచ్చు. ఒకవేళ మంచి ఆరోగ్యంగా ఉండి ఇద్దరి రక్తం ఒక టైపు అయితేనూ - అయినా అంత ఆరోగ్యంగా వున్న పిల్లాడ్ని చూస్తూ చూస్తూ చేతులారా ఎవరు పాడుచేసుకుంటారు?'' అన్నది లేడీ డాక్టరు.

"అయితే నేనిప్పుడే వస్తా''నంటూ అరుణ చీకట్లో తన యింటికి పరుగులమీద వెళ్ళింది హాయిగా పడుకొని నిద్దుర పోతున్న రవి నెత్తుకొని నాల్గవ నెంబరు గదికి వచ్చింది. డాక్టర్ నిర్విణ్ణురాలయింది.

"వీడయితే మీ రవి కదూ - అరుణా?''

"అవును డాక్టర్ నా రవే!''

"అరుణా ఏమిటిది? అపాయాన్ని కావాలని కొని తెచ్చుకొంటున్నావా?"

"అపాయమైనా కానిసమయంలో ఒకళ్ళకు సహాయ పడటం ప్రతి మనిషి కర్తవ్యమే కదండీ. పర్వాలేదు. తొందరగా చూడండి. పిల్లాడు బ్రతుకుతాడేమో పాపం!"

లేడీ డాక్టరు ఇంకేమీ మాట్లాడలేదు. వెంటనే అన్ని ఏర్పాట్లూ చేసింది. రవి రక్తం బాగానే సరిపోయింది. రెండు ఒకే రక్తమవడంతో రవి రక్తం పిల్లవాడి కెక్కించడమైనది.

"హమ్మయ్య! ఇప్పుడేం పర్వాలేదు-పిల్లాడి ప్రాణాలు ఒక దరికి చేరినట్లే అనుకోండి!" అన్నది లేడీడాక్టరు తువ్వాలుతో చేతులు తుడుచుకొంటూ.

"నా బాబు ప్రాణాల్ని దానం చేశావు అరుణా. నీ మేలెన్నటికి మరువలే"నంటూ ఆ యువతి వచ్చి అరుణ పాద ద్వయాన్ని పట్టుకొని కన్నీటితో అభిషేకించింది.

అరుణ రవిని దుప్పటితో కప్పుకొని వెంటనే తన క్వార్టరుకు వేగంగా వెళ్ళిపోయింది. రవి ముఖం, శరీరం వాడి పోయినవి. పూర్తిగా బలహీనమైపోయాడు. ఏదో మందు త్రాగించి, హృదయానికి హత్తుకొని మంచంమీద పడుకో బెట్టింది రవిని.

అరుణ రాత్రంతా రవి కోలుకొనేందుకు దయామయుడయిన దేవుని ప్రార్థిస్తూనే వుంది.



# వెన్నెల నవ్వింది...

విశాల వినీలాంబ్రభ సరసిలో నిండుజాబిల్లి రాజహంస వలె ప్రయాణం చేస్తున్నాడు, శర్వరీ శీతపవనాలు హృదయాహ్లాదకరంగా, మందంగా వీస్తున్నాయి. ధవళకౌముది అందంగా ప్రతిఫలించే విశాల సంద్రపు కెరటాల సవ్వడులు కర్ణోపేయంగా దిక్కులు ఆవరిస్తున్నాయి... కాని...

...కాని...ఆస్థాన మహాశిల్పి హృదయాభ్రంలో తీక్షణభాను భీకర కరానలఛటలు ప్రజ్వరిల్లిపోతున్నాయి. అతని మనోసంద్రంలో దారుణ ప్రభంజనం చెలరేగుతున్నది. మహా సుదీర్ఘమైన ఆలోచనలో, లీనత, గంభీరత, కలవర పాటు అతని వదనంలో స్పష్టంగా ద్యోతకమవుతున్నాయి. అతని మనోరంగంలో సంకుల సమరం సాగుతోంది భీకరంగా. సముద్రపు ఒడ్డున స్వచ్ఛమైన ఇసుకలో కూర్చుని, మహార్ణవంలోకి తదేకంగా చూస్తూ అంతులేని ఆలోచన చేస్తున్నాడు.

"హే భగవాన్! ఇంతేనా?... ఈ మహాశిల్పి శిల్ప చాతుర్యం యింతటితో వ్యర్థమై పోవలసిందేనా? స్థపతి భాస్కర విద్యా పారంగతుడైన తను, తన అపార ప్రతిభ, ఈ అత్యల్పమైన సమస్యా పరిష్కారం ముందు తలవంచవలసిందేనా? యిన్నాళ్ళూ తనంత శిల్ప చతురిమగల మహాశిల్పి, ప్రతిభా సంపన్నుడులేడని, ఒక విధమైన అహంభావం, గర్వం, తన మనోంతరాళల్లో తొణికిసలాడుతూండేది...

అవే ఈ నాటికి తనకీ సమస్యను సృష్టించినట్లున్నదే! తనకిది అగ్నిపరీక్ష! కృతకృత్యుడై తన మహారాజు కటాక్ష వీక్షణాలకు గురిఅవుతాడో... లేక...".

తాను ఎన్నో మహాద్భుత నిర్మాణాలను గావించాడు. ఒకే ఒక్క యులి కదలికచేత శిల్పంలో భావభేదాన్ని కల్పించే ప్రతిభ తనకున్నది... అయినా ఈ స్వల్పకార్యం తనకెంత కఠోర సమస్యను సృష్టించింది! దీని కంతటికీ తన అహంభావమే, తన విర్రవీగుడే కారణం... సాక్షాత్తు విశ్వకర్మకు ప్రతిమూర్తిని నేను; అనుకొని తను ఉప్పొంగిపోయాడు యింతకుముందు.

అతని ఆలోచనా తరంగాలు, అయిదు సంవత్సరాల వెనుకకు పరువులెత్తాయి. అయిదేళ్ళక్రితం... ఆరోజు. శిల్ప భవంతీ ప్రాంగణపు పూదోటలో కూర్చుని ఒక పూబోడి సుందర లావణ్యాన్ని అతిమనోహరంగా సృష్టిస్తున్నాడు.

తన లీనత చెదిరింది. 'నాన్నగారూ' అంటూ నా పదిహేనేళ్ళ పుత్రుడు ప్రవేశించాడు. ఏదో అడగాలని కోరికతో వచ్చినట్లు అతని ముఖకవళికలు తెలుపుతున్నాయి.

"ఏమిటి బాబూ?"

"ఇన్నాళ్ళూ మీదగ్గర శుశ్రూషచేసి మీ ఉత్కృష్ట శిల్ప చమత్కృతీ, మీ శక్తి సామర్థ్యాలూ సంపూర్ణంగా అభ్యసించినా యింకా నా హృదయాంతరాళాల్లో ఏదో వెలితిగానే ఉంది నాన్నగారూ!"

"అయితే ఏమంటావోయ్...తండ్రీ!"

"దేశ సంచారం చేసి వస్తానండీ!"

"దానివల్ల లాభం?"

"దేశ దేశాల శిల్పసాంప్రదాయాల్ని, యితర శిల్పుల భావనా పనితనాన్ని, క్షుణ్ణంగా పరిశీలించి నా శిల్పనైపుణ్యానికి మెరుగులు దిద్దుకోవచ్చునని నా ఉద్దేశ్యం నాన్నగారూ!"

అప్పుడు తన మొహంలో ఒక అపహాస్యపు రేఖ పొడసూపింది. "ఏమిటోయ్ తండ్రీ? శిల్పకళా భావనాపనితనాల్లో ఈ మహా శిల్పిని మించిన వాళ్ళున్నా రనుకొంటున్నావుటోయ్... లేరు... బాబూ!... నీ సంచారం నీకేమీ లాభం కలిగించదు... వ్యర్థమవుతుంది. ఇక్కడే వుండి... మెళుకువలు గ్రహిస్తే... చాలు... ఇక్కడే సాధనచేస్తూ ఉండు...!"

"కాదు నాన్నగారూ!... ఎందుకో నా మనసును సమాధాన పర్చుకోలేక పోతున్నాను... మనం శిల్ప విద్యాపారంగతులమైనా, వివిధశిల్పాల పరిశీలన మనకు లాభం చేకూరుస్తుందండీ! గర్వం దోష భూయిష్టం అనిపిస్తోందండీ నాన్నగారూ! రేపే బయలుదేరి యాత్రచేసి వస్తాను. అనుజ్ఞ ఇవ్వండి"

ఎంత చెప్పినా వినేటట్లు లేదు. "ఏమిటో... బాబూ! ఈ శిల్పిని మించినవాడు ఈ లోకంలో యింకా పుట్టనే లేదు నాయనా!...నీ సంచారానంతరం ఈ విషయం గ్రహించక మానవులే... సరే! జాగ్రత్తగా వెళ్ళిరా... అన్ని ఏర్పాట్లూ చేస్తాను...!"

ఈ విధంగా తన ప్రతి మాటలోనూ, ప్రతి హావభావ ప్రదర్శనలోనూ, అహంభావం ప్రస్ఫుటమయింది. ఎంతో

మూర్ఖంగా తన పుత్రుని యాత్రా కౌతుకాన్ని ఆప ప్రయ
త్నించాడు.

మరునాడే ప్రయాణమై సాగిపోయాడు తన పుత్రుడు.
వాడున్నా... ఏమున్నా ఈ సమస్యా పరిష్కారానికి సాయ
పడే వాడేమో! బాబు... ఎక్కడున్నాడో ఏం చేస్తున్నాడో!

తరువాత కొన్నాళ్ళకి తనకు మహారాజువారి పిలుపు
వచ్చింది. ఉద్యానవనంలో నానావిధ పుష్ప సౌరభాన్ని
ఆస్వాదిస్తూ, తను వెళ్ళేటప్పటికి తనకోసమే ఎదురు చూస్తు
న్నారు.

"దిగ్విజయము మహాప్రభూ!...ఎందుకో కబురంపినా
రట?"

"వచ్చావా మహాశిల్పీ! క్షేమమే కదా! శిల్ప కళ
సవ్యముగా సాగుతున్నది కదా?"

"మహా ప్రభువుల చలవ! మహారాజా! అంతా సవ్య
ముగానే సాగుచున్నది!——"

"ఎన్నాళ్ళనుండో మీతో ఈవిషయమై సంప్రదించా
లని ఉంటూవస్తోంది మహాశిల్పీ! ఈనాటికి వీలుపడింది. మన
నగరము దేవాలయములేమిచే వెలాతెలాపోతున్నది. తక్షణం
ఒక మహోత్కృష్టమైన దేవాలయ నిర్మాణం ప్రారంభం
కావాలని నాకోరిక. ఆ అపురూపమైన దేవాలయంలో మహా
శివుని ప్రతిష్ట జరగాలని నా బహుకాల అభీష్టం మహాశిల్పీ!
తక్షణం మీరు పూనుకొని నా కలను యదార్థం చేయాలి.
అన్ని ఏర్పాట్లూ సత్వరం చేయబడేటట్లు చూస్తాను. మీకళా
కౌశలం అంతా కూర్చి ఆ దేవాలయాన్ని అత్యద్భుతంగా

విరాజిల్లేటట్లు నిర్మించాలి మహాశిల్పీ! మీకేమీ అభ్యంతరం లేదనుకొంటాను!..."

"మహాప్రభువుల ఆజ్ఞ!...మహారాజా! మీ చిరకాల అభీష్టం నాకు కూడా బహు సంతోషదాయకమే. తక్షణం నిర్మాణ కార్యక్రమం అమలు పరుస్తాను."

మరికొన్ని రోజులకే ఆ మహోత్కృష్టమైన దేవాలయ నిర్మాణ కార్యక్రమం ప్రారంభింపబడింది. తన వద్ద శుశ్రూషచేసి, శిల్పకళ నభ్యసిస్తున్న చాలమంది యువ శిష్యులు ఎంతో కష్టించి, చాల సహాయం చేశారు. దినదినానికీ మందిరం శ్రీవిమానంతో తేజరిల్లుతూ, అత్యద్భుతంగా పైకి లేస్తోంది. ముఖమండపం... భక్తమందిరం... వివాహ మండపం... క్షేత్రపాలకాలయము, శ్రమించి, చాల సుందరంగా నిర్మించారు తనూ, తన నూతన శిష్యులూ కలసి... సింహగజాశ్వాది మృగరాజాలు, అద్భుత సుందర వనితా విగ్రహాలు, దేవతా శిల్పాలు, శిష్యులూ, తనూ జీవకళ ఉట్టిపడేటట్లు నిర్మించారు.

ఈ నిర్మాణంలో తన పేరు...ప్రతిష్టలు...అహో! ఎంత సంతృప్తి!... దేశంలోని శిల్పు లందరూ నా ముందు బలాదూర్. ఈ మహాశిల్పికి పోటీలేదు. సాక్షాత్తు విశ్వకర్మ దిగిరావాలి...భవిష్యత్తు నాలోచిస్తూ తన మనస్సు గర్వాతిరేకంతో పరవళ్లు త్రొక్కింది.

దేవాలయాంతర్భాగం సమస్తం శిల్పమయాభిరామం. రాతి దూలాలపై నలుమూలలా శైవగాథలు - అతి మనోహరంగా, లావణ్యంగా సృష్టించాడు తను.

దేవాలయంపై ఒకచోట-సముద్ర మథన దృశ్యము అత్యంత రమణీయంగా, మనోరంజకంగా చెక్కాడు - కరాళ దీర్ఘ సిత దంష్ట్రికా వినిర్గత క్రోధమయ వికటాట్టహాసము కల వారు రక్కసులు ఒకవైపు-చాంద్రీ సుకుమార సుస్నిగ్ధ మందహాసములవారు దేవతలు మరియొకవైపు-మధ్య సుదీర్ఘ దేహుడు, మహాసత్యమూర్తి నాగప్రభువు వాసుకి మంద మహానగాన్ని చుట్టి; సప్త ముఖాలనుండి నురుగులు గ్రక్కు తున్నాడు. విషాగ్ని భీకర కీలలు నాలుగుమూలలా వ్యాపిస్తు న్నాయ్. వాసుకి కవ్వపుత్రాడు కాగా-మందర మహాపర్వతం మంథానమైంది. దేవదానవులు పాలకడలిని త్రచ్చగా మథనము జరిగి దశదిశలు పిక్కటిల్లునట్లు మహా ధ్వానము లయినవి. ధూమ రేఖావృతమై విషాగ్ని.కీలల్తో మహా కాల కూటము ఉద్భవించింది. దేవదానవులు తల్లడిల్లి మహా దేవుని వేడగా, ఆ త్రిశూలపాణి, ఆ కాలకూటాన్ని మ్రింగి తన కంఠంలో నిలిపాడు. ఆపద తీరింది... తిరిగి మరల మరల చిల్కగా, పాలసంద్రము సుధాస్వచ్ఛ డిండీరాలను వెలి గ్రక్కింది.

తన ప్రతిసృష్టి కిదొక గర్వకారణమైన నిదర్శనము. ఇదొక్కటి చాలు. తనకు సాటి ఎవ్వరూలేరని నిరూపించ డానికి.

ఇంకొకటి... పరమశివుడు హిమాలయా సానువుల్లో, దేవదారు వనాభ్యంతరంలో తపస్సు చేస్తున్నాడు. హిమగిరి సుత అతి భక్తియుతంగా సర్వోపచారాలు చేస్తున్నది. మన్మథుడు గిరితనయ, శివునికి శేఫాలిక మాలికలను

అందిచ్చేవేళ, శివుడు నేత్రములను అరవిచ్చుట కనిపెట్టి పూభుటమ్మును వదిలాడు. పార్వతిని చూసిన దేవదేవుని మనస్సు క్షణకాలం చెదిరింది. సంబాళించుకొన్నాడు. కారణం గ్రహించాడు. మహోగ్రుడై తన మూడవకన్ను తెరిచాడు. భయంకర విస్ఫులింగాలు వెడలి మనోహర మంజులమూర్తియగు మన్మథుడు నిలువెల్ల దగ్ధమై బూడిద అయిపోయాడు. గిరిరాజ తనయ మూర్ఛపోయినది.

"అహో! అత్యద్భుతం! అత్యంతసుందరము! ఈ మహా శిల్పికి ఇక ఎదురులేదు. శిల్పకళా ప్రపంచమంతా తనకిక దాసోహం!" అని తను ఎంతో విర్రవీగాడు. తన శరీరంలో ఏమూల చూచినా అహంకారంతో నిండి ఉండిపోయింది.

అందువల్లనే తనకీ విషమ పరీక్ష సృష్టించాడు దేవ దేవుడు. లేకపోతే ప్రతివిషయాన్నీ అతిశ్రద్ధగా గమనించే తనకు, శివలీలల నమోఘముగా విన్యసింపజేసి ఎంతోగర్వపడిన తనకు-ఈ విమాన శిఖర శిలను అమర్చు ఉపాయం తట్టుట లేదేమిటి? రోజుల తరబడి రాత్రింబవళ్ళు నిద్దురలేకుండా ఆలోచిస్తున్నాడు. కాని ఫలితం శూన్యం.

"గర్వం దోషభూయిష్టమైన దనిపిస్తోందండీ!" ఆనాడు చిన్నవాడైనా తన తనయుడన్న మాటల విలువ ఈ నాటికి తెలిసివచ్చింది. "హే! భగవాన్! ఈ జటిల సమస్యా పరిష్కారం చెప్పుతండ్రీ!" అతని హృదయం పశ్చాత్తాపంతో, శోకావృతమైంది.

"గర్విష్ఠుడా! ఇప్పుడైనా ఆలశ్యం చేయకుండా యితర శిల్పుల నాశ్రయించి-నీకు తెలియని మెలకువలు వారికి వచ్చి

ఉండవచ్చు ... సమయంలేదు. ఊఁ ..."తన అంతరాత్మ ఘోషించింది.

ఆ మహాశిల్పి ఆత్మ, మనస్సుల ఘోర సమరంలో ఆతని అహంకారపు మనస్సు చిత్తుగా ఓడిపోయింది.

కొద్దిరోజులు ఇతర దేశాలుపోయి ఉపాయం తెలుసుకొని రావాలని నిశ్చయించుకొన్నాడు మహాశిల్పి.

చిక్కగా అలుముకొంటున్న వెన్నెల చక్కగా చాటుగా నవ్వుకొన్నది మానవుని అహంకార పతనాన్ని చూచి.

అత్యంతావసరమైన పని ఉన్నదనే నెపంతో మహాప్రభువు అనుజ్ఞ తీసుకొని మహాశిల్పి వెళ్ళిపోయాడు దేశాంతరం.

రోజులు గడుస్తున్నవి. మహాశిల్పిజాడ శూన్యం. దేవాలయ ప్రతిష్టకు ముహూర్తం సమీపిస్తోంది. ఆ ముహూర్తముదాటినచో మరికొన్ని సంవత్సరాలవరకు అటువంటి దివ్యమైన ముహూర్తము లేదని ఆస్థాన పండితులు చెప్పారు. శిఖర శిలలను నిర్మించాలి... మహాశివుని ప్రతిష్ట జరగాలి... మహాశిల్పి ఎటువెళ్ళినదీ తెలియదు.

అతనికోసం ఎంతోమంది చారులను పంపాడు మహారాజు. కాని ఫలితం శూన్యం. మహాప్రభువునకంతా అగమ్యగోచరం. శిఖర శిలా నిర్మాణంలో, అది అమర్చడంలో ఆతని నిపుణులయిన శిష్యులు కూడా ముఖాలు తేలవేశారు. మహారాజు వదనంలో విషాదచ్ఛాయలు పొడసూపినవి.

ఒకనాటి ప్రత్యూషం - చల్లని సమీరాలు వీస్తున్నవి. బాలభానుని నునులేత కిరణాలు ప్రపంచాన్నావరిస్తున్నవి. సూర్యుని బంగారు కిరణాలు లోకాన్ని రాగరంజితం చేసినట్లే మహాప్రభువుల వదనంలో కోటి దివ్యప్రభలు వెల్లివిరిశాయి.

కారణం... ఆ ప్రత్యూషంలో బాలభాస్కరునితో పాటు ఒక యువకుడు... తేజోమయుడగు యువశిల్పి ప్రభువు దర్శనార్థం వచ్చాడు. తానా శిఖర శిలను అమరుస్తానన్నాడు. ప్రభువు ఆనందానికి అంతులేదు.

ఆ దినమే ఆ యువశిల్పి మొదలుపెట్టాడు. శిఖర శిల బరువు సుమారు పన్నెండు బారువులుంటుంది. దానిని విమాన మూలంలో ఒక ఇసుక దిబ్బమీద పెట్టించాడా బాలశిల్పి. ప్రతి దినమూ వేనకువేల బండ్ల సముద్రపు ఇసుకను తెప్పిస్తూ యిసుక దిబ్బ మూపుపైన ఆశిఖర శిల ఉండేటట్లు చూచుకొనుచున్నాడా బాలశిల్పి.

అతను ఊహామాత్రంగా యిలా చేయిస్తున్నాడు. సఫలీకృతుడౌతాడో లేక...; మూడొంతులు తన ఉపాయం ఫలించి తీరాలి.

ఇసుక దిబ్బ దేవాలయ శిఖరమంత ఎత్తున లేచింది. కొద్ది రోజుల్లో ఆ దిబ్బ మూపుపై ఆ శిఖలశిల వున్నది. విమాన శిఖరశాల కడుగునుండి విమాన శిఖరమునకు గట్టి దూలపు కమ్మీలు చేర్పించి రాతి కిటూనటూ త్రాళ్ళు గట్టి కమ్మీలిపై జరిపించినాడా యువకుడు. ఎంతో కష్టముతో శిఖర శిల శిఖరముపైకి చేరింది. తరువాత ఆ శిల్పి కమ్మీలను లాగించి వేసినాడు.

మహాప్రభువులు ఆ మహాకార్య కౌశలతకు ఉప్పొంగి పోయినాడు.

శిఖరశిలను జరుపు రోజున ఆస్థలము వివిధ దేశ జన సందోహంతో పెద్ద ఉత్సవంలా శోభిల్లింది. ఆ యువశిల్పి పేరు వివిధ దేశాల ప్రాకిపోయినది. ఎవరినోటవిన్నా ఆయువకుని కార్యకౌశలత పొగడ్తలే. ప్రజలందరూ ఆ శిల్పిని సంబరంతో ఘనముగా ఊరేగించారు. మహారాజు ఆనందమునకంతులేదు. అతనిని యధారీతిగా ఘనముగా సన్మానించాడు.

ఆ శిఖరశిలను అమర్చురోజు ఆ జన సందోహంలో, మహాశిల్పికూడా వున్నాడు. తాను పూర్తిచేయలేనికార్యాన్ని పూరించు ఆ శిల్పి ఎవరా అని చూచుటకు వచ్చాడు. అతనిలోని అహంభావం ప్రజ్వరిల్లి వేయితలలు, వేయి చేతులతో మహారూపం దాల్చింది. అతనికళ్లు ఎర్రని జీరలతో మహోగ్రములైనవి. అతనిలో ఈర్ష్య ప్రచండ రూపం దాల్చింది.

చీకటిపడింది. వెన్నెలలు సాంద్రములై, మృదువులై, భూమిని కౌగలించుకొంటున్నాయి. ఆ చల్లని, చిక్కని వెన్నెట్లో యువశిల్పి దేవాలయంలో సంపూర్ణ తృప్తితో నిద్రిస్తున్నాడు.

రాత్రి రెండవఝాము...లోకం నిస్తబ్దతలో నిద్దుర పోతోంది. ఆ నీరవ నిశ్శబ్దంలో దేవాలయపు వెనుక నీడలో ఒక మానవాకృతి రొంటినఉన్న ఛురికను సరిచూచుకొన్నది. తరువాత క్షణకాలం భరింపరాని నిశ్శబ్దం...ఎక్కడో ప్రక్కనే ఎండుటాకు గాలికి గలగలలాడి దొర్లింది. ఆ ఆకృతి యువశిల్పి దగ్గరకు, నీడలో దాగుతూ సమీపించింది. ఆ

యువకుని మోములో సంపూర్ణ జ్యోత్స్నలు తేజరిల్లుతున్నవి. నిర్వికారంగా నిదురిస్తున్నాడు. గుబురైన గడ్డముతో మీసము లతో మహాతేజస్విలా వెలిగిపోతున్నాడు. ఆ నిశాచరుని చేతి లోని ఛురిక ఆ యువశిల్పి హృదయంలో నాటుకొని పోయింది.

యువకుడు కొనప్రాణంతో కనులు విప్పిచూచాడు.

ఒక్కసారి 'నాన్నగారూ' అంటూ అరిచాడా యువకుడు.

ఆ మానవాకృతి శరీరం వణకింది.

"నన్ను గుర్తుపట్టలేదా నాన్నగారూ!"

ఆ మహాశిల్పికి చుట్టూ ప్రకృతి స్తంభించిపోయింది.

"మీ చేతులారా పెంచి మీ కళనంతా నేర్పిన, మీ పుత్రుడినే గుర్తించలేకపోయారా నాన్నా!"

అతని హృదయం కోటిక్కోట్ల వ్రయ్యలైపోయింది. అయిదేళ్ళక్రితం దేశసంచారం వెళ్ళిన తన కుమారుని గుర్తు పట్టాడు. కాని అప్పటి తనయుని మోమెక్కడ! ఈ యువ శిల్పి ఇప్పటి తేజస్సు ఎక్కడ? అతని హృదయంలో శోకం ప్రళయరూపం దాల్చింది.

"బాబూ!" అని అరచి అతని శరీరంమీద పడి పోయాడు. మహాశిల్పి అతని మోము ముద్దిడి నిమిరాడు.

"ఘోరపాపం చేశాను బాబూ! నా గర్వం నా ఈర్ష్య నన్ను పతనం చేశాయి తండ్రీ! క్షమించు నాయనా!" ఆ మహాశిల్పి కంఠం గాద్గదికమైంది. శోకావృతమైంది.

"దేశాలన్నీ తిరిగాను — అన్నీ చూచాను — వచ్చాను. మీరులేరు. రాజుగారి చాటింపు విన్నాను. సంగతి అర్థమయింది. అందుకని ప్రయత్నించి పూర్తిచేశాను" అని ఆయాసపడ్తూ చెప్పి తండ్రికి నమస్కరించాడు. అతని ఇహ లోకయాత్ర పూర్తి అయినది.

బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతున్న అతని వదనం వడలి వాలిపోయింది పేలవంగా.

మహాశిల్పి కంపించాడు. అతని హృదయ కుహరంలో కార్చిచ్చు సెగుపు మంటలు ఎగసినవి. పెను ప్రభంజనాలు భయంకర విన్యాసం చేసినవి.

అతనిలో అహంకారం అణగిపోయింది. ఈర్ష్య సమూలంగా నశించిపోయింది. పశ్చాత్తాపం పెల్లుబికింది.

ఉద్రేకంతో ఆ తనయుని హృదయంలోని ఛురికను లాగి తన గుండెలో దింపుకొన్నాడు బలంగా. తూలినాడు. 'అబ్బా' అని ఒరిగి ప్రాణాలు విడిచాడు.

దేవాలయం వారి దేహాలతో పాటు నెలతెలా పోయింది. మహాదేవుని ప్రతిష్ట అంతటితో ఆగిపోయింది.

తెల్లని చల్లని వెన్నెల మెల్లగా నవ్వుకొన్నది రెండో సారి. మానవుని ఈర్ష్యాహంకారాల ప్రచండ పైశాచిక పరిణామం చూసి.



# అన్నయ్య....

అన్నయ్య! అన్నయ్య ఎంత మంచివాడు! ఎంత తీయని మనసు అన్నయ్యది! ఎంత గొప్పది అన్నయ్య హృదయం! అసలు అటువంటి అన్నయ్యకు తమ్ముణ్ణి అయినందుకు నా హృదయం పొంగిపోతూ వుంటుంది. అటువంటి అన్నయ్య నాకు ఉండడం నిజంగా ఎన్ని జన్మల సుకృతమో అయివుంటుంది. ఎందుకో నేనంటే అంతులేని ప్రేమ అన్నయ్యకు! అన్నయ్యంటే చెప్పనలవికాని అనురాగం నాకు. అసలు అన్నయ్యే నేను - నేనే అన్నయ్య.

మాకుచిన్నప్పుడే నాన్నపోయారు. అమ్మ డెబ్బయ్యోపడిలోనికి వచ్చింది. జవసత్వా లుడిగిపోయినయ్. పని - పాట చేయలేదు. నేనేమో చదువుకొనేవాడిని. అటువంటి సమయంలో అన్నయ్యకు చదువుకోవాలని ఇష్టమున్నా స్వస్తి చెప్పి ఏదో కంపెనీలో ఫిట్టర్‌గా చేరాడు.

"నాచదువు ఎట్లాగూ పోయింది - తమ్ముణ్ణి మాత్రం అలా కానివ్వను. వాడు బాగా చదువుకోవడమే మనకు కావలసింది. వాణ్ణి ఇంజనీరు చేస్తాను. ఇంకా - అప్పుడుకాని నాకు తృప్తిగా వుండదు ..." అనేవాడు అన్నయ్య.

అన్నయ్య ఉద్యోగంలో చేరినప్పటినుంచి ఒకమోస్తరుగా మా కుటుంబం ఆర్థికంగా బాగుపడింది. నా చదువు కూడా ఏఇబ్బందీ లేకుండా సాగిపోతున్నది. ఇంట్లో అన్నయ్య

అమ్మను ఇక్కడివస్తువులక్కడ పెట్టనిచ్చేవాడుకాదు. "ఎందుకురా నీకంత శ్రమ" అని అమ్మగనుక అంటే "పోమ్మా! అసలే నీకు ఒంట్లో ఓపిక లేదు. నువ్వు పని ఏం చేయగలుగుతావు? అలా కూర్చో నువ్వు. నేనున్నానుగా. అంతా నిమిషంలో చేసేస్తా" అనేవాడు.

మా అమ్మ ఎంత పుణ్యాత్మురాలో! అంత మంచి పుత్రుడ్ని కన్నందుకు.

ఒక కుటుంబంలో సంతానం, మంచివారైనా చెడ్డవారైనా అంతా వాళ్ళకు జన్మ యిచ్చిన తల్లి చేసుకొన్న పూర్వజన్మ సుకృతం మీద ఆధారపడి ఉంటుంది అని అనుకొంటూవుంటాను.

"ఒరేయ్ అబ్బాయ్! నువ్వుగనుక వివాహం చేసుకొంటే ఈ బరువు తీరిపోతుందికదరా. నీ కెందుకొచ్చినబాధ. నన్నేమో ఏపని చేయనివ్వవ్. నువ్వే అంతశ్రమా తీసుకొంటావు. తొందరగా పెళ్ళి చేసుకొని కోడల్ని తెస్తే బాగుంటుందిరా" అనేది అమ్మ అన్నయ్యతో.

"ఆమ్మా పెళ్ళిమాట ఎత్తొద్దు ఇప్పుడప్పుడే. ఇంట్లో పని కావాలంటే కోడలే రావాలా ఏమిటమ్మా? ఆ మాత్రం మనం చేసుకోలేమా ఏం? తమ్ముడు ఇంజనీరు కావాలి... వాడు ప్రయోజకుడైనప్పుడు గాని నేను పెళ్ళి చేసుకోను" అనేవాడు అన్నయ్య.

"సరే నాయనా. నీ ఇష్టం" అని ఊరుకొనేది అమ్మ.

నిజంగానే నా చదువుకు కావాల్సినవన్నీ కాదనకుండా కొనిచ్చేవాడు. అమ్మనైతే పువ్వుల్లోపెట్టి పూజించేవాడు.

నిజంగా అన్నయ్య మంచితనాన్ని, అలవాట్లనీ చూసి, తెలిసినవాళ్ళు స్నేహితులు ఎంతో ఆశ్చర్యపడేవాళ్ళు. అన్నయ్యను ఎంతో మెచ్చుకొనేవారు.

అన్నయ్య శ్రమించి చెమటోడ్చి సంపాదించిన దానితో ఎట్లాగైతేనేం స్కూల్ ఫైనల్ పూర్తి చేసి కాలేజీలో చేరాను అన్నయ్య చలవాఅంటూ. నా అదృష్టం బాగుండి నేను చేసికొన్న పూర్వజన్మ సుకృతం మూలంగా నాకిటువంటి అన్నయ్య దొరికాడు.

"నేను బాగా చదివి అన్నయ్యకు పేరు తేవాలి. అన్నయ్య శ్రమను బూడిదలోపోసిన పన్నీరు చేయకూడదు" అనుకొంటూ ఉండేవాణ్ణి. అసలు అన్నయ్య హృదయం నవనీతం. కాలేజీలో చేరేటప్పుడు మంచి గుడ్డలు కుట్టించాడు. ఎంతో కష్టబడి కూడబెట్టిన డబ్బుపెట్టి మంచి వాచీ కొని పెట్టాడు. అమ్మతో అన్నాడు "అమ్మా! చూడవే. తమ్ముడు తప్పకుండా ఇంజనీరు అవుతాడు. ఇంకా నాలుగేళ్ళు ఓపిక పట్టు. మన వాడు మా కంపెనీలో ఇంజనీరుగావస్తే నాకు ప్రమోషనిప్పిస్తాడు" అని నావైపు తిరిగి "ఏరా?ఇప్పిస్తావా?... ఇప్పిస్తావు. నాకుగాకపోతే యింకెవరికిప్పిస్తాడులే" అన్నాడు

అయిదు క్యాలెండర్లు చిరిగిపోయిన్నై. నేను బి. ఇ., ఎ. ఎమ్. ఐ. ఇ. ప్యాసయ్యాను ఫస్టుక్లాసులో. అన్నయ్య కలలు పండిన్నై. బి. ఇ. ఫస్టున ప్యాసయినానని తెలియగానే అన్నాయ్ పరుగెత్తుకొనివచ్చి-ముందు అమ్మను. కళ్ళలో ఆనందాశ్రుకణాలు జిగేలుమని మెరుస్తూంటే ప్రేమతో... సంతోషం పట్టలేక, నుదుటిమీద ముద్దెట్టుకొన్నాడు.

"చూసావా అమ్మా! నే చెప్పలేదూ...జ్ఞాపక ముందీ? చూడమ్మా! తమ్ముడు ఫస్టున ఇంజనీరింగ్ ప్యాసయ్యాడు. ఇంకేం...ఇక నీకు కోడల్ని తీసుకొస్తాగా... ఫరవాలేదు, నీ కోరికకూడా తీరుస్తా" అన్నాడు అమ్మతో.

సంతోషంతోనూ; అన్నయ్యమీద ఎనలేని కృతజ్ఞత గౌరవ భావాలతోనూ, అలానుంచున్న నా దగ్గరకొచ్చి, తనవితీరా తన హృదయానికి హత్తుకొన్నాడు. అన్నయ్య నన్న చిన్నప్పుడే పితృమమకారానికి దూరమైపోయిన నేను, అన్నయ్య గట్లు త్రెంచుకొనివచ్చే ప్రేమవాత్సల్యాల మిళిత మైన తియ్యటి పరిష్వంగంలో తిరిగి నాన్న జ్ఞాపకాని కొచ్చాడు.

సాధారణంగా జరిగే విధంగా తన దారిని తను చూచు కొని మా విధికి మమ్మల్ని వదలివేయకుండా నాన్న బాధ్య తను తాను తీసికొని గంపెడు భారాన్ని తాను మోస్తూ, నన్నింతగా పైకితెచ్చి, అమ్మనంతగా సుఖపెడ్తూ, మా కోసగం అన్నయ్య పడ్డపాట్లు తలచుకొని, నా హృదయంలో క్షోభ పెల్లుబికింది కళ్ళు చెమర్చినై.

అన్నయ్యచూసి "ఎందుకురా తమ్ముడూ! ఏడుస్తావ్. ఛీ. తప్పుకదూ-బాగానేఉంది. ఒకనైస్ ఇంజనీరు అయ్యావు. చిన్నపిల్లాడిలా ఏడుస్తావేంటి" అన్నాడు కన్నీళ్ళు తుడుస్తూ.

అబ్బ! ఎంత గొప్పవాడు అన్నయ్య! నాకెంత గర్వం అటువం టన్నయ్య నాకున్నందుకు.

నిజంగా ఆరోజు పండుగ అయినంత సంబరం చేశాడు అన్నయ్య. కనిపించిన స్నేహితు లందరికీ చెప్పాడు నేను

ఘస్టున ప్యాసయ్యానని. ఇంకా తటస్థపడని, మిగిలిపోయిన స్నేహితులందరికీ పనికట్టుకొని పోయి చెప్పొచ్చాడు. ఆరోజు స్నేహితులందరికీ పిండివంటలుచేసి పార్టీ యిచ్చాడు.

కొన్నాళ్ళు దొర్లిపోయినయ్ ఇంతలో బొంబాయిలో ఏదో ఫ్యాక్టరీలో అన్నయ్యకు మెకానిక్‌గా ఉద్యోగం వచ్చింది. జీతం కూడా అక్కడ ఎక్కువ ఇవ్వడంతో మమ్మల్నిద్దర్నీ వదలి అన్నయ్య వెళ్ళాడు బొంబాయికి. ఇన్నాళ్ళు అన్నయ్య ప్రేమవాత్సల్యాల నీడలో నున్న నేను అన్నయ్య వెళుతుంటే ఏదో అవ్యక్తమైన వ్యధ చెందాను. శాశ్వతంగా నా అన్నయ్యకు దూరం అవుతున్నానేమో నన్న భయంతో కంపించి పోయాను. అన్నయ్యను–'అన్నయ్యా'అంటూ వెళ్ళి కౌగలించుకున్నాను. అన్నయ్యను – "అన్నయ్యా వెళ్ళొద్దన్నయ్యా! నువ్విక్కడే వుండన్నయ్యా. నువ్వు లేకపోతే నేనిక్క డుండలే నన్నయ్యా"—అన్నాను. దుఃఖం వెల్లుబికి వస్తూంటే అసలు అక్కడ కెళ్ళటం అమ్మకు మొదలుకే ఇష్టం లేదు.

అన్నయ్య అన్నాడప్పుడు – "మీకేం భయమమ్మా, మీకు ప్రతి నెలా డబ్బు పంపుతాను. ఇక్కడకన్నా డబ్బు లెక్కువ వస్తూంటే ఎందుకమ్మా వదలిపెట్టడం. రెండుమూడు నెలలు కాగానే మిమ్మల్నే అక్కడకు తీసుకెళ్తా" నన్నాడు అన్నయ్య. అమ్మ అన్నది : "నేనేమో ముసలిదాన్నయి పోయాను. తమ్ముడేమో నీవు అనుకున్నట్లుగానే ఇంజనీరు అయ్యాడు. ఇవాళో రేపో నీవు అనుకొన్నట్లుగానే వాడికి కూడా ఉద్యోగం దొరుకుతుంది. మరి నువ్వు కోడల్నెప్పుడు

తెస్తావురా - నా కదే బాధగా ఉన్నది. నువ్వాగనక ఒప్పుకుంటే తిరిగి నువ్వు వచ్చేటప్పటికి సంబంధం కుదిర్చి వుంచుతాము'' అన్నది.

''నీ యిష్టమమ్మా-యిక నువ్వెప్పుడు తెచ్చినాసరే!'' అన్నాడు నవ్వుతూ అన్నయ్య.

నాహృదయం పరవళ్ళు త్రొక్కింది. పెళ్ళి! అన్నయ్య పెళ్ళి. నాకు వదిన వస్తుంది. అన్నయ్య నింక ఉద్యోగం చెయ్య నివ్వను. వదినను తల్లి మాదిరిగా చూచుకొంటా. ఎన్నో! ఇంకెన్నెన్నో అనుకున్నాను.

అన్నయ్య వెళ్ళి బొంబాయినుండి ఉత్తరం వ్రాశాడు. అన్ని సంగతుల్తో. అన్నయ్య వెళ్ళిన వారం రోజులకు ఆయన పనిచేసిన కంపెనీలోనే నాకు ఇంజనీరు ఉద్యోగం దొరికింది. నా సంతోషసాగరానికి చెలియలికట్ట లేకపోయింది. అన్నయ్య నా ప్రాణానికి ప్రాణం అయిన అన్నయ్య అమోఘ ఆశీర్వచనాలు, చలవ యిదంతా. నా బహిఃప్రాణమయిన అన్నయ్య ఒకప్పుడు కనిన కలలు యిప్పుడు వాస్తవరూపంలోకి తేగలిగాననే గర్వం నన్ను గర్వపడేటట్లు చేసింది. నా మీద నాకే ఎంతో ఎంతో గౌరవం కలిగింది. వెంటనే ఉత్తరం వ్రాశాను అన్నయ్యకు. అన్నయ్య సంతోషానికి హద్దులులేవని- అసలు తనెంత సంతోష పడుతున్నదీ తమ ఉత్తరం ద్వారా తెలియ జేయటానికి మాటలుచాలటంలేదని వెంటనే ఉత్తరంవచ్చింది.

అన్నయ్యకు సంబంధం కుదిరింది వ్యవహారం అంతా పూర్తయింది. మాఘ మాసంలో వివాహం చేయాలని నిశ్చయమైంది. ఈ సంగతి ఉత్తరం వ్రాస్తూ పెళ్ళి యింకా-

ఆరునెలలున్నది కదా; ఈ మధ్యలో ఒకసారి వచ్చి పోమ్మని అన్ని విషయాలూ సవిస్తరంగా మాట్లాడుకో వచ్చుననీ ఉత్తరం వ్రాయించిం దమ్మ.

వీలుచూచుకొని పదిరోజులు శెలవుపెట్టి వచ్చే నెలలో వస్తున్నానని వ్రాశాడు అన్నయ్య.

అన్నయ్య వచ్చాడు. కొద్దిగా చిక్కిపోయాడు. అమ్మకీ, నాకూ బట్టలు తెచ్చాడు. ఉన్న పదిరోజులూ ఎంతో గర్వంగా తిరిగాడు. తాను ఉత్తరంలో, వ్రాతలో కనబర్చలేని సంతోషాన్నీ, గర్వాన్నీ స్పష్టంగా కనబర్చాడు. పెళ్ళికి అన్ని పనులు తయారుచేయిస్తూ ఉండమనీ, తాను ఒక పదిరోజులుముందు వస్తాననీచెప్పి తిరిగి బొంబాయి వెళ్ళి పోయాడు.

అన్నయ్య పెళ్ళికోసరం ఎంతో సంతోషంతో ఎదురు చూస్తున్నాను. కొన్నిరోజులు ఇట్టే గడచిపోయినై. అన్నయ్య వివాహం దగ్గరపడింది. అన్ని పెళ్ళిపనులూ పూర్తి చేశాము. వదినె కోసరం మంచి మంచి చీరలూ, పట్టుచీరలూ, బంగారు గాజులూ, నెక్లెసు కొన్నాను. అన్నయ్యకు, అమ్మకు కొత్త గుడ్డలు తీసుకొన్నాను. వివాహం దగ్గరపడుతున్నకొద్దీ నా సంతోషానికి పట్టపగ్గాలులేకుండా పోతున్నది. నన్ను పెంచి ఒక ప్రయోజకుడుగా చేసిన నా అన్నయ్య వివాహానికి నేనే పెత్తనం చెలాయిస్తున్నానని ఎంతో తబ్బిబ్బైపోయాను. వివాహం అయిన మరుక్షణం పూజ్యులైన అన్న, వదినెగార్ల పవిత్ర చరణ ద్వయంపైబడి నా భక్తి గౌరవాలను తెలుపు

కోవాలని నా హృదయంలో ఆరాటం ఎక్కువైపోయింది. నా మనస్సు నిలువనీయడంలేదు నన్ను.

అన్నయ్య రేపే వచ్చేది—ప్రొద్దున్నేలేచి స్టేషన్ కెళ్ళాలి.

రాత్రి నా హృదయంలో పెల్లుబికే సంతోషం, ఆరాటం నిద్రాదేవిని జయించేసినై.

అన్నయ్య వివాహపు తలపులు, పెళ్ళి ఎంత ఘనంగా జరగాల్సిందీ... ఇంకా ఎన్నో ఆలోచనలూ!

వదినెగారు రాగానే "ఇటువంటి మంచి అన్నయ్య ప్రపంచంలో మరెవ్వరికీ దొరకదమ్మా! నీవు నోచిన పూజలు ఫలించి నీభర్త అయినాడమ్మా వదినా" అని చెబుదామని తొందర-ఆతృత.

నిద్దురరాదు-ఎంతసేపటికీ తెల్లవారదు. పక్కమీద ఈ వైపునుండి ఆ వైపుకు ఒకటే దొర్లడం. మనసంతా నిండి ఆనంద డోలికల్లో నన్ను ముంచేస్తున్న ఏవేవో అర్థంగాని ఆలోచనలు.

ఎలాగే తెల్లవారుజామున నిద్దుర పట్టింది. కలతనిద్ర. ఒళ్లు జలదరించింది. భయంకరమైన కల. అన్నయ్య - కొద్ది రోజుల్లో నిక్షేపంగా ఒక ఇంటివాడవబోతున్న నా అన్నయ్యకు కీడును తెలిపే పీడకల-నిలువునా ఆపాదమస్తకం కంపించిపోయాను. నాకు తెలియకుండానే ఇల్లు దద్దరిల్లేలా 'అన్నయ్యా' అని బిగ్గరగా అరిచాను నిద్రలోనే. అమ్మ

భయంతో పరుగెత్తుకొచ్చింది. ఏమిటి నాయనా అని ఆతు రతతో అడిగింది. అప్పుడుగాని అసలు ప్రపంచంలోకి రాలేదు నేను. "ఏమీ లేదమ్మా-ఏదో కలవరింత-అంతే. వెళ్ళిపడుకో" అన్నాను.

అన్నానేగాని లోపల ఏదో భయం. ఛీ! పాడుకల - కలలు కల్లలేగానీ, నిజంగా జరుగుతాయా ఏమిటి!- నా పిచ్చి తనానికి నేనే సిగ్గుపడ్డాను - అయినా మనో అంతరాళంలో అట్టడుగున ఎక్కడో కదిలి మెదిలే కాస్తంత అనుమానం, భయం-తిరిగిధైర్యం...నా ఆలోచనలకు నాకే నవ్వు...

తెల్లవారింది. మొహం అదీ కడుక్కొని స్టేషన్‌కు బయలుదేరదామని కారు బయటకు తీశాను. గేటుదాటబో తుండగా టెలిగ్రాం మెసింజర్ ఎదురొచ్చాడు. ఆపి ఏమి టన్నట్లు చూశాను. టెలిగ్రాం సార్ అంటూ కవరు చేతిలో పెట్టాడు.

సంతకంపెట్టి ఎలా తీసుకొన్నానో నాకే తెలియదు. తెల్లవారుజామున, పాపిష్టికల-బయలుదేరబోతుండగా యెదు రుగా టెలిగ్రామ్. ఏవేవో శంకలు. కవరు చించాను. ఈ వైపునుండి ఆ వైపువరకు ఒక్కసారి చదివాను.

నిన్నటి రాత్రి డ్యూటీలో అన్నయ్య మిషన్‌లోపడి మరణించాడనీ, వెంటనే బయలుదేరి రమ్మనమనీ దాని సారాంశం. ఎవరో స్నేహితుడిచ్చిన టెలిగ్రాం. ఉన్న ఫళాన కారు బ్రద్దలయి పోయినట్లనిపించింది. "అన్నయ్యా"

అంటూ నా హృదయం పగిలిపోయేలా అరుస్తూ స్టీరింగ్ మీద పడిపోయాను. నన్నింత వాడ్ని చేసి, చూసి, సంతోషించి, తన కర్తవ్యం నెరవేర్చుకొని ఇక తన పనయిపోయినట్లు మమ్మల్నందర్నీ వదలి శాశ్వతంగా నిష్క్రమించాడు అన్నయ్య - అన్నయ్య! ఇక లేడు. నా-కు-అ-న్న-య్యా-లే-నే-లే-డు.

(పూజనీయులు, స్నేహితులు, కీర్తిశేషులు అయిన శ్రీ ఆర్. నరసింగరావుగారికి భక్తితో).



# మహా గవి ఇవి...

చీకటి చిక్కగా అలముకొని ఉన్నది.

కంపార్ట్‌మెంట్‌లో ఎవ్వరూ లేరు. అబ్బ!...ఒంటరి తనం భరించలేనంత బాధగా ఉన్నది.

భయంకరమైన తిమిరాన్ని ర్యాష్‌గా దూసుకుపోతూ రైలు చక్రాలు చేసే క్రమబద్ధమైన సవ్వడి......

నిర్నిద్రమైన జగత్తుకు లాలిపాటలా కీచురాళ్ళ లయ బద్ధమైన శబ్దం...

అనంత ప్రయాణంలోని బాటసారి మజిలీలా, అక్కడక్కడా స్టేషన్‌లలో ఆగడం...

"చుట్టా, బీడి, సిగరెట్" కేకలూ...దిగేవాళ్ళుదిగడం, ఎక్కేవాళ్ళు ఎక్కడం...

దాని దుంప తెగ-ఒక్కడు ఎక్కడుగద తన కంపార్ట్‌మెంట్‌లోకి!...

దూర ప్రయాణాలు ఒంటరిగా దోస్తీ లేకుండా చేయడం కష్టమే!

పోనీ పేపరు చూస్తూ కూర్చుందాంలే అనుకొంటే... ఎంతసేపని చూసినవార్తే చూడడం. విసుగు... ఎవరయినా ఈ పెట్టెలోని కెక్కితే కాస్తగాసిప్ అయినా వేసుకోవచ్చు. ఇంకా కాజీపేట కూడా రాలేదు. బెజవాడ ఇంకా దాదాపు నూట ఇరవై మైళ్ళుంటుంది. ఇలా ఒంటరిగా ఎలా గడపడం...

మళ్ళీ స్టేషను వచ్చినట్లున్నది. ఆశాభావం... ఎవరయినా ఎక్కుతారేమోనని.

ఆగనూ ఆగింది. ప్యాసింజర్స్ లేరట్లే వుంది. ఆగడం, బయలుదేరడం ఒకసారే జరిగింది.

ఛీ! వెధవ ప్రయాణం... పగవాడికి కూడా వద్దురా బాబూ ఈ యాతన. మళ్ళీ స్టేషనొచ్చేటప్పటికి పత్రికలోని రెండు కథలు మళ్ళీ చదివినవే చదివేశాను.

"అబ్బ! డ్యామ్ బోరింగ్"...

అదుగో కాజీపేట కామోసు. ఆగింది బండి. రణగొణధ్వని ఎప్పుడైనా ఎవరైనావస్తే ధన్యణ్ణే. సగం ప్రయాణం యింకా వందమైళ్ళు. ఎవరైనాఎక్కి కనీసం రెండుమూడు స్టేషన్లు వరకయినా నాలుగుముక్కలు పిచ్చాపాటీ మాట్లాడివెళ్ళినా కొంత బోర్ ఫీలవకుండా ఉండును మనసు. ఏం లాభం...ఎవ్వరూ ఎక్కడంలేదే!"

అదిగో గంటకూడ కొట్టేశారు. ఇంజన్ యీసురోమంటూ కూసింది. ఎందుకొచ్చిన బాధరా భగవంతుడా అన్నట్లు ఎందుకు పుట్టానురా అని బాధపడ్తూ, ఏడుస్తూ, యీసురోమంటూ జీవితాన్ని గడిపే నిర్భాగ్య దామోదరుడిలా.

అయినా, బయలుదేరేముందైనా ఎవరూ ఎక్కరూ, వెధవ ఆశ! ఆ ఆశ అనేది ఉన్నది చూశారూ!

అదిగో ఎవరో ఆడమనిషిలా ఉంది. చీకట్లో సరిగ్గా కనుపించడంలేదు. పాపం పరుగెత్తుకొస్తోంది.

అమ్మయ్య... తన పెట్టెలోకే. ఫరవాలా... అయ్యో! చేతిలో సూట్ కేస్ కూడా ఉన్నది పాపం-బండికూడా కదిలింది.

సంబరంతో హడావుడిగా లేచి, పరుగెత్తినంత జోరుగా వెళ్ళి, తలుపుతీసి, ఎక్కబోయే ఆమెచేతిలోని సూట్ కేస్ అందుకొని సహాయం చేశాను.

నేను కూర్చున్న సీటు కెదురుగా కూర్చుందామె. ఒకసారి పరీక్షగా చూచాను. ఆమెను ఎవరో ఒకరు మాట్లాడ డానికి దొరికారనే తృప్తితో.

అబ్బ! ఎంత అందం! పచ్చని పసిమి, నిడుపైన విగ్రహం, అవయవాల పొందిక, శుభ్రజ్యోత్స్నలు ప్రసరింప జేసే పూర్ణచంద్రుని సోయగాన్ని తలపించే ఆమె అందమైన మోము-గుండ్రటి కుంకుమబొట్టుతో మరింత కళకళలాడు తోంది. వయస్సు పాతికలోపే ఉండొచ్చు.

ఇంతట్లోకి జ్ఞాపకాని కొచ్చింది. రైలెక్కేటప్పుడు పెట్టె అందుకొని సహాయం చేశాను గదా! కనీసం మాట వరసకయినా కృతజ్ఞతలు చెప్పొద్దూ! హుఁ! తెలీయదేమో! కావాలని నేనే కలుజేగసుకొన్నాను.

"ట్రైన్ పోతుంటే ఎక్కడమన్నది చూశారూ! చాల అపాయం సుమండీ! ఇంతకూ మీరెంతవరకు వస్తున్నారో?"

అరే! జవాబు చెప్పదేమిటి? గర్వమేమో! తలకాయ వంచుకొని ఒక ప్రక్కకు ఒదిగి కూర్చున్నది.

అయినా వంటరిగా ఎవరూ లేనిచోట ఒక పరాయి పురుషుడితో ధైర్యంగా తలెత్తి ఎలా మాట్లాడుతుంది...

"ఏమండోయ్! నేను హైదరాబాదునుండివస్తున్నాను. చాలాసేపటినుండి ఒంటరిగా ఉన్నాననుకోండి. దూర ప్రయాణంలో ఎవరూ లేకుండా ప్రయాణించడం కష్టం సుమండీ... మీరు రాగానే ఎంత సంతోషించానో...ఎక్కడికి వెళ్తున్నారో?"

ఒకసారి ఆమె మోమెత్తి ఏదో అర్థంకాని దృక్కులు బరపి పూర్వ స్థితిలోకి జారిపోయింది.

తనేమయినా అపకారం చేస్తానని భయపడుతోందేమో! పిచ్చిమనిషి!"ఏవమ్మా ఒంటరితనం ఫీలవుతున్నాను. మీకేం భయంలేదు...ఏవో పిచ్చాపాటి మాట్లాడుకొందాం మాట్లాడవమ్మా!"

అయ్యో! ఖర్మ! ఏడుపుకూడానా? ఆమె కళ్ళలోంచి ముత్యాల్లాంటి నీళ్ళు చెక్కిళ్ళను తడిపివేశాయి.

"భయపడకు అమ్మాయ్! నేనేమీ రౌడీని కాను. ఎందుకండీ ఏడుస్తారు? మీ పేరేమిటో చెబుతురూ?"

ఇంకా ఏడుస్తూనే వున్నది. "ఇందాకటినుంచి ఎవరయినా వస్తే చక్కగా ప్రొద్దుపోతుందనుకొన్నానండీ! రెండుమాటలు మాట్లాడితే మనసుకు హాయిగా వుంటుంది. కారణం లేకుండా మీ రెందుకలా కన్నీరు పెట్టున్నారు?..."

ఆమె ఎటో, ఏలోకాల్లోకో చూస్తూ అటు తిరిగి కూర్చుంది.

అబ్బ! ఎంత గర్వం? ఆ అందానికి తోడు ఆమె మాటలలో ఎంతో మధురిమ ఉందనుకోవడం వమ్ము అయిపోయింది.

ఒక్క మాట మాట్లాడితే బాగుండును. తేనె సోనలు చిందవుగదా!

అయినా అందం ఉండగానే సరిపోయిందా! మర్యాద, వినయం పుట్టుకతో రావాలిగానీ. ఛీ! ఎంత గర్వం? హు!

తిరిగి ఏదో పత్రికా సంపాదకీయం చదువుకోవడంలో మునిగిపోయాను కోపంతో.

స్టేషన్లు ఒకదాని తర్వాత ఒకటివస్తున్నాయ్, రైలును దాని గమ్య స్థానానికి చేర్చడానికి.

సంపాదకీయం చదువుతున్నా, దృష్టిని అటునుండి మరల్చలేక పోతున్నాను. చూస్తే ఏదో వ్రాసుకొంటూంది ఒక నోట్ బుక్ లో.

ఛీ! మర్యాద తెలియని మనుష్యులు! ఒక్క ముక్క మాట్లాడితే ముత్యాలు ఏమైనా రాల్తాయా?

డోర్నకల్ స్టేష నొచ్చింది. ఆమె అక్కడే దిగాలి కాబోలు, పైనుండి పెట్టె దింపుకొంది. యిందాకటినుండి ఏదో వ్రాసిన కాగితం పుస్తకంలోనుండి చింపి, మడతపెట్టి పుస్తకం బ్యాగ్ లో పెట్టేసుకొన్నది. పెట్టె తీసుకొని వెళ్ళి పోతూ, పట్టుకొన్న కాగితాన్ని క్రింద పడేసిం దామె. వాలకము చూస్తే కావాలని పడేసినట్లుంది.

ఛీ...ఎంత కుత్సితం...మనిషి మొగాని బట్టి గుణం చెప్పలేం కదా!

వెళ్ళేటప్పుడు ఏదో అర్థంగాని అంతులేని చూపొకటి విసిరి, దిగి వెళ్ళిపోయిందామె- నిదానంగా అడుగులేస్తూ.

వైలుపెట్టె ఖాళీగా బోసిపోయింది. తిరిగి ఒక్కసారి పోయాను. ఎవరైనా మళ్ళీ వస్తారో-రారో, మళ్ళీ మొదటి కొచ్చింది వ్యవహారం. ఒక్కోరోజు ఏమౌతుందేమోగాని జనం క్రిక్కిరిసిపోయి ఒకళ్ళ భుజాలుమీద ఒకళ్ళెక్కి త్రొక్కుకొనే సమయాలుకూడ ఉన్నాయ్.

ఆమె వెళ్తూ తీసిన తప్పులు దభాల్నపడి తిరిగి, ఆ కాగి తాన్ని జ్ఞాపకం చేసింది.

నాలోని కౌతుకం మడతవిప్పి ముత్యాల్లా ఉన్న అక్ష రాల్ని చదివేలా చేసింది.

నమస్కారములు——

మర్యాదకోసమయినా మాట్లాడలేదని మీకు కోపంగా వుందని నాకు తెలుసు. మీరేదో హద్దులుదాటి నీచంగా ప్రవ ర్తిస్తారని భయపడలేను. ఒకళ్ళతో మాట్లాడితే గౌరవ భంగ మవుతుందని భావించే గర్విష్టిని కూడా కాను. మీరు పేరడి గినా చెప్పలేదు. మీరెంతో మాటాడాలని ఉబలాట పడ్డారు. కాని నేను మాటాడలేదు. నాపేరు వీణ. అందంవుంది. ఏం లాభం? సృష్టి వైచిత్రి యిలాగే వుంటుందేమో. నేనుఫుట్టుక తోనే మూగ జీవిని. మీతో మాట్లాడక పోవటానికి కూడా కారణం అదే. ఎప్పుడయినా ఇటువైపు రావడం తటస్థిస్తే తప్పక మీ దర్శనభాగ్యం కలుగజేస్తారని తలుస్తాను. అడ్రసు క్రింద యివ్వ బడింది.

క్షంతవ్యురాల్ని,

వీణ.

అదిరిపోయా నది చదివి. భారంగా దీర్ఘంగా నిట్టూర్చాను.

అనుకొన్నాను. నామనోపతరాళాల్లో 'నీవుమామూలు వీణవుకావు తల్లీ-మహా మహతి వీణవి. నీ హృదయ వీణె మూగపోయింది కాని, లేకపోతే మృదు మధుర కాకలీని స్వనాలుద్భవింప జేసేదానివి తల్లీ' అని. అంతా సృష్టి వైచిత్రే... కాదూ!...



# నిజానిజాలు

కన్నతల్లిని ఎడబాసి ఆమె అనురాగ వాత్సల్యాలకు చిన్నప్పుడే దూరమై ప్రోడుబారిన ప్రాణం; ఏ స్త్రీమూర్తి మృదు మధుర వాగ్వాహినితోనయినా చిగిర్చి మోసులెత్తి మాతృ మమతానుభూతులను చవిచూస్తుంది.

పాణి విషయంలో యిది అక్షరాలా నిజమయింది అని చెప్పొచ్చు. సూర్యుని అంతిమ కిరణాలు రాలేక రాలేక వచ్చి పడి వెలా తెలా పోతున్న వేళ, ఆఫీసులో పనిముగించుకొని ఆదుర్దాతో ఇంటిముఖం పట్టాడు పాణి. వారం రోజులనుండి అమ్మకు జ్వరం తీవ్రంగా వస్తోంది. డాక్టరుకు చూపించాడు. రోజూ మందులూ, ఇంజక్షనులూ యిప్పిస్తూనే ఉన్నాడు. ఆఫీసులో పనిచేస్తున్నా యింటిదగ్గర ఆమె ఎలా వుందోనన్న ఆలోచనతోనే సతమతమౌతూ పనిలో మనసును కేంద్రీకరించలేక పోతున్నాడు పాణి.

ప్రొద్దుననగా యిల్లు వదలి వచ్చేశారు తను, సుగుణ. ఈవేళ తనకు ఆలస్యమయింది. ఈ పాటికి సుగుణ వచ్చేసే వుండాలి. డాక్టరు కూడా వచ్చి చూసిపోయే ఉంటాడు. ఆమె కెట్లా వుందోననే ఆదుర్దాతో, ఆతురంతో, వేగంగా నడవ సాగాడు పాణి.

ఎందుకో ఆమెఅంటే తనకు ఎనలేని ప్రేమ. యదార్థంగా ఆమె రక్తాన్ని పంచుకొని జన్మించలేదు తను. తనతల్లి

ఎప్పుడో చిన్నప్పుడే నాన్నను, తనను వదిలివేసి ఒంటరివాళ్ళను చేసి చనిపోయిందట. నాన్న చెప్పాడు. అప్పటినుండి నాన్న మనసు వియోగభారంతో కృంగి, కృశించిపోతూ, పుట్టి పెరిగిన పల్లెటూళ్ళోనే, ఉన్న తాతలనాటి ఇంట్లో కృష్ణా రామా అంటూ కాలం గడుపుతున్నారు వియోగ భారంతో కుమిలి పోతున్నా, నాన్న తనకు చదువు చెప్పించడంలో మాత్రం అశ్రద్ధ ఏమాత్రం చూపించలేదు. తను బి.ఏ. ప్యాసై ఒక కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు హైదరాబాదులో. ఉద్యోగం దొరకగానే సుగుణతో తనకు వివాహమయింది. అన్ని విధాలా తన కనుగుణంగా ఆనందదాయకంగా మసలుతూ ఆదర్శభావాలుగల సుగుణ తన జీవన భాగస్వామిని అయింది. ఆమె కూడా చదువుకొన్నదీ, తెలివితేటలు కలదీ అవడంతో తన యిష్టంమీద ఆమె కూడా ఏదో ఫర్మ్‌లో క్లర్కుగా పనిచేస్తోంది ఇద్దరూ వేన్నీళ్ళకు చన్నీళ్ళుతోడుగా ఏదో సంపాదిస్తూ సుఖంగా జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నారు. సుగుణ ఉద్యోగంలో చేరిన కొత్తల్లో యింట్లో వంట వగైరాలకు ఎవరన్నా దొరుకుతారేమో ననుకుంటుండగా ఈమె తానుంటానంటూ వచ్చి కుదిరింది. ఆమెకు నా అనేవాళ్ళు ఎవ్వరూ లేరట. జీతం తీసుకొని ఉద్యోగం చేస్తున్నానని ఎప్పుడూ అనుకోలేదు ఆమె. సొంతయింట్లో మాదిరి వంటా వార్పూ చేస్తూ ఎంతో ఆప్యాయతతో పాణి బాబూ అంటూ అనురాగం ఒలకబోసేది. మాతృప్రేమకు నోచుకోని తను ఆమె చూపించే అభిమానంతోనూ, వాత్సల్యంతోనూ తబ్బిబ్బై మైమరచిపోయేవాడు. తనను చూస్తూంటే ఎప్పుడో

పోయిన తన కొడుకు జ్ఞాపకాని కొచ్చేవాడట ఆమెకు. వాడు బ్రతికివుంటే నీ అంత అయ్యేవాడు బాబూ అంటూ వుంటుంది ఆమె ఆమె అప్పుడప్పుడూ సుగుణ చెక్కిళ్ళను నిమురుతూ 'నిజంగా నీవు సుగుణాల రాసివే నమ్మాయ్' అని అంటూ వుంటుంది. ఆమె ప్రవర్తించే తీరులోనూ, ఆమె అనురాగ భరితమయిన మాటల తీయదనంలోనూ హృదయాలు పుల కించేవి. కొన్నాళ్ళకి ఆమెను తను 'అమ్మా' అని పిలవడం వరకూ వచ్చింది.

ఎన్నడో తల్లి కిదూరమైపోయిన తనకు ఇప్పుడు ఒకతల్లి ఉన్నది. అటువంటి మాతృమూర్తికి వారం రోజులనుండీ తీవ్రంగా జ్వరం వస్తోంది.

ఏమో– తన తల్లి మాదిరిగానే ఈమెకూడా తనను వదిలిపెట్టి పోదుగదా! పిచ్చి తలపులతో శరీరం గగుర్పొ డిచింది. యింట్లోకి ప్రవేశించేటప్పటికి సుగుణ వచ్చేవున్నది డాక్టరప్పుడే ఇంజక్షన్ చేసి వెళ్ళబోతున్నాడు. ఆదుర్దాతో పాణి అడిగాడు. 'ఆమె కెలాఉంది డాక్టర్?'

"నిన్నటికన్నా టెంపరేచర్ ఎక్కువగా ఉంది పాణీ! అయినా ఇంజక్ష నిచ్చాను. ఈ రాత్రి గడిస్తే ఇంకేం భయం ఉండదు. రాత్రికి జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండండి. ప్రొద్దున్నే వస్తాను" అంటూ డాక్టరు వెళ్ళిపోయాడు.

ఆదుర్దాతో ఆమె మంచం దగ్గరకెళ్ళాడు పాణి. ఆమె మన స్పృహలో లేదు. జ్వరం తీవ్రంగా ఉన్నది. శరీరం సల సలా కాగిపోతున్నది. ఆమెకళ్ళు లోతుగా పీక్కొనిపోయివున్నై.

ఆమె వాడిపోయిన వదనంలో జ్వర తీవ్రతవలన కలిగిన నీరసంతోబాటు ఏదో అస్పష్టమైన ఆవేదన తొంగిచూస్తోంది.

రాత్రంతా ఇద్దరూ జాగ్రత్తగా కనిపెట్టుకొని కూర్చున్నారు. రాత్రి రెండు ఝాములప్పుడు ఒకసారి ఆమెకు దాహంవేసి నీళ్ళు అడిగింది.

తెల్లవారుఝాముకు ఇద్దరికీ కొద్దిగా కునుకు పట్టింది. మెలకువ వచ్చేసరికి చీకటి అస్తమించి తెల్లగా తెల్లవారింది. ఏదో జ్ఞాపకంవచ్చి ఆదుర్దాతో ఆమె మంచంవైపు చూశారు యిద్దరూ.

చీకటితోబాటు ఆమెకూడా సెలవు తీసుకొన్నది. యిద్దరూ ఘొల్లుమన్నారు. ఆమెను ముట్టుకొని తడిమి చూశారు. నిజంగా శరీరం చల్లబడింది. పాణి ఎంతో దుఃఖించాడు. నిజంగా తల్లడిల్లిపోయాడు తల్లి చనిపోయినట్లు.

ఎక్కడో పుట్టిపెరిగిన ఆ ప్రాణి స్వంతకొడుకు చేతుల్లో ప్రాణాలు వదలాల్సిన గీతలేక, ముక్కూమొగ మెరుగని వారి చేతుల్లో ప్రాణాలు వదలింది.

ఆమె దిండుక్రిందుగా రెండు తెల్లకాగితాలు తొంగి చూచినై. ఆదుర్దాతో గబగబా ఆ కాగితాలను తీసి చూశాడు పాణి. అంతా చిందరవందరగా, అస్పష్టంగా వ్రాసి ఉంది. మొదటిపేజి చూచాడు పాణి. ఆశ్చర్యం...తనకే వ్రాసిఉంది. సంభ్రమంతో, ఏమిటా అని చదవడం మొదలు పెట్టాడు. సుగుణ ఆశ్చర్యచకితురాలై వినసాగింది.

"నాయనా పాణి బాబూ!

నేనిక బ్రతుకుతాననే ఆశలేదు. ఆ నిరాశే నన్ను ఈ సుదీర్ఘమైన జాబును వ్రాయమని ప్రోత్సహించింది బాబూ. చెరో దారిన పయనిస్తున్న మనం విధివశాన కలుసుకొన్నాం. మీ యింట్లోకి వచ్చినప్పటినుండి నా మనస్సుకు శాంతి, సంతోషాలు చేకూరినయ్యంటే నమ్ము ప్రాణీబాబూ. అప్పు డప్పుడూ నే చెప్పేదాన్ని కదూ, నా కొక కొడు కుండేవా డనిన్నీ; కాని దురదృష్టవశాత్తు వాడిని పోగొట్టుకున్నా నాయనా. నీ మీద అంత వాత్సల్యం కనబరచగలగడానికి అదే ప్రబలమైన కారణం బాబూ! నీవుకూడా మాతృప్రేమకు నోచుకోని నిర్భాగ్యుడి వవడంచేత, నేను కనబరిచే ప్రేమానురాగాలతో మైమరువగలిగావు. ఈ రెండేళ్ళనుండీ మనిద్దరి మధ్య తల్లికొడుకుల మధ్యఉండే అపూర్వమైన అనుబంధం, అభిమానం ఏర్పడినవంటే నువ్వుకూడ ఒప్పుకొంటావు బాబూ! కాబట్టి ఈ అంతిమ సమయంలో నా జీవితగాధనూ, నా హృదయాన్ని బ్రద్దలుచేసే నా భయంకరమైన పరిస్థితినీ, నీకు వెళ్ళబోసుకొంటేనేగాని నాకు మనశ్శాంతి ఉండదు. మీరిద్దరూ ఆఫీసు కెళ్లారు ఈ ఉత్తరం రాయడానికిదే సమయం దొరికింది ప్రాణ్!

కొందరు తాత్కాలికావేశాలకు లోనై తొందరపడి ఏదో చేయగూడని పనిచేస్తారు. దానివలన కలిగే పర్యవసానాలు ఏవీ ఆ సమయంలో వారేమాత్రం ఊహించలేరు చివరికి వాటి ఫలితాలను అనుభవించబోయే సమయంలో పశ్చాత్తాపము కలిగినా, దుఃఖంతప్ప, గడచిన రోజులు మరల తిరిగిరావు.

యిదంతా ఎందుకు చెబుతున్నానంటే సరిగ్గా ఈ విలువైన మాటలకు, నా జీవితగాథకు ఎనలేని సంబంధ బాంధవ్యాలున్నాయి. అవి విలువైన మాటలని మాత్రం అప్పుడు తెలుసుకోలేదు పాణీ! తరువాత తెలిసింది. ఆమాటల విలువ యింకోకూ నేచెప్పదలచుకొన్నది చెప్తాను. ఒకవేళ నేనీ లోకాన్ని విడిస్తే, నీవు తల్లిగా భావించుకొన్న విధంగానే నా మృత్యుకర్మ యథావిధిగా జరుపుతావనే ఆశ నాకున్నది. అది నా కోరికకూడా బాబూ! మనిద్దరికీ బాంధవ్యం లేకున్నా మనం పరస్పరం ఏర్పరచుకొన్న ఈ అవినాభావ సంబంధం ద్వారానే నిన్ను ఈ కోరిక కోరుతున్నాను.

నా కథ నా వివాహంతో మొదలవుతుంది పాణీ! ఆ రోజుల్లో మా యింటిప్రక్కనే మాకు బాగా పరిచయమున్న వాళ్ళు స్నేహితులు ఉండేవాళ్ళు. వాళ్ళబ్బాయి, నాతో ఎంతో చనువుగా ఉండేవాడు. కొన్నాళ్ళకి ఆ స్నేహం చనువూ, ప్రేమగా మారింది. నాకూ, అతనంటే అవ్యక్తమైన అనురాగం ఉండేది. అయినా వయస్సటువంటిది బాబూ!

కొన్నాళ్ళకి ఆ స్నేహం చనువూ, ప్రేమగా మారింది. ఎప్పుడు వివాహం చేసుకొందామా, ఎప్పుడు జీవిత మాధురులను పరం జేసుకొందామా అని తహతహలాడి పోయే వాళ్ళం.

కొన్నాళ్ళకి ఈ సంగతి ఉభయుల ఇళ్ళవాళ్ళకూ తెలిసింది. ఆ సంవత్సరమే మా అభిలాష ప్రకారంగానే మా ఇద్దరికీ వివాహం చేశారు.

మా యిద్దరికీ కోరుకొన్న విధంగా వివాహం జరిగి పోవటంతో మా సంతోషాలకు అవధుల్లేకుండా పోయింది.

పరస్పరానురాగాల మధ్య ఎంతో సంతోషకరంగా రెండేళ్ళు గడచిపోయినయ్. మా ప్రేమానురాగాల గుర్తుగా ఒక ముద్దుల బాబు కలిగాడు మాకు.

మనసుకు స్థిరత్వం, ఒకే అభిప్రాయం మీద నిలబడ గలిగే దృఢత్వం కలవారికి జీవితంలో సుఖ సంతోషాలకు లోటుండదు. వారి జీవితం కూడా స్థిరంగా, దృఢంగా, అచంచలంగా, ఉంటుంది. అస్థిరమైన మనసు ఎన్నో అనర్థాలకు యింధనంగా పనిచేస్తుంద.

నా మనసు అస్థిరత్వం మూలంగా కొన్నాల్టికి వారిని వివాహం చేసుకోనటం పొరబాటే ననిపించింది నాకు. రోజు రోజుకు ఆ అభిప్రాయం నాలో ద్విగుణీకృతమై ఎందుకో వారిమీద ఎనలేని అసహ్యాం, జుగుప్స కలిగాయి. హృదయం విప్పి వారితో మాట్లాడేదానిని కాదు. నా మనసులో వున్న విషయాన్ని గ్రహించడానికి ఎన్నో విధాలుగా ప్రయత్నం చేశారు వారు.

కాని ఎంత వేగంగా వారికి నా హృదయంలో స్థానం యిచ్చానో అంత తొందరగా వారిని నా హృదయం నుండి స్థానభ్రష్టుల్ని చేశాను. దానితో వారంటే మా యింట్లో వాళ్ళకు కూడా ఒక విధమైన అయిష్టత కూడా జనించింది. నాకు తగు ప్రోత్సాహం లభించింది.

పర్యవసానం... ఆయనకు విడాకు లిచ్చేశాను.

మనుష్యులు ఒకొక్కప్పుడు వెనకా ముందూ చూడకుండా ఎటువంటి తప్పటడుగు వేస్తారో, ఎలా బు... లేకుండా ప్రవర్తిస్తారో అదంతా తరువాత అనుభవంలో... వచ్చింది బాబూ! విడాకు లిచ్చిన తరువాత కోర్టువారు నా ముద్దుల బాబును నాకు కాకుండా ఆయనపరం చేశారు.

విడాకులు నా యిష్టంతోనే చేసినా, ఒక్క పిల్లాడినీ నాకు దూరం చేసినందుకు నా మనసు క్షోభించింది.

విడాకులిచ్చేసిన తరువాత ఎందుకోసరం యింత తెగింపు చేసి జీవిత సర్వస్వాన్నీ పతనం చేసుకొని చుక్కానిలేని నావ చందంగా చేసుకొన్నానో ఎంత ఆలోచించినా నాకు పాలు పోలేదు. నిండు వందపళ్లు ఘటిష్ఠంగా ఉండనలసిన అనురాగ పూరిత జీవన బంధం నాలోని బలహీనతవల్ల తెగిపోయింది.

తరువాత నేను పుట్టింటికి వెళ్ళిపోయాను. ఎప్పుడూ మనస్సుకు ఏదో వెలితిగాతోస్తున్నా, కొన్నాళ్ళు మాత్రం ప్రశాంతంగా గడిచిపోయినై బాబూ! మానవుల మనస్సులు దారుఢ్యం కలిగిన వైనట్లయితే అసలు వడుదుడుకులు రాక పోను. కాలంకూడా మనుష్యుల మనస్సుల్లో క్రమేపీ మార్పు తెస్తుంది. మా అమ్మానాన్న వాళ్ళకుకూడ నేనంటే అసహ్యం ఏర్పడింది.

వారి ఏవగింపులు అలా ఉంచి, అమ్మలక్కల సూటి పోటి మాటలు తెగ బాధగా ఉండేవి. అందరూ యిష్టం వచ్చినట్లు మొహానసే భయంలేకుండా అనేసేవారు. కుర్ర కారు రౌడీలు సరేసరి. నీచాతినీచంగా, అసహ్యంగా కూసేవారు.

కళలకు, లతలకు, అతివలకు ఆధారాలు లేకపోతే రాణించరనేది నా విషయంలో ఋజువైంది. స్త్రీకి పతి సాహచర్యంతో ఉంటేనే గౌరవం యినుమడిస్తుంది. పతిని కాదన్న స్త్రీకి సమాజంలో స్థానంలేదు. తరువాత బాగా తెలిసొచ్చిందీ సంగతి నాకు. నిలకడలేని నా చంచలమైన మనస్సుకు చేసినదంతా తప్పని, జీవితాన్ని చేతులారా నరకం చేసుకొన్నాననీ తట్టింది. హృదయ పూర్వకంగా క్షోభించింది నా హృదయం. తొందరపడి తప్పటడుగు వేసిన స్త్రీకి శేష జీవితం కంటకమయం, దుఃఖ భాజకంకాక మరొకటి కాదు. యింట్లో విలువ, బయట విలువకూడా రోజురోజుకు క్షీణించిపోతుంటే, ఎక్కడయినా చేయగలిగిన చిన్న ఉద్యోగం దొరుకుతుందేమోనని ప్రయత్నం చేశాను. ఒక చిన్న ఫర్మ్‌లో ఉద్యోగం దొరికింది.

ఒంటరిగా యౌవనంలో యువతికి క్రుళ్ళు సమాజంలో ఎలాంటి విలువ ఉందో అలాంటి విలువయిచ్చే నాకు నౌకరీ యిచ్చారని తర్వాత తెలిసింది. ఫర్మ్ మ్యానేజర్ నీచబుద్ధిని ముందే గ్రహించగలిగి, ఎలాగో అలా అచ్చటినుండి అతి చాకచక్యంగా తప్పించుకో గలిగాను. అంతటితో ఆ రోజు నుండీ ఉద్యోగానికి స్వస్తివచనాలు పలికేసి తిరిగి, నా విధికి తీరిగ్గా ఏడుస్తూ కూర్చున్నాను.

నాకు ముందుచూపు లేకుండా క్షణిక్రోద్రేకంలో చేసిన తప్పిదుపని, నా జీవితాన్ని ఎంత విపత్కర పరిస్థితిలోకి లాకొచ్చిందో తలచుకొంటే గుండె లవిసిపోయేవి.

తరువాత కొన్నాళ్ళకి నాకు కలిగిన పరిస్థితి నెదురించ లేక ఒక అర్ధరాత్రికి రాత్రి యింట్లో ఎవ్వరికీ చెప్పకుండా దూరంగా వెళ్ళిపోయాను. ఆ పోవడం పోవడం ఎన్నో చోట్ల బికారిణిగా తిరిగాను.

చేజేతులా చేసుకొన్న నా భవిష్యత్తుకు తనివితీరా ఏడవడం తప్ప మరొకదారి లేనేలేదని తేల్చేసింది లోకం. సంవత్సరాల తరబడి పోగొట్టుకొన్న భవిష్యత్తు వెతుక్కొంటూ, యిక యీ జీవితానికి భవిష్యత్తులేదని తెలుసుకోగలిగేటప్పటికి ఈ వయసొచ్చేసింది. శరీరంలో జవసత్వాలు నశించిపోయినై. అక్కడక్కడా చాకిరీచేస్తూ ఏదో పొట్ట వెళ్ళబోసుకుంటూ ఉంటున్నాను బాబూ! నా జీవిత వృత్తాంతాన్ని వింటుంటే, నీకు నామీద అసహ్యం కలుగుతోందా పాణీ! అయినా తప్పదు. నా మనశ్శాంతి కోసరమైనా చదువు బాబూ! అయిపోవచ్చింది.

తరువాత మీ యింట్లో పనికి కుదిరాను. యిక్కడే నా మనస్సుకు అమితమైన శాంతి లభించింది. నీలో ఎన్నడో దూరమైన నా బాబు పోలికలు చూచుకొంటూ, నా మనస్సును ఊరడించుకొన్నాను. ఈ రెండేళ్లు ఎంతో శాంతియుతంగా గడచిపోయినై. కాని నా పాపానికి పరిహారం చెల్లించేరోజు దగ్గరపడింది నాయనా! యీ ప్రాణం కొన్ని గంటలుతప్ప యిక ఉండదు. నన్ను హృదయ పూర్వకంగా క్షమిస్తానంటే, నేనొకమాట చెప్తా పాణిబాబూ! నిజంగా క్షమిస్తానంటేనే... క్షమార్హురాలిని కాకపోయినా, కనీసం

క్షమించమని ప్రాధేయ పడడానికికూడ యోగ్యతలేకున్నా నీవు క్షమించక తప్పదు.

నేనా రోజుల్లో మనసారా మనసిచ్చి ప్రేమించి పెళ్ళాడి, క్షణికోన్మాదంలో, తెలిసీ తెలియని అపక్వమైన మనస్సుతో దూరంచేసికొని ఎంతో మానసిక తాపానికి గురి చేసిన ఆ అదృష్టహీనుడు మీ నాన్నగారే బాబూ! నీవే నా బాబువి పాణీ!

ఎన్నాళ్ళనుండో నీ కోసరం ఊళ్ళు గాలిస్తున్నాను. నువ్వెక్కడున్నదీ, ఏం చదువుతున్నదీ ఎలాగో కష్టపడి సమాచారాన్ని సేకరించేదాన్ని. చివరికి నువ్విక్కడ ఉద్యోగం చేస్తున్నావని తెలిసి వచ్చాను బాబూ! ఈ అభాగ్యురాలిని మనసారా క్షమించి, నా కర్మకాండలు జరిపిస్తే నేనెంతో సంతోషిస్తాను. నా మనశ్శాంతి కోసరమైనా తప్పకుండా ఒప్పుకో నాయనా!

నిజానిజాలు నీకు తెలియజేసి నా మానసిక క్షోభ నుపశమింప చేసుకోడానికే యింత పెద్ద ఉత్తరం వ్రాయాల్సి వచ్చింది.

మీ నాన్నగారికి ఈపాపాత్మురాలి హృదయపూర్వక నమస్కృతులు. మనసారా క్షమాపణలు వేడుకొన్నానని చెప్పు. ఇప్పుడు నా మనసెంతో హాయిగా వుంది ప్రశాంతంగా. ఇక రాయలేను బాబూ. ఉంటా ఎల్లప్పటికిదూరంగా.

నీకు, సుగుణకు దీవెనలతో,

నీ

అభాగ్యురాలయిన అమ్మ."

పాణికి అయోమయంగా తోచింది. తన జీవితానికి వెనుక యింత గాధవుందని యింతవరకూ తెలియదు. నాన్న నిజం దాచారు.

తల్లి శవం నిర్జీవంగా, పేలవంగా మిగిలింది. దుఃఖంతో పాణి "అమ్మా" అని ఏడుస్తూ అరవడం మాత్రం ఆమెకు వినబడలేదు. సుగుణ భయంగా చూస్తూ స్తంభించిపోయింది నిలుచున్న చోటనే.

ఎన్నడో విడిపోయిన మాతృ బంధం అదృష్టవశాత్తూ తిరిగి దరిజేరింది. కాని మరుగైపోయిన ఆ అనుబంధపు నిజానిజాలు తెల్సుకొనే వేల్టకి ఆమె జీవనగాధలోని నిజానిజాలు తప్ప మిగిలిందేమీ లేకుండా పోయింది.



# రహస్యం

రేరాజు రాకకు సిగ్గుపడి నిశా కన్య నల్లని ముసుగు వేసుకొన్నది. వేణు హృదయం కొద్ది నిమిషాల క్రితం తెలిసిన దుస్తహమైన వార్తమూలంగా తల్లడిల్లిపోతున్నది.

పడక కుర్చీలో కూర్చుని కిటికీగుండా అనంతాకాశంలోకి తదేకంగా వీక్షిస్తున్నాడు. వేణుచేతిలో వుత్తరం రెపరెపలాడుతున్నది. ప్రక్కనే యింకొక కుర్చీలో విచారంగా, దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నది రజని. ఇద్దరి మధ్య నిశ్శబ్దత తాండవిస్తోంది.

"ప్రసాదన్నయ్య పోయాడంటే నాకు అబద్ధ మనిపిస్తోందండి" అతని లీనతను ఛేదించింది రజని.

"కాని నిజంగానే పోయాడు రజనీ!" అతని కను కొలకుల్లో వెచ్చటి కన్నీరు నిలచింది. గద్గద స్వరంతోనూ, ఉద్వేగంతోనూ, మిత్రుని మరణపు తలపుల విచారంతోనూ పిచ్చిగా అంటూ కళ్ళు మూసుకున్నాడు వేణు.

ప్రసాద్ రెండు నెలల క్రితం శెలవుపెట్టి బెజవాడ వెళ్ళాడు. ఎందుకో అక్కడున్నాన్నాళ్లూ ఏదో ఆలోచిస్తూ విచారంగా గడిపేవాడట. అదే కొన్నాళ్ళకి ఏదో తెలియని జబ్బులోకి దింపిందట. మూడు రోజుల క్రితం అకస్మాత్తుగా పోయాడుట. ఇదీ ఉత్తరంలోని సారాంశం.

పున్నమి చంద్రుని అమృత కిరణాల కాంతులు కిటికీ ద్వారా వేణు, రజనీల మీద పడుతున్నాయి. దూరంగా విశాల విశ్వంలో ఒకతార కాంతివంతంగా ప్రకాశిస్తోంది. 'బహుశా ప్రసాదే ఆ తారగా మారిపోయాడేమో' అనుకొన్నాడు. వేణు.

అంత వేదనలోనూ ఆ చల్లని జ్యోత్స్నా వాహిని తాకిడికి ప్రసాద్ తమతో గడిపిన గత జీవితపు టధ్యాయపు తాలూకు పుటలు తిరగవేయ నారంభించాడు వేణు.

ప్రసాద్ హైదరాబాద్ రేడియో స్టేషనులో అనౌన్సరు. వేణు, ప్రసాద్ చిన్నప్పటినుంచి ప్రాణస్నేహితులు. ఒక కంచంలో తిని, ఒక మంచంలో పడుకోక పోయినా చిన్నతనంనుండీ స్కూల్లో ఒకే క్లాసులో ఒకే బెంచీ మీద కూర్చున్నారు. ఇద్దరూ హైదరాబాదులోనే ఎం. ఏ పూర్తి చేశారు. చిన్నప్పటినుండి వేణుకు సంగీతం మీద ఎక్కువ ఇష్టం ఉండేది. సంగీతం మీద ఆసక్తి మూలంగా ఎంతో కష్టపడి సితార్ వాద్య విద్వాంసు డనిపించుకొన్నాడు. ప్రసాద్‌కు రేడియో స్టేషన్‌లో ఎనౌన్సరుగా ఉద్యోగం లభించింది. తనకూ ప్రయత్నం చేస్తే ఎక్కడో అక్కడ ఉద్యోగం దొరక్కపోయేది కాదు. అందుకు తగ్గ చదువూ సంస్కారం ఉన్నాయ్ తన దగ్గర. కాని డిగ్రీల మీద ఉద్యోగాల మీద ఆసక్తి లేదతనికి. అతను ఎం. ఏ. చదివాడంటే కేవలం జ్ఞాన సంపాదనకోసం మాత్రమే. ఎలాగయినా తన జీవిత సర్వస్వాన్నీ కళామతల్లికి అంకితం చెయ్యాలి. అదే తన జీవిత లక్ష్యం అనుకొన్నాడు వేణు. దానికి తగ్గట్టే ఎన్నో కచేరీ

లలో పాల్గొన్నాడు వేణు. తనకు వచ్చిన ప్రావీణ్యాన్నంతా కనబరచి వేలకువేల సదస్సులను తన మృదుమధుర సంగీత ఝరిలో నోలలాడించాడు. అందువలనను వేణుకు కూడ అదే రేడియో స్టేషన్‌లో ఎన్నో ప్రోగ్రాములు లభించినయ్.

ప్రసాద్ కూడ కళా పిపాసకుడే కాని అతను దేన్లోనూ పూర్తిగా నిమగ్నుడు కాలేకపోయాడు. ఏ వాయిద్యాన్నీ పట్టుదలతో అభ్యసించలేకపోయాడు. దేనిలోనూ పూర్తిగా మనసును కేంద్రీకరించ లేకపోయాడు. కాని తన ప్రాణ మిత్రుడైన వేణును ఎన్నో రకాలుగా ప్రోత్సహించేవాడు. వేణు అలా సితార్ తీగలు మీటుతూ స్వరకంపనం కలుగ జేస్తుంటే, ఎదురుగ్గా కూర్చుని, కళ్లు మూసుకొని ఏవేవో మధుర లోకాల్లో విహరిస్తూ ఆనందడోలికల్లో వూగిపోయే వాడు ప్రసాద్.

తీరికవేళల్లో ప్రసాద్‌కు డ్యూటీ లేనప్పుడు, వేణుకు ఏమీ ప్రోగ్రాములు లేనప్పుడు యిద్దరూ కలిసి, సాయం సమయాల్లో ఏ టాంక్ బంగ్ మీాదికో, పబ్లిక్ గార్డెన్సులోకో వెళ్ళేవారు షికారుకు.

ట్యాంక్ బండ్ మీాది సిమెంట్ బెంచీలమీాదకూర్చుని చల్లని వెన్నెట్లో, ఎలక్ట్రిక్ లైట్ల కాంతిలో ఆ హుస్సేన్ సాగర్ నీటిలో ప్రతిబింబించే ఆనందదాయకమైన సుందర దృశ్యాలను తనివితీరా చూచి ఆనందించేవారు. పబ్లిక్ గార్డెన్సులో, సురభి శీతలమైన గాలిలో ప్రకృతి రమణీయతను తనివితీరా ఆస్వాదిస్తూ ఎన్నోవిషయాలు మాట్లాడుకొనేవారు.

అలాగే ఒకరోజు యిద్దరూ ట్యాంక్ బండ్ మీదికి షికారుకెళ్ళారు మామూలుగా. మాటా మాటల్లో ప్రసాద్ అన్నాడు, 'ఒరేయ్ వేణూ! రేపు మనం స్టేషను కెళ్ళాలిరా బెజవాడనుండి ఒకామె వస్తున్నారు. ఆమెను రిసీవ్ చేసికోవాలి.'

"ఓ యస్! తప్పకుండా... ఎవరురా ఆమె?"

"ఆమె పేరు రజని"రా. చక్కగా పాడుతుంది. చక్కగా పాడడమేమిటిలే, సంగీత విదుషీమణి అనుకోరాదూ! పాపం ఆమెకు మొన్నటివరకూ ఒక ముసలితండ్రి ఉండేవాడు ఆయనతప్ప యింకెవ్వరూ ఆమెకు కావలసినవాళ్ళు లేరురా! ఆయనకాస్తా నెలరోజులక్రితం దాటిపోయాడు. పాపం! బెజవాడలో మా యింటిప్రక్కనే ఉంటారురా. ఎలాగో చక్కగా పాడగలుగును కదా, రేడియో ప్రోగ్రాము యిప్పిద్దామని. యిటు వారిచ్చే డబ్బుతో జీవితంకూడ గడుస్తుంది. మా యింట్లోవాళ్ళు ఉత్తరం వ్రాశారు. 'సరే పంపండి చూద్దాం' అని జవాబు వ్రాశాను. మధ్యాహ్నం టెలిగ్రాం వచ్చింది. ఆమె బయలుదేరి వస్తున్నట్లు. రేపు సాయంత్రం బండికి వస్తుందామె. తప్పకుండా వస్తావుకదూ!"

"ఒకసారి వస్తానన్న తరువాత యింకా ఏమిట్రా... భలేగా పాటలు పాడుతుందనికూడ అంటున్నావ్. ఆర్టిస్టు ఆర్టిస్టను పరిచయం చేసుకోపోతే ఎలా!"

ఆ రోజు రాత్రి పదిగంటలవరకూ ఏదో పిచ్చాపాటీ మాట్లాడు కొంటూ గడిపారు. మరునాడు యిద్దరూ స్టేషను కెళ్ళారు.

వాళ్ళు వెళ్ళిన కొద్దిసేపటికే బండి వచ్చింది.

ప్రసాద్ ఒకసారి అంతకుముందు చూసినవాడవడం మూలంగా 'రజనీ'ని తొందరగానే గుర్తుపట్టగలిగాడు. క్రొత్త ఊరు...క్రొత్త జనం...అంతా క్రొత్తక్రొత్తగా కనుపించడంతో రజని బిక్కు-బిక్కుమంటూ అటూయిటూ దిక్కులు చూస్తోంది.

"ఏమండోయ్ రజనీగారూ! యిటు ఉన్నాము రండీ" అంటూ వేణు, ప్రసాద్ ఆమెదగ్గర కెళ్ళారు.

ఆమె మనస్సు కుదుటబడ్డది. 'నమస్కారమండీ' అన్నది ప్రసాద్ నుద్దేశించి.

"మీ టెలిగ్రాంఅందిందిలెండి వచ్చేశాం. నన్నయితే ఎరుగుదురుగాని, మరి వీడు మీకు తెలియదుగా. వీడిది మన ఊరేలెండి పేరు వేణు చిన్నప్పటినుండి స్నేహితులం. సితార్ విద్వాంసుడు. మీలాగే కాళాపిపాసకుడు. ఒక రకంగా వాడి హృదయంనిండా 'కళ' నిండిపోయి ఉన్నదనుకోండి! ఇక మీ సంగతంటారా; నిన్ననే చెప్పేసేశాను వీడికి" అన్నాడు ప్రసాద్.

"నమస్కారమండీ. మీతో పరిచయం కలగడం చాల సంతోషం" అన్నది రజని. ప్రతి నమస్కారం చేశాడు వేణు. చిరునవ్వు నవ్వుతూ ముగ్గురూ యింటికి బయలుదేరారు. ఆమె తెచ్చుకొన్న పెట్టె, బెడ్డింగూ కూలివాడికిచ్చి.

వారం రోజుల్లో స్టేషన్ డైరెక్టర్‌తో మాట్లాడి, రజనీకి ప్రోగ్రాం యిప్పించాడు ప్రసాద్.

ఆరోజు ఆదివారం. రాత్రి ఎనిమిది గంటలకు రజని మధురగాయని రజనిగా దేశంలోని శ్రోతలందరికీ పరిచయం చేయబడింది రేడియోద్వారా.

ఆమె మృదు మధురస్వరం వేణును పరవశుడిని చేసింది. 'ఆమె సంగీత విదుషీమణిరా' అని ఆరోజు రాత్రి ప్రసాద్ అన్న మాటల్లో ఏమీ అతిశయోక్తి లేదనిపించింది. వేణుకు నిజంగా ఆమె కంఠం కోకిల కంఠం.

ఎప్పుడు ప్రోగ్రాం పూర్తవుతుందా అని యిద్దరూ కాచుకూర్చున్నారు బయట. ప్రోగ్రాం పూర్తయింది. దేశంలోని సంగీతప్రియుల్ని అందర్నీ తన మధురగాన రసమంజరిలో ఓలలాడించి, రజని బయటకు వచ్చింది.

"అద్భుతంగా పాడారు సుమండీ! మొదటిసారైనా బ్రహ్మాండంగా ఉందంటే నమ్మండి! యిందాకటినుండీ ఒకటే పొగుడుతున్నాడు మావాడు మిమ్మల్ని" అన్నాడు ప్రసాద్.

"ఎందుకు చెప్పండి పొగడ్తలు? నాకు భలే భయం వేసిందనుకోండి మొదటిసారి గదూ! ఒకటే బెదురూ."

"ఎబ్బే! పొగడ్తలు కానేకాదండి. నిజంగా మీ కంఠంలో నాదబ్రహ్మలు యిమిడి వున్నారు. మీరు నమ్మాలి చాలా బాగా పాడారు రజనీ! కంగ్రాచ్యులేషన్స్!" అన్నాడు వేణు చొరవతీసుకొని.

"థ్యాంక్స్. వెళ్దాం పదండి" అన్నది రజనీ వేణు, ప్రసాద్‌ల వైపు చూస్తూ దరహాసంతో.

దాన్లో రజని అన్నది: "మరి నా పాట విన్నారు. తెగ పొగిడారు. కాని మీ సితార్ మాత్రం ఒక్కసారి వాయించి వినిపించలేదు కదా! ఆ భాగ్యం నాకెప్పుడు కలుగుతుందో!"

"వచ్చేవారం సంగీత సమ్మేళనం ఒకటివున్నది రజనీ! అందులో మెయిన్ ప్రోగ్రాం మన వేణుదే. అప్పుడు చూద్దురుగానీగా మావాడి తఢాకా. అప్పటివరకు కాస్త ఓపిక పట్టండి" అన్నాడు ప్రసాద్.

"ఆఁ అంత బాగా రాదులెండి. ఊరికే వాడికేమీ ఊసుపోక అలా అంటూ వుంటాడు. అంత వినాలని ఉంటే విందురు గానీండీ! మావాడి మాటలువిని వుద్విఘ్నారి ఏవేవో బాగా వాయిస్తారనుకొని – ఆశలు మాత్రం పెట్టుకోకండి. తర్వాత నిరాశయితే బాధ" అన్నాడు వేణు నవ్వుతూ.

"ఒరేయ్! ఏం బుద్ధిరా నీది. నిజం చెప్పినా చెప్ప నివ్వవూ," అని, "వాడలాగే అంటాడు రజనీ. రేడియోలో కూడా చాలసార్లు ప్రోగ్రాము లిచ్చాడు. ఎన్నో సభల్లో పాల్గొన్నాడు అయినా ఎప్పుడూ యింతే వీడు. చూద్దువు గానీగా వారంరోజులు ఓపికపట్టండి" అన్నాడు ప్రసాద్ రజని వైపు తిరిగి.

ఆరోజు రానే వచ్చింది. పబ్లిక్ హాలులో ప్రోగ్రాం అరేంజి చేయబడింది. సభ అంతా నానావిధ జన సమ్మేళనంతో కిటకిటలాడుతోంది. అంతకు ముందు ఎన్నిసార్లువిన్నా వేణు – సితార్ నాదంలో ఏదో మధురిమ; నూతనత్వం ఉండడంతో శ్రోతలందరూ ఎప్పుడు తీగమీటుతాడా అని

తహ తహలాడి పోతున్నారు. ముందువరసలో రజనీ, ప్రసాద్ కూర్చున్నారు. రజని అందరికన్నా ఆతురత కనబరుస్తున్నది.

మొదట ప్రార్థనా గీతిక పాడింది. తెర తీశారు-వేణును మామూలుగా సభికులందరికీ పరిచయంచేసి, సుగంధ సుమమా లాలంకృతుడిని చేశారు. సభికులందరికీ శిరస్సువంచి నమస్కరించి, వేణు తన స్థానంలో వాయిద్యంముందు ఆశీనుడైనాడు.

వేణు సితార్ తీగల్ని మీటాడు. రజనికి తన హృదయ తంత్రుల్ని మీటినట్లనిపించింది.

సభ 'జైజవంతి' రాగాలాపనతో ప్రారంభమైంది. రజని హృదయం పరవళ్ళు త్రొక్కింది. అతను మీటిన ప్రతి మీటు సదస్సులను రాగరస మంజలిలో ఓలలాడించిది. 'ఝులా'గీత గానంలో తబ్లా, సితార్ సృష్టించిన నాధ ప్రపంచం, గమకయమకాలు, శ్రోతలను ముగ్ధులను చేశాయి. 'పహాడీధున్' మధ్య మధ్య తోడి రాగచ్ఛాయలతో రక్తి కట్టింది. రజని ఏవేవో ఊహాలోకాల్లో విహరించింది. ఆమె మనస్సు అతని సంగీత సారములో పూర్తిగా లీనమైపోయింది. ఆరోజు అతని సంగీత పాటవం అందర్నీ తన్మయుల్ని చేసింది. సభ అయిపోయింది.

"నిజంగా ప్రసాద్‌గారే నిజం చెప్పారండీ! చాలా బాగా వాయించారు. మీకు నా హృదయపూర్వక అభివంద నాలు" అన్నది రజని చిరునవ్వు నవ్వుతూ.

"థ్యాంక్స్ రజనీగారూ! ఏదో వాయించాను అను కోండి" అంటూ ప్రసాద్ వైపు తిరిగి 'ఏరా ప్రసాద్! అయినా

నా సితార్‌కంటే రజనీగారి గానమే బాగుందిరా' అన్నాడు వేణు.

"పోరా. ఒకళ్ళు చెబితే నీ కర్థంకాదు. నీ గొడవ నీదే. నీ సితార్ సితారే... దానికీ, దీనికీ ముడిపెడ్తావేరా? దేనికదే సాటిలే. యివాళ చాల అమోఘంగా ఉందిరా నీ కచ్చేరీ! యింతకుముందు ఎన్నడూ యిలా రక్తి కట్టలేదురా" అన్నాడు ప్రసాద్.

కొన్నాళ్ళు గడచినై. రజనీ, వేణు, ప్రసాద్‌ల కిద్దరికీ బహు సన్నిహితంగా అయింది. ఎప్పుడూ వేణు సితార్ ప్రావిణ్యాన్ని తెగ పొగిడేది రజని.

రోజులు గడచిన కొద్దీ రజనికి వేణుపైన అవ్యాఖ్యమైన అనురాగం జనించింది. రజని సంగీత విదుషీమణి. వేణు, సితార్ విద్వాంసుడు. యిద్దరిలోనూ కళామతల్లి స్థావరం ఏర్పరచుకొన్నది. యిద్దరి హృదయాలు మృదుమధుర సంగీత ఝురీ నిలయాలు.

కళాకారుడు – కళాకారుని అభినందించడం సహజం. కళా హృదయం మరి ఒక కళా హృదయంవైపు మొగ్గడం సహజం. రజని వేణువైపు మొగ్గింది. ఆమె అతన్ని ప్రేమించింది. వేణు కళామతల్లితోబాటు, రజనికికూడ మన స్ఫూర్తిగా తన హృదయాన్ని అర్పించేశాడు.

మరి కొన్నిరోజుల్ని కాలం వెనక్కి తరిమివేసింది.

ఒకరోజు ప్రసాద్ యింటిపనిమీద వారం రోజులు శెలవుపెట్టి, బెజవాడ వెళ్ళాడు.

ఆరోజు సాయంత్రం వేణు, రజనీ మళ్ళీ పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్ళారు. నిర్మానుష్యంగా ఉన్నచోట పచ్చిక మీద కూర్చున్నారిద్దరూ. ఏవేవో తమ ప్రోగ్రాముల గురించీ, యింకెన్నో విషయాల గురించీ, పిచ్చాపాటీ మాట్లాడుకొన్నారు.

బాగా రాత్రి అయింది. చల్లని వెన్నెల. చిక్కని పిల్లతిమ్మెర. తెల్లని మేఘాల వెనుక ప్రకాశిస్తున్న పూర్ణ చంద్రుడు. శాంతసుందరమైన నిస్తబ్ధత.

"రజనీ! నిన్నొకటి అడుగుతా, కోప్పడవుగా!" నిశ్శబ్దాన్ని ఛేదించాడు వేణు.

"అంతకన్నానా? అడగండి! అయ్యో! కోపంకూడానా ఎందుకూ?" కిలాకిలమని నవ్వింది రజని.

చంద్రుడు సిగ్గుపడి మేఘాలచాటున దాక్కున్నాడు.

"ఈ అమృతమూర్తి, సంగీత విదుషీమణి. రజనికి తాళిగట్టి, నా జీవితాన్ని పారిజాతంలా పరిమళింప చేసుకోవాలనిఉంది. ఏమంటావ్ రజనీ" అన్నాడు చేతిలో చేయి వేస్తూ.

రజని మేను పులకరించింది–ఆమె హృదయం సంతోషంతో పొంగి పొరలింది. "నేను చాలా అదృష్టవంతురాల్ని వేణూ!' అన్నది రజని చెంగుతో ఆనందభావాల్ని తుడుచుకొంటూ.

"మరెప్పుడు ముహూర్తం?"

"విద్వాంసులుగారి యిష్టం, నాదేముంది?" ఆమె కిల కిలా రావం కోకిల కూజితాన్ని మరపింపజేసింది.

"మరి యింకో కోరిక!" అన్నాడు వేణు రజనివైపు కొంటెగాచూస్తూ.

"తడవకొక్క కోరికే తీరిస్తుంది-దేవత!"

"మంచి భక్తులకు ఎన్నైనా వరాలిస్తుంది దేవత. మరినేను మంచి భక్తుడినేగా!"

"ఏమిటో ఆ కోరిక?"

"ఈ ప్రశాంత వాతావరణంలో, ఈ ఆహ్లాదకరమైన ప్రకృతిలో నీ మధుర గళంనుండి త్యాగరాజ కృతి ఒక్కటి వినిపించు చాలు!"

"భలే చక్కని కోరికేనే!"

"ఎలాంటి దైనాగాని, 'రామ నీ సమానమెవరూ- రఘువంశోద్ధారక!' పాడు-అదంటే చాల యిష్టం నాకు."

"అబ్బ! యిక్కడ పాటేమిటండీ... అందరూ వింటారు బాబూ!"

"ఫరవాలా, పాడు... పోనీ, వేణు నీ సమానమెవరూ అని మార్చిపాడు."

"అయ్యయ్యో. త్యాగరాజుల వారికి అపచారం జరుగుతుంది బాబూ!"

"అయితే మొదలకుండా అదే పాడేసెయ్. ప్రొద్దుపోయింది వెళ్ళిపోదాం!"

రజని త్యాగరాజ కృతి మెల్లగా పాడింది

"మరి నా హృదయం ఘూర్ణిల్లుతోన్నది రజనీ!" అన్నాడు పాట పూర్తికాగానే వేణు.

"నా హృదయం కూడా ఆనందంతో పరవళ్ళు త్రొక్కు తోంది వేణూ!"

"పద యింటికి పోదాం ప్రొద్దుపోయింది" అన్నాడు వేణు. ఇద్దరు బయలుదేరారు.

వారి హృదయాలు ప్రణయంతో నిండిన మధు పాత్రలు.

కొన్నాళ్ళకి పెద్దవాళ్ళతో సంప్రతించి వివాహ ముహూర్తం పెట్టించారు.

వేణు రజనీల వివాహం జరిగిపోయింది. ప్రసాద్ సంతో షించాడు-పెళ్ళయిం తరువాత తిరిగి హైద్రాబాదు వచ్చే శారు. యథాప్రకారంగా రోజులు దొర్లిపోతున్నై.

ప్రణయ ప్రబోధితములైన వారిద్దరి హృదయాలు ఒక చోట కూడినై. వారిద్దరూ పరస్పరం దేహాలు మరచి, ఒక ఆత్మయై, ఒక హృదయమై నిర్వృతిలో లయించారు.

యిటు, ప్రసాదు యిప్పుడు వీరితో ఎక్కువ కలవడం లేదు-పెళ్ళి అయిందని సంకోచిస్తూండవచ్చు.

తరువాత కొన్నాళ్ళకి ప్రసాదు శెలవుబెట్టి బెజవాడ వెళ్ళాడు-తరువాత కొద్దిరోజులకే ఈ హటాన్మరణ వార్త. ఏమిటో? అంతా అగమ్యగోచరంగా ఉంది.

గతంలోంచి తిరిగి వర్తమానంలోకి వచ్చిపడ్డాడు వేణు.

ఎదురుగా అలాగే రజని విచారంతో ఆలోచిస్తూ కూర్చుని ఉంది.

"అన్నయ్య రూముకూడ ఖాళీచెయ్యలేదు కదండీ. సామానదీ, వాళ్ళకు పంపెయ్యొద్దూ? నిస్తబ్దతను భేదించింది రజని.

రేపు వెళ్ళివస్తాను రజనీ అయినా, మనిషిపోయిన తరువాత, ఇంకా సామాను ఏమిట్లే? అన్నాడు బాధగా.

ఆ రాత్రంతా ఏవేవో ఆలోచనలలో, బరువెక్కిన హృదయాలతో గడిపారిద్దరూ నిద్రలేకుండా.

మరునాడు వేణు ప్రసాదు ఉంటున్న గదికి వెళ్లాడు.

ఇంటివాళ్ళకు అద్దె ఎంత ఇవ్వాల్సివుందో లెక్కచూచి యిచ్చివేశాడు. తాళం పగులగొట్టి, గదిలో కెళ్లాడు వేణు. సామానేమీ పెద్దగాలేదు. బ్రహ్మచారి-అందులో హోటలు భోజనం-ఉన్న కొద్దిసామాను పెట్టెలో సర్ది వేశాడు. అలమార్లో ఏవో వస్తువులు తీస్తుంటే క్రింద అరలో ఒక డైరీ కను పించింది. ఏదో మామూలుగా పేజీలు తిరగవేస్తూ, ఒకచోట హటాత్తుగా సంభ్రమాశ్చర్యాలతో ఆగిపోయాడు.

అందులో ఒక తారీఖు క్రింద యిలా వ్రాసి ఉంది:

"రజనీని వివాహం చేసుకోవాలని కోరికగా ఉంది. ఆమాట అడుగుతే ఏమనుకొంటుందో ఏమో! ఉద్యోగం యిప్పించి ఒకదారి చూపించినందు కిది ప్రతిఫలంగా అడుగు తున్నా ననుకోదూ!"

యింకో పేజీలో-"ఎందుకో రజనీని చూస్తుంటే-ఆమె నా జీవిత భాగస్వామిని ఐతే నా జీవితం వెన్నెల మయమవు తుందనిపిస్తోంది. కాని నా మనస్సు అది సున్నితంగా తయారు

చేశావ్ గదా! హే భగవాన్! అడుగలేకుండా ఉన్నాను"
అని ఉంది.

మరిఒక తారీఖు క్రింద - "మించిపోయింది సమయం. యిద్దరూ సంగీతకారులే - వేణును పెళ్లాడబోతోంది రజని. మంచిదే! అయినా అదృష్టంకూడా ఉండాలి. ఇంకా నయం తొందరపడి అడిగేశాను కాదు! అయినా లోకంలో అందరికీ కోరుకొన్నవి లభిస్తాయా- నా పిచ్చిగానీ. నా వేణుకోసరం ఈ మాత్రం త్యాగం చేయలేనూ!"

ఇంకోచోట - బహుశః బెజవాడ వెళ్ళిపోయే ముందే వ్రాసాడేమో——

"ఎందుకో నా మనస్సేం బాగోడంలేదు-రజనీ వివాహ మయినప్పటినుండీ నా మనస్సులో ఉత్సాహం నశించింది. ఎందుకో ఈ బాధ. మిత్రుడు ఆనందిస్తూంటే చూసి సంతో పించలేకుండా ఉన్నాడు. ఇక రజనీ-వేణూల ఎదురుగా ఉండ లేను. సెలవుపెట్టి యింటికి వెళ్ళిపోతాను. కనీసం ఈ సంగతి కూడ వాళ్ళకు తెలియకూడదు. ఈ రహస్యం తెలిస్తే వారి ప్రశాంతమైన మనస్సులు కల్లోలిత మౌతాయ్. రేపే వెళ్ళి పోవాలి. ఇక త్యాగం చెయ్యక తప్పదు. వేణూ, రజనీల దాంపత్య జీవితం సుఖప్రదంగాఉండి కలకాలం వర్ధిల్లేటట్లు చెయ్యి! హే! భగవాన్! ఇక నాకు మనశ్శాంతిలేదు.

వేణు అదిరి పోయాడు అంతా చదివి. 'త్యాగం రహస్యం' అంటూ పిచ్చి పిచ్చిగా గొణుక్కొన్నాడు. "ప్రసాద్! త్యాగం పేరుతో జీవితాన్ని నాశనం చేసుకొన్నా వురా!" అంటూ కుప్పగా కూలిపోయాడు వేణు.

# అమ్మ పిలుస్తోంది!

చెల్లీ అరుణా దేవీ!

చిరంజీవిగా వర్ధిల్లు తల్లీ! ఆశీస్సులు తప్ప యింకేమీ యివ్వలేని అభాగ్యుడయిన అన్నయ్యను కదూ! నేను నిజంగా నిర్భాగ్యుణ్ణే చెల్లాయ్! అనురాగ వాత్సల్యాలకు మారు పేరైన నా చెల్లాయినుండి దూరంగా ఎక్కడికో కనుమరుగై పోతున్న నేను అభాగ్యుణ్ణి కాక అదృష్టవంతుణ్ణి ఎలా అవుతాను చెల్లీ చెప్పు!

మాతృ మమకారానికి చిన్నప్పుడే దూరమైన నేను, ప్రేమపూరితమైన తియ్యని పలుకులకు, హృదయాంతర్గతమైన బాధను చల్లార్చి సేద తీర్చే మధురాతి మధురమైన సానుభూతి వాక్యాలకు కూడ నోచుకోలేని నికృష్టపు, నిర్జీవపు బ్రతుకును బ్రతకలేక ఇలా ఎక్కడికో వెళ్తూ, నా హృదయంలో ఆరాటం చెలరేగి ఉవ్వెత్తున లేస్తుంటే ఇలా వచ్చేసే ముందు కనీసం ఒక్క మాటమాత్రం గూడ నాచెల్లాయ్‌తో చెప్పకుండా వచ్చేసానే - అనే బాధ నా నరనరాల్లో స్పందిస్తూంటే, మోడుబారి, జీవచ్ఛవంలా తయారైన నేను, మానసిక క్షోభా బడబాగ్ని కీలల్లో దహించుకుపోతూ అవ్యక్త వేదనాందోళనలతో నా చిట్టి చెల్లాయి కీ ఉత్తరం వ్రాస్తున్నాను. తెలుసుకో చెల్లాయ్!

. నా హృదయ క్షోభను యిలా వ్రాసి నీ మనస్సుకు తీరని బాధను కలుగజేస్తున్నానని నీ ప్రశాంతతకు భంగ

పాటు కలుగజేస్తున్నానని తెలుసు చెల్లీ! అయినా నేను నీ అన్నయ్యను. క్షమిస్తావు గదూ! నా అంతర్యంలో పవిత్రమైన సహోదరి స్థానాన్ని ఆక్రమించుకొన్న నీకు, నా వేదనాగ్ని జ్వాలల్ని తనివితీరా నీకు చెప్పుకుని నా హృదయ సంద్రపు ఘోషను నీకు అర్థమయేలా చెప్పుకొంటేనేగాని, నీ నుండి సానుభూతిని పొందితేగాని, నా మానసిక గాయానికి ఉపశమనం కలిగేటట్లులేదు చెల్లాయ్. నేను చాల నిర్భాగ్యుణ్ణి అరుణా!

నేను ఈ రాత్రికి రాత్రి, ఎవరికీ తెలియకుండా, నాకు కూడా తెలియని ఏ గమ్యస్థానానికో యిలా వెళ్ళిపోతున్నా నంటే నా జీవితంపై పరిస్థితుల ప్రాబల్యం ఎంత ఉందో అర్థం చేసికొన్నా వనుకుంటాను. చిన్న తనంలోనే మాతృప్రేమను ఎడబాసిన నేను, ఈ క్లిష్టపరిస్థితుల్లో మా అమ్మేగనక వుంటే నా జీవితం యింత అధోగతిపాలు కాకపోయేదని, అనుకొంటు న్నాను చెల్లాయ్!

నా అదృష్టంకొద్దీ నీతో పరిచయ భాగ్యం కల్గింది అరుణా! నీ స్నేహంలో ఏదో తియ్యదనం, నీ మాటల్లో నాకు ఎంతో సానుభూతి, ధైర్యం లభించాయి. నీతో కొద్ది రోజుల స్నేహానికే నీపై నాకు అమితమైన వాత్సల్యం కలిగింది. నా హృదయంలో పవిత్రమైన సహోదరీ స్థానాన్ని ఆక్రమించు కొన్నావు చెల్లాయ్! యింట్లో రక్తసంబంధం ఉండికూడా నా దురదృష్టంపై ఓదార్పు, సహనా భావం లేకుండా నాకు కావలసిన వాళ్ళ సూటీ-పోటీ మాటలతోనూ, లోకులకు సంబంధంలేని, అర్థంలేని ప్రలాపాలతోనూ కృంగిపోయిన నా

హృదయం నీ సామీప్యంలో, నీ మృదు మధుర ప్రసంగాల లాలిత్యంలో, నీ సానుభూతి ధైర్య వాక్యాలల్లో తిరిగి కోలు కొనేది చెల్లాయ్!

అసలీ లోకానికి బుద్ధిలేదు చెల్లాయ్! ఏడ్చే వాళ్ళని యింకా ఏడిపిస్తుందీ లోకం. ఛీ! నిర్భాగ్యుడు, అదృష్ట హీనుడు, అసలే తన విధికి ఆక్రోసిస్తుంటే, వాడికి ధైర్యం చెప్పి నాలుగు ఓదార్పు మాటలు పలికి, వాడికి జీవితంమీద ఆసక్తి కలిగించడంపోయి, వాడిని నీచాతి నీచంగా నిందించి, ప్రపంచానికి దూరంగా తరిమివేసే ఈ లోకానికి హృదయం లేనేలేదు చెల్లాయ్! ఛీ పాడు ప్రపంచం! పాడు మనుష్యులు!

నాలాంటి దౌర్భాగ్యుడు ఈ ప్రపంచంలో యింకె వ్వరూ ఉండరు అని అనుకొంటున్నాను చెల్లాయ్! అనురాగ వాత్సల్యాలను, రక్తసంబధ మమకారాన్ని, తియ్యని సాను భూతి వాక్యాలనుకూడా డబ్బుతో కొనుక్కోవలసిన అగత్యం కలిగిన నాకు, నా దౌర్భాగ్యానికి నేనే లోలోపల కృంగి కృశించి బాధపడుతూ, ఏడవాలో నవ్వాలో కూడా తెలీ కుండా ఉందన్నా!

ఇప్పటికే నే చెప్పదలచుకొన్నది చెప్పకుండా జాగు చేశాను చెల్లాయ్! అసలు విషయంలోకి వస్తాను విను. విని నువ్వు చేయగలిగిందేమీ ఉండకపోయినా కనీసం నీ అన్నయ్య పై రెండు సానుభూతి వాక్యాలు, రెండు కన్నీటి బొట్లు జార విడుస్తువుగాని. మనం అంతకన్న చేయగలిం దేమీ లేదుగా!

నేను మొదటినుండీ అన్నయ్యకు భారంగా తయారవు తున్నాననే బాధతో సతమత మౌతూనే ఉన్నాను అరుణా!

కాని ఏం చేస్తాం? అన్నయ్యా, వదిన తప్ప నాకు కావలసిన వాళ్ళు ఎవ్వరూ లేకపోవడంతో వారిమీదే ఆధారపడక తప్పలేదు నాకు. ఎలాగోఅలా ఆ స్కూల్ఫైనల్ పూర్తిచేసి 'ఉద్యోగం పురుష లక్షణం' అన్న సామెతను సార్థకం చేసి నాలుగు రాళ్ళు సంపాదించుకొని అన్నయ్యకు ఆసరాగా వుందామనే నా వుద్దేశ్యం.

ఇన్ని కష్టాలు చవిచూడాల్సిన నాకు ఆయోగం ఎలా కలుగుతుంది? నా దురదృష్ట మేమోకాని నా శాయశక్తులా కష్టపడీ చదివినా పరీక్షపోయింది అరుణా! నీకు తెలుసుగా! ఆరోజు నువ్వు కూడా నేను బాధపడ్తూంటే 'ఏమిటన్నయ్యా! పరీక్షపోతే అలా బాధపడ్తా వేమిటి? మళ్ళీ వెళ్ళొచ్చులే! ఊరుకో!' అని కూడా అన్నావ్. పరీక్ష తప్పడమే ఒకటే నా బాధకు కారణమయితే బాగానే వుండేది అరుణా!

ఆరోజు పరీక్ష రిజల్ట్సు తెలిసిన రోజున సాయంత్రం ఇంటికి వెళ్ళాను చెల్లాయ్! పరీక్ష తప్పానే అన్నయ్య కష్ట మంతా బూడిదలోపోసిన పన్నీ రయిపోయిందే అనే బాధ నన్ను తెగ వేధిస్తూనే వున్నది నన్ను. ఇంట్లోకి వెళ్ళాను. అన్నయ్య ముందుగదిలో పేపరు చదువుకొంటున్నాడు. ఏమన్నా అంటాడేమోనని నాకు లోలోపల భయం భయం గానే వున్నది. నేను లోపలి కడుగు పెట్టగానే పేపరులో నుండి ముఖం బయటకు తీసి 'పరీక్ష ఏమయిందిరా' అని అడిగాడు. నా పరీక్ష పోయిందని తనకు కూడా తెలుసు. పేపరు చేతిలోనే ఉన్నదిగా.

భయంతోనే 'పోయిందన్నయ్యా' అన్నాను విచారంతో.

"ఆహా! ఎంత ధైర్యంతో చెబుతున్నావురా. చాల సంతోషం...పోయిందీ...సిగ్గులేమూ! నేనూ నానా గక్కితిని సంపాదించి చదివిస్తే సిగ్గులేకుండా 'పోయిందీ' అని రాగాలు తీస్తున్నాడా. ఎందుకు పోవాల్సొంది?"

"నాకు ధైర్యంగానే ఉన్నదన్నయ్యా! ఎలా పోయిందో తెలియడంలేదు."

"ఏం ధైర్యంరా? తప్పుతాననా? నీకే తెలియకు ఎలా తప్పావో? ఆమాట లనడానికి కూడా సిగ్గూ అభిమానం వుండాలి. నాముఖం ముందునుండి లేచిపో. ఊఁ వెళ్ళు."

"హే! భగవాన్! చెప్పినా అర్థంచేసుకోడే అన్నయ్యా. యిదంతా నా ఖర్మ"

"క్షమించన్నయ్యా, మళ్ళీ పరీక్ష యిస్తాను. ఈ సారి తప్పకుండా ప్యాసవుతాను" అన్నాను నేను దుఃఖం వెల్లుబికి వస్తూంటే.

"అహా! యిప్పుడు ఒకసారి యిచ్చి వెలగబెట్టావుగా యింత చక్కగా. యిహ నీ మొహానికింకోడు రెండోసారి కూడానా."

ఇంతలో వదిన వంటింట్లో నుండి వచ్చింది చేతులు తుడుచుకొంటూ. ఆమెకూడా అందుకొన్నది. "ఒక చెంప సిగ్గులేక తప్పి, యింకా పైగా ఏడుపుకూడా ఎందుకంట. నీకేం. రెండుసార్లు కడతావ్ పదిసార్లు కడతావ్ కుప్పలుగా సంపాదించి తెచ్చిపోస్తుంటే!"

మాట మీద మాట హృదయానికి అంపపు కోత. ఇదిచాలక "ఇంకా వున్నావేరా...నాముందునుండి వెళ్ళిపో. నీకు కాదూ!..." అంటూ అన్నయ్య ఘీంకారం. హే! భగవాన్! ఏమిటిది? ఇంత కఠోరమయిన పరిస్థితిని సృష్టించావ్!

ఆరోజు భోజనానికి లెమ్మనమని అడిగినవారు లేరు! వెళ్ళి నాగదిలో మంచంమీద పడిపోయాను. ఆరోజు నేపడిన గాథ యింతా అంతా కాదు చెల్లాయ్! రాత్రల్లా అలా ఏడుస్తూనే ఉన్నాను. నా హజ ఎవడికి కావాలి? కనీసం ఓదార్చినవాడు లేకపోయారు. ఆరోజున నేను అనుభవించిన ఆవేదన ఆ భగవంతుడికి తప్ప ఇంకెవరికీ అర్థంకాదనుకుంటాను. ఆరోజు ఈ సంగతి నీతోకూడ చెప్పలేదు. ఎప్పుడో చిన్నప్పుడు మావిధికి మమ్మల్ని వదలివేసి శాశ్వతంగా కనుమరుగైపోయిన మా అమ్మను తలుచుకొని, మసుగున పడిపోతున్న ఆమె ముఖపోలికలు, జ్ఞాపకాలు మనసులోకి తెచ్చుకొంటూ ఎంతోసేపు ఆ నిశ్శబ్దనీరవనిశీధినంతా గడిపేశాను. ఆవేదనకు రాత్రేమిటి? పగలేమిటి? చెల్లాయ్!

ఆరోజు మొదలుకొని యింట్లో నా పరిస్థితి మరీ అధ్వాన్నంగా మారింది.

నేనంటే ఒకవిధమయిన ఏవగింపు, అసహ్యము వారి ముఖకవళికల్లో ప్రస్ఫుటమయ్యేది. నేనంటే ఏదోనిర్లక్ష్యంగా ప్రవర్తించేవాళ్లు అన్నయ్య, వదినాను...వారిని చూచికొంత, వారు చెప్పగా కొంత, పిల్లలు కూడ, యిదివరకు మాదిరిగా నవ్వుతూ దగ్గరకొచ్చేవారు కాదు. భయంతో దూరంగా తిరిగేవాళ్ళు.

రెండుమూడు రోజులు అయిన తరువాత ఒక రోజున సాయంత్రం అన్నయ్య ఆఫీసునుండి రాగానే నా పరీక్ష ప్రస్తావన తెచ్చాను భయంతోనే. అప్పుడే కాఫీ త్రాగి పేపరు చదువుకొంటున్నాడు. వెళ్ళి బెరుగ్గాఅడిగాను. 'అన్నయ్యా!'

"ఏం?" అంటూ భ్రుకుటి మెలికలు త్రిప్పి ఉరిమాడు అన్నయ్య.

నే చెబుదామనుకున్న ఆ నాలుగు ముక్కలు కాస్తనీ నోట్లోనే యింకిపోయినై-ఆ చీత్కారంతో. అయినా ధైర్యం తెచ్చుకొని అన్నాను 'సెప్టెంబరు పరీక్షలకు వెళ్తానన్నయ్యా'

"ఇంకా నీకు చదువెందుకురా బడుద్ధాయ్. సెప్టెంబరు వద్దు, మార్చివద్దు. చదువువచ్చే ముఖానివైతే మొన్ననే నిక్షేపంలా ప్యాసయ్యేవాడివి. నీ దరిద్రం మొహానికితోడు డబ్బుకూడ దండుగ. ఎక్కడైనా నౌకరీ చూచుకో. ఇక నేను నీకు డబ్బుపొయ్యలేను" అన్నాడు అసహ్యంగా.

చెల్లాయ్! ఆయన మాట్లాడుతుంటే నా హృదయం ఎంత ఆక్రోసించిందో, నా మనస్సు ఎంత గాయపడ్డదో నువ్వొక్కదానివే అర్థం చేసుకోగలుగుతావమ్మా.

ఆ పూట భోజనంలేదు. ఆ రాత్రంతా ఎంత దుఃఖించానో, నా అదృష్టానికి ఎంత లోలోపల కృళ్ళి కృంగి, కృసించానో అదంతా ఆ భగవంతుడంటూ ఒకడుంటే వాడికే తెలుస్తుంది. ఒకే మాతృమూర్తి రక్తం పంచుకొని పుట్టాం గదా. ఆ మాత్రం సహోదర మమకారంకూడ లేకుండా, హృదయం లేనివాడుగా బాంధవ్యబంధాన్నికూడ త్రెంచు

కొని, అంత క్రూరంగా మాట్లాడాడంటే, నేనెంత దురదృష్ట వంతుడినో చెల్లాయ్!

ప్రపంచంలో నా మంచిచెడులు కనుక్కోడానికి నాకు అండదండగా వుండి, ఆసరాగా ఉండడానికి, ఒక్క అన్నయ్య తప్ప యింకెవ్వరూ లేని నాకు, ఆ అన్నయ్యకూడ ఉన్నా లేనిట్లే అయిపోయాడు.

"అదంతా నా దురదృష్టం"-అని సరిపెట్టుకొన్నాను. చక్కగా చదువుకొని ప్యాసై నా కోసం శ్రమించిన నా అన్నయ్యకు పేరు ప్రతిష్టలు తెద్దామని, అన్నయ్యకు చేదోడు వాదోడుగా ఉందామనుకొన్న నా ఆశయం మంట కలిసింది. నాకంత భాగ్యం లేదమ్మా అరుణ! అంతటితో నా చదువుకు స్వస్థి చెప్పాల్సివచ్చింది. ఇటు చదువులేక, అటు ఉద్యోగం లేక యింట్లో ఖులాసాగా తిని తిరగాలంటే నా అంతరాత్మ ఎంతో బాధపడేది చెల్లాయ్. ఎలాగైనా నాకా యింట్లో గౌరవంలేదు. నేనంటే అందరికీ ఏవగింపే. నన్నర్థం చేసుకో లేని నా అన్నయ్యకే అలావుంటే, మిగతావారికి ఉండడంలో ఆశ్చర్యం ఏముంది. వారితో సమంగా చూచేవాళ్ళుకాదు. భోజనానికి ఎప్పుడో పిలిచేవారు. వారు పిలిస్తేనే వెళ్ళేది. పిలవనిరోజున ఉపవాసం చెయ్యాల్సివచ్చేది. వాళ్ళు సినిమా కెళ్తే నేను యింటికి కాపలా. ఇంటిపనులు చేసిపెడుతూ ఉండాలి. వదిన ప్రతిదానికీ విసుక్కొనేది. చిర్రుబుస్సు లాడేది. ఆ యింట్లో ఉండడమే ఒక భారంగా ఆమె భావిస్తూ న్నట్లు కనిపించేది చెల్లాయ్.

"ఎలాగైనా చదువుకొనేగీతా ఎలాగోలేను. ఎక్క-డైనా చిన్న నౌకరీ అయినా సంపాదించుకొంటే—చీదరింపులూ చీత్కారాలూ మొదలయిన వాటినుండి తప్పించుకొని, నా రాతను తీరిగ్గా, విడిగా కూర్చుని ఏడ్వవచ్చని, అనుకొని ఉద్యోగాన్వేషణలో పడ్డాను చెల్లాయ్. పోనీ ఏదో పెద్ద డిగ్రీ ఉంది. అయినా ఉద్యోగం దొరకలేదంటూ బాధపడి ఏడ్చి మొత్తుకొన్నా ఒక అర్థం పర్థం అంటూ ఒకటుంటుందిగాని, నా నాన్‌మెట్రిక్ క్వాలిఫికేషన్‌కు ఉద్యోగం దొరకలేదంటూ గగ్గోలు చేయడంలో అర్థంలేదని తెలిసి మెదలకుండా ఊరుకొన్నాను.

ఉద్యోగం కోసరం పడ్డపాట్లు అన్నీ విఫలమైనాయి. యింట్లో ఎడసరపు మాటలూ, ఎద్దేవలూ ఎక్కువైనాయి చెల్లాయ్!

"మా పాలిట ఒకడు దొరికాడు తల్లీ! కష్టపడి సంపాదించినదంతా అలా బూడిదలో పోశాడు. చివరికి తప్పి కూర్చున్నాడు. వాడికేం? అటు ఉద్యోగంలేదు. తేరగా తినడం...తిరిగి తిరిగి భోజనం వేళ్టికి కొంపకుజేరడం". ఒక రోజున నే గడపవెక్కే వేళ్టికి. వదిన పక్కయింటామెతో అంటున్నది. తలవంచుకొని నా గదిలోకి వెళ్ళాను.

ఆరోజు నే పడ్డబాధ అంతా యింతా కాదు. నీ అన్నయ్య పరిస్థితి నీవుతప్ప యింకెవ్వరూ అర్థం చేసుకోలేరు చెల్లాయ్! అదృష్టహీనుడనైన నాకు, నన్నర్థం చేసుకోగలిగి, నాలుగు తియ్యటిమాటలు చెప్పి ఓదార్చే నీలాంటి చెల్లెలు ఉండడమే నాకు పరమభాగ్యం చెల్లాయ్ ...నాగురించి

ఆయింట్లో మాట్లాడుకొనే మాటల్లో పైన చెప్పింది ఒక్కటి మచ్చుకకు చెప్పాను. అలాంటివి ఇంకా ఎన్నో... చెప్పలేను. నా పరిస్థితి నీకు క్షుణ్ణంగా అవగాహన కావడానికి యింత చాలుననుకొంటాను.

"సంపాదించే దొకళ్ళూనూ తేరగా అరగించేది ఇంకొకళ్ళూనూ."

"ఏం రాజాగారి బిడ్డవా? ఏడయినా పాన్పుదిగవ్... రోజురోజుకీ సుకుమారం బలసిపోతోంది" జ్వరం వచ్చి ఆ రాత్రంతా నరకయాతనపడి నిద్రనుండి లేవలేదని తనకు తెలిసి కూడా వదిన అన్నమాటలు యివి. తల్లి తరువాత తల్లి అంతటి ఆమె, పరిస్థితి అర్ధం చేసుకోకుండా యిలా నిర్లక్ష్యంగా మాటలు విసిరేసిందంటే నేను ఆ యింట్లో ఎంత ప్రతిబంధక మైపోయానో నేనిలా బయటకునిష్క్రమించేయడానికి ఎలాంటి పరిస్థితి సృష్టింపబడిందో పూర్తిగా తెలుస్తూనే వుంది.

పైన నీకు ఉదాహరణ కోసరం మాత్రమే చెప్పిన మాటలు; అంతకంటే బాధాకరమైనవి యింకా ఎన్నో వ్రాయలేనవన్ని ఉన్నాయ్ చెల్లాయ్! అవన్నీ వ్రాసి యింకా నీకు శ్రమ యివ్వదలుచుకోలేదు చెల్లీ!

అక్కడ ఉన్నకొద్దీ రోజురోజుకూ నా పరిస్థితి విష మించి పోతోంది. అక్కడి వాతావరణానికి నేను తట్టుకో లేక పోతున్నాను అరుణా! ఇంకా వారినే అంటిపెట్టుకొని పడివుండి వారికి యింకా భారంగా వుండదలచుకోలేదు. అక్కడే వుండి యిక చేయగలిగింది కూడా లేదు. చేయగలుగుతానేమో నని చేసిన ప్రయత్నాలు, చేయగలిగిందేమీ లేదని మొదటనే

ధృవపరిచేసినవి. అక్కడ వున్నకొద్దీ అనమానప్పుపోట్లు భరించ లేకపోతున్నాను. అక్కడ చేయగలిగిందేమీ లేనప్పుడు ఇంకె క్కడయినా చేయగలిగిందేమయినా ఉందేమో చూద్దామని నా యీ ప్రయాణం.

ఎక్కడికి వెళుతున్నానో, నా గమ్యస్థానం ఏమిటో — ప్రస్తుతం నీకేమీ వ్రాయలేను చెల్లాయ్. నాకే తెలియదు... నీకేమి వ్రాయగలను? ఇంటిదగ్గర ఆ వాతావరణంలో నా మనస్సుకు శాంతి, సుఖం లేకుండా పోయినయ్. ముఖ్యంగా వాటికోసమే నా ఈ గమనం. నేనిక అక్కడ వుండలేను.

చదువు మానేసి ఆరేళ్లు కావస్తోంది. ఇంక చదువుదా మనే ఆశ లేదు. జీవితంలో కనీసం యింకా ఎక్కడయినా నా జీవితం వెళ్ళదీసికొందామనే ఆశతోనే ఈ పయనం. మంచి రోజులు వస్తాయనే ఆశ. మానవుడు ఆశాజీవి కదూ చెల్లీ!

బతికి బాగుండి నేనే ఆశతో ఇలా అంతూ పొంతూ లేని గమ్యస్థానానికి ప్రయాణం కట్టానో, ఆ ఆశ ఫలిస్తే తప్పక సంతోషంతో ఉత్తరం వ్రాస్తాను చెల్లాయ్.

ఇంతలో నా చెల్లాయ్ ఒక ఇంటిమనిషి అయితే చాలా సంతోషిస్తానమ్మా! అమృతమూర్తి అయిన నా చెల్లాయ్‌కి తప్పకుండా అపరంజిలాంటి బావగారు వస్తారులే! పరిమళ భరితమైన మీ జీవన కుసుమం సౌగంధం వెద జల్లుతూ, మీ జీవితం పన్నీటిజల్లులా ఆహ్లాదంగా సుఖ ప్రదంగా ఉండాలని నీ నిర్భాగ్యుడైన అన్నయ్య ఆశీర్వచనం

నేను అదృష్టహీనుణ్ణి. సర్వం వాళ్ళేఅనుకొన్న అన్న వదినలకే భారమయ్యాను. ప్రపంచానికే భారమైపోతానేమో

నని భయం నాకు కలుగుతోంది. ఆ భయాన్ని తేల్చుకోడానికే యీ తెగింపు. మరి నా అదృష్టం ఎలాఉందో తెలియదు చెల్లీ! అంత మరీ ప్రపంచానికికూడా భారమయ్యే పరిస్థితివస్తే, మా అమ్మకు మటుకు భారంగానుగా. అందులో నేనంటే మా అమ్మకు బోలెడు ప్రేమట చెల్లాయ్! చెప్పగా విన్నాను. ఇప్పటికే అమ్మ రెండు మూడుసార్లు పిలిచినట్లనిపించింది. కాని యింతవరకు వెళ్ళలేదు నేను.

కొన్నాళ్ళు ఎదురుచూసి, యిక నేను యీ ప్రపంచంలో ఉండడం అనవసర మనిపిలిచినప్పుడు, అమ్మ ఎలాగో పిలుస్తోంది. తిరిగి అమ్మ దగ్గరకే వెళ్తాను చెల్లీ! ఈఅన్నయ్యాను మాత్రం మరచిపోకు.

నా గురించి ఊరికే మనసు పాడుచేసుకోకు అరుణా! ఏమీ భయంలేదు. ఇంకెప్పుడు కలుగుతుందోమరి, నా చెల్లాయిని చూసే భాగ్యం. ఇక ఉంటానమ్మా!

దీవెనలతో నీ అభాగ్యుడైన

అన్నయ్య—

రామం.



15)

# అబద్ధానికి విలువ

కాలం అమిత వేగంతో ముందుకు సాగిపోయింది

ఫలితం: నాలుగేళ్ళ చలపతితో స్నేహజీవితం మనో పథంలో కొన్ని చిర స్మృతుల్ని మిగిల్చి నానుండి శలవు తీసికొన్నది.

రైలు తన గమ్యస్థానం చేరాలనే ఆత్రంతో ముందుకు నరుగిడుతుంటే కాలప్రవాహంలో చెదరిపోయి, మనోపథంలో మాత్రం మిగిలిపోయిన స్మృతులు ఒక్కటొక్కటే అంచెలం చెలుగా రైలు పెట్టెలో రికామీగా స్తబ్దుగా కూర్చున్న నా మెదడులో ప్రవేసించాయి.

చలపతి నా స్నేహితుడు. వాడూ నేనూ కాలేజీలో నాలుగేళ్ళు కలసి జాయంటుగా చదువుకొన్నాము. వాడంతటి హుషారయిన మనిషి రోజూ మన దైనందిన జీవితాల్లో తటస్థ పడడం అరుదు. వాడిని ఏసమయంలో చూచినా సంతోషంగా కనబడడం – వాడిలో ప్రత్యేకత.

"సృష్టిలో తియ్యనిది స్నేహమేనోయీ" అని గానం చేశారు మహానుభావులు. స్నేహంలోని ఆ తీయదనమెమిటో చూపించినవాడు మా చలపతే

నిరంతరం ఆనందంతో జీవితాన్ని గడిపి చిరునవ్వుతో ఈ లోకంనుండి నిష్క్రమించాలిరా అంటూ ఉండేవాడు వాడు ఆరోజులలో.

మరి అన్ని మాటలు చెప్పే వాడి దివ్యమైన జీవితం మనం ఊహించలేనన్ని సమస్యలు, చిక్కులు, అశాంతి, అధైర్యం, దుఃఖం ఇలాంటి నిరాశామయ నిర్వచనాల పాల్బడిందంటే నేనెలా ఆశ్చర్య పడకుండా వుండగలను?

ఛా! అంతా బూటకం, అబద్ధం అని మీరనవచ్చు. అబద్ధం చెప్పాల్సిన అగత్యం నాకేముచ్చిందీ? వాడి స్వహస్తాలతో వ్రాసిన ఈ సంక్షిప్తమైన ఉత్తరం చాలు మీ అపోహను తీర్చడానికి.

జేబులో విశ్రాంతి తీసుకొంటున్న ఆ ఉత్తరాన్ని తీసి చదువుకొన్నాను. మరి ఒకసారి వాడి వాక్యాల వెనుక నిగూఢంగా దాగివున్న నిజపరిస్థితిని గ్రహించే అన్వేషణలో.

"రాజూ!

సంస్లిష్ట సంకీర్ణమైన నా మనోభావాల గాఢాన్ని జ్వాలల్లో ఈ అశాంతిమయ వాతావరణంలో, అపరిష్కృత క్లిష్టసమస్యా కీకారణ్యంలో చిక్కుకొన్న నేను ఏమీ వ్రాసే పరిస్థితిలో లేనురా. నువ్వొమాత్రం ఒకటి రెండురోజులు సెలవుపెట్టి వస్తేనేగాని, నాకు కొంతయినా ధైర్యం చిక్కదు మిగతా విషయాలు సముఖంగా మాట్లాడుకొందాం.

చలపతి."

నేను చెప్పింది యిప్పుడయినా మీరు ఒప్పుకోక తప్పదుమరి. వాడి అశాంతికి కారణం ఏమిటో! అందుకే నా యీ ప్రయాణం.

సదా ఆనందతరంగాలలో మునిగి తేలే చలపతి మనో భావాల నిర్మల తరంగాలను కల్లోలితం చేసిన విషయం ఏమై ఉంటుంది.

వాడికి అపరిష్కృత క్లిష్ట సమస్యలు, అశాంతిమయ వాతావరణాలూనా? ఏమిటి వాడు వ్రాసేది?

"కాలంతోపాటు మనుష్యుల బుద్ధులుకూడ మారి పోతాయ్. వాడి సహజగుణం ఇలా ఏమయినా చిన్న సమస్యలకుగూడా బుర్ర బద్దలుచేసికొనే వింత ప్రకృతిరూపం దాల్చిందేమో!

ఈ మధ్యనే వాడికి వివాహం అయింది. పనిఉండడం వల్ల తను వెళ్ళలేకపోయాడు. తను వెళ్ళనందుకు చలపతికి బోలెడు కోపంకూడ వచ్చి కొన్నాళ్ళు ఉత్తరంకూడ వ్రాయడం మానుకొన్నాడు. మరి వాడికి కోపం వచ్చిందని నాకు ఎలా తెలియడం!

వీడి చికాకులకూ, సమస్యలకూ వాడి వైవాహిక జీవితమే వాడి సంసారిక బాధలే కారణాలు అయ్యే అవకాశాలున్నయ్. నాకదే అనుమానం!

గృహస్థుడికిలేని గొడవలూ అతడు చిక్కుకోని చిక్కులూ అనుభవించని బాధలూ ఏముంటాయిలెండి!

మధ్యలో చిన్న కునుకు పట్టినట్లుంది. మెలకువ వచ్చే టప్పటికి చేతిలో చలపతి సందేశం నా పట్టు విడిపించుకొని స్వేచ్ఛా విహారంచేయడానికి నానా ప్రయత్నాలూ చేస్తోంది. మడతపెట్టి జేబులో పడేశాను దాన్ని.

రైలు ఎక్కడో - మధ్యలో యెటూ గాని త్రిశంకు స్వర్గంలో బహు చిక్కటి చీకట్లో ఆగిపోయివుంది. దిగేవాళ్ళు దిగి ఏవేవో మాట్లాడుకొంటున్నారు. ఇంజను చెడిపోయిందట్లే ఉన్నది.

కాసేప్పటికి రైలు కదిలింది. నా సుషుప్తావస్థలో కరగిపోయిన చలపతి స్మృతులు రూపాంతరం చెంది 'రాధ' స్మృతులుగా తిరిగి నా మనసులో ప్రవేశించాయి.

రాధ పూర్తిపేరు అనూరాధ. బాగా ఉన్నవాళ్లు. రాధే నాజీవిత భాగస్వామిని అవుతుందని అనుకొనేవాడిని ఆ రోజుల్లో. మాకేమంత చెప్పుకోతగ్గ ఆస్థిపాస్తులు లేవు. మా వూళ్లో మాయింటి కెదురుగానే ఉండేవాళ్లు ... ఎక్కడో దూరపు బంధురికం కూడా వుండేది.

మా యిద్దరిమధ్య అనురాగ వల్లరి అడవితీగలా గుబురుగా అల్లుకుపోయింది.

ఒకరోజు రాధ నా వద్దకు వచ్చింది. ఆరోజుమాటల్లో వివాహ ప్రసక్తివచ్చింది. వాళ్ళనాన్నను అడిగేస్తా నన్నాను. సరే నన్నది రాధ

"ధనిక నిరుపేదల అంతరాలు ఆనాడేకాదు, ఈనాటికీ తమ స్థానాల్ని పటిష్టంగా నిలద్రొక్కుకొంటున్నాయి."

కాని నాకూ, రాధకు మధ్యగల అనుబంధానికి ఈధనిక నిర్ధనికాంతరాలు ద్వార బంధాలుగా అడ్డమొస్తయ్యనే పరిజ్ఞానం మొదటే నాకు గనక ఉంటే నా పరిస్థితి యింకెలాగుండేద్లోగాని, ఆ జ్ఞాన శూన్యమే రాధ జ్ఞాపకాల్ని నాకు పారసి

రాధనుండి నన్ను అజ్ఞాపకాల్ని కట్టగట్టి దూరంగా విసిరి పారేసింది.

"కూటికిలేని ఆ రాజుగాడికా నా కూతుర్నిచ్చేది... ఆ ఆశ వదులుకోమను" రాధనాన్న ఎవళ్ళతోనో అన్నాడట.

అంతటితో రాధనుండి దూరంగా వచ్చేశాను. ఆ రోజు, రాధ దుఃఖం చూస్తూఉంటే నా హృదయం తునా తునకలై పోయింది.

నేను సమ్మతిస్తే, ఇంట్లో ఎవ్వరికీ చెప్పకుండా నాతో వచ్చెయ్యడానికి తయారుగానే ఉంది రాధ అప్పుడు. కాని నా మనస్సు అటువైపు మొగ్గలేదు. నా హృదయాన్ని నేను సమాధాన పరుచుకోలేకపోయాను. ఎందుకో నాకా అధర్మ మార్గం గిట్టలేదు. సంఘానికి వెరవకపోతే ఏనాడో రాధ నాదయ్యేది.

కొండపల్లిలో రైలు ఆగింది. నా కలత నిద్రతోపాటు రాత్రికూడ బరువుగా తెరచింది కళ్ళు. బెజవాడ స్టేషను వచ్చేటప్పటికే పూర్తిగా తెల్లవారిపోయింది.

దూరంనుంచే గుర్తుపట్టాను చలపతిని. అంతమార్పేమీ లేదు వాడిలో. వాడి ముఖం మాత్రం గంభీరంగా ఉంది. అనుభవాలతో వచ్చిన గంభీరత మరి!

కావాలని నవ్వు తెచ్చుకొని 'బాగున్నావురా రాజిగా?' అని కౌగలించుకొన్నాడు.

"ఇదిగో యిట్లాఉన్నారా చలపతీ! ఏరా ఇంత అర్జంటుగా ఉన్నఫలాన వచ్చెయ్యమని అర్జెంటుగా ఆర్డరుపడేసావెందుకురా భడవా!"

"పదరా తరువాత మాట్లాడుకొందాం. నువ్వు వచ్చావంతేచాలు..." వాడు హుషారుగా నన్ను ముందుకు లాక్కెళ్లాడు ఆ హుషారు నా రాకతో కలిగిందేనని స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

కృష్ణలంకకు రిక్షా మాట్లాడుకొన్నాం. వాళ్ళ యిల్లు కృష్ణలంకలో ఉన్నది. దారిలో అన్నాను.

"మా అక్కగారు కులాసాయేనా!"

"ఆహా!" చలపతి జవాబు నీరసం, నిస్పృహలు, మిళితమై ఉన్నది.

"నీ పెళ్ళికికూడ రాలేకపోయానురా మరి. పరిచయం చెయ్యకపోయావో!" అన్నాను వాడివైపు క్రీగంటచూస్తూ.

వాడి ముఖం రంగు మారింది. నా అనుమానాలు. ప్రయాణంలో నేను చేసుకొన్న అవలోకనం, అన్నీ భూతద్దంలోలా కనుపించినై.

అయినా యింత తొందరగా చెప్పలేను. అన్ని అనుమానాలనూ కాలమే నివృత్తి చేస్తుంది. అన్నీ స్పష్టంగా వాలంటే - తొందర పడకూడదు.

ఇంటికి వెళ్ళాం. పెద్ద బంగళా. హాయిగా చుట్టూ తోట. పెద్ద కాంపౌండు. తోటలో ప్రొద్దున్నే వాతావరణం చాలా నిర్మలంగా ఉన్నది. ఒక గది నాకు కేటాయించేశాడు చలపతి. పగలంతా ప్రయాణం బడలిక యింతకూడా లేకుండ తీర్చేసుకున్నాను.

సాయంత్రం - చల్లబాటు వేళ కృష్ణ ఒడ్డుకు అలా షికారుకు వెళ్ళాం ఇద్దరమూ.

ఏవేవో ఆలోచనలతో మౌనంగా ఆ కృష్ణా సైకతాల్లో కొంత దూరం నడచిపోయాం.

దట్టంగా కమ్మిన నీలిమేఘాల సందునుండి సూర్యుని అంతిమకిరణ పుంజాలు దూరానవున్న కృష్ణాపాయలను వెండి సెలయేళ్లుగా చేస్తున్నాయి.

ఇంతవరకూ నన్ను యింత ఉన్నపళంగా రప్పించడానికి కారణమేమిటో చెప్పినేలేదు వాడు. నేను కదలించకపోతే నా ఆతృత ద్విగుణీకృతం అయ్యేటట్లుంది.

"ఏమిట్రా? అలా మూంగి మాదిరిగా మాట్లాడకుండా నడుస్తున్నావ్. ఇదివరకటి వాగుడంతా ఏంచేశావురా చలపతీ?" మౌనాన్ని ఛేదిస్తూ వాడిని కదలించాను.

కొంచెం నావైపు తిరిగి విషాదంగా నవ్వాడు. ఎంతటివాడయినా పరిస్థితులప్రభావంలో అంతా కృంగిపోవకతప్పదు కాబోలు!

వాడిముఖం పరీక్షగా చూశాను. వాడి వదనంలో అనిర్వచనీయమైన నిర్వేదం తొణికిసలాడుతోంది. కదిలిస్తే దుఃఖం వెల్లుబికేటట్లుంది.

"ఎందుకూ అంత యిదవుతావ్ చెప్పరా?" రెట్టించాను వాడిని.

"ఏం చెప్పనురా? నేను తెలయక గోతిలో దిగానురా రాజూ!"

"అంటే?... తిన్నగా చెప్పరాదూ?"

"ఇప్పుడు పెళ్ళి ఎందుకు చేసుకొన్నానా అనిపిస్తోంది తెలివి తక్కువగా వ్యవహరించానేమోనని... ఇప్పుడనుకొంటు

న్నారా!" వాడి మాటలలో నిరాశా, నిస్పృహలు తొంగి చూస్తున్నాయి.

"నీకొచ్చిన బాధేమిటిరా చలపతీ! పుష్కలంగా కట్నంకూడా ముట్టినట్లుందిగదూ!" వాడిని బాధించాలని నా అభిమతం కాకపోయినా అకస్మాత్తుగా అనుకోకుండా అనే శాను ఆ మాటను.

"అదిగో! ఆ కట్నంలోనే ఉన్నవిరా నానాబాధలూ. కట్నమయితే పుష్కలంగా దొరికిందికానీ, డబ్బుకు, అప్యాయ తానురాగాలకు పొత్తుకుదరదురా. ఇది నా స్వయానుభవనం. వివాహమయి సంవత్సరమయినా, మీ అక్కగారన్నావే ఆమెకూ, నాకూ ఎడమొగం, పెడమొగం!"

"ఆమె అయిష్టతకు కారణం గ్రహించడానికి ప్రయత్నం చేశావా?"

"ప్రయత్నం చేద్దామన్నా అలాంటి అవకాశంకూడ కలుగనివ్వదు కదా! ఏది ఎలాగున్నా-ఆమె పూర్వజీవితంలో కొంత నిక్షిప్తమైన కథ జరిగి ఉండాలిరా రాజూ! ఆమె యిష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి జరిగిఉంటుంది. మొదట్లో కొన్నాళ్ళు ప్రయత్నం చేశానురా. కాని ఓర్పుపోతోంది. కాల విలంబనం జరిగినకొద్దీ మా యిద్దరికీ ఒకరిమీద ఒకరికి పరస్పర ద్వేషాలు ప్రజ్వరిల్లి పోయేటట్లున్నవిరా! యిప్పుడు అవి ప్రారంభంలోనేఉన్నా, అవి చిన్నగాలై, యీదరగాలై, ఫోరుగాలై తుఫానుగా రూపొంది, ఉప్పెనై, చివరకు ప్రళయ రూపందాల్చి, నానాభీభత్సం చెయ్యకపోదు మా సంసా రాన్ని. అసలు నేనంటే అయిష్టతకు కారణమేమిటో చూచా

యగాకూడా తెలుసుకోలేకపోయాను. అడిగినా పెడసరపు జవాబులూ, తిరస్కృతి వచనాలు." దీర్ఘంగా నిట్టూర్చాడు. నాబుర్ర వేడెక్కింది. నా మస్తిష్కంలో పట్టనన్ని ఆలోచనలు.

వారుణి తామ్రిమ దాల్చింది. అపరగిరిలో కిరణమాలి దాక్కున్నాడు. అంతవరకూ అమితంగా వేడెక్కిన నా మెదడు చల్లని కృష్ణా సమీరాలతో చల్లబడింది.

ఎవరి ఆలోచనల్లో వాళ్ళం భారంగా యింటికి చేరాం. భోజనాలల్లో చలపతి తల్లి వాడి నిరంతర ఆలోచనలను గురించి ఆమెకు అర్థంకాని, వాడి మనోవ్యాకులత గురించి విచారత వెలిబుచ్చింది.

భోజనంచేసి మెల్లగా నా గదిలో చేరాను. ఒకటే ఎడతెగని ఆలోచనలు...చలపతి భవిష్యజ్జీవితం...భార్యాభర్తలకు మొదటినుండీ ఈ కలతలేమిటి? తాను చేయగలిగిందేమి ఉన్నదని రెండురోజులు సెలవుపెట్టి, రెండొందల మైళ్ళు రప్పించాడు. ఇందులో తాను చేయగలిగిందేమిటి? వాడేమీ చేయలేక, తోచక స్నేహంకోసం రమ్మని ఉంటాడు.

కిటికీలోంచి వచ్చే చల్లని గాలితోపాటు, తోటలోని పూలసౌరభం మత్తుగా లోనికి ప్రవేసించింది.

బాగా చీకటిపడింది. ఆలోచనల్తోనే రాత్రి పన్నెండు దాటిపోయింది.

యిల్లంతా నీరవ నిశ్శబ్దత వీరవిహారం చేస్తూంది.

తలుపేసి పడుకొందామని లేచాను. బయట చీకట్లో మనిషి ఆకృతి లీలగా తారట్లాడింది.

"ఎవరూ?"

"... ... ..."

ఎవరో ఆడమనిషి. నిండా పమిట కప్పుకొని తన గది వైపుకే వస్తోంది.

"ఎవరువారూ?"

ఆమె దగ్గరకొచ్చింది. లైటుకాంతి ఆమె వదనంమీద పడి నాకు ఆమెను పరిచయం చేసింది. ఆశ్చర్యపోయాను.

ఎవరోకాదు ... ఆమె రాధ ... ఆనాడు ధనిక నిరుపేదల అంతరాల ఝంఝూ ప్రభంజనంలో నానుండి దూరంగా కొట్టుకొనిపోయిన లక్షాధికారిణి రాధ. నా ఆశ్చర్యం ఎంతో వ్రాతలో చెప్పలేను.

"రాధా ... నువ్వా!" అన్నాను.

"అవును రాధనే... ఆశ్చర్యంగా ఉందా?"

నా కనుమానం వేసింది. చలపతి మనోవికారానికి కారణభూతురాలు రాధేనా అని ... అందుకనే అడిగాను.

"ఇక్కడి కెలావచ్చావ్?"

"ఈ యింట్లోనే ఉంటున్నాను."

"ఈ యింట్లోనే హోదా... ఏమిటో తెలుసికో వచ్చా?"

"ఈ యింటివారి కోడల్ని!"

"యిలా అర్ధరాత్రివేళ, కానివేళ పరాయివ్యక్తి గది లోకి ఒంటరిగా రావాల్సిన అవసరం ఏమిటో చెప్తారా అను రాధాగారూ!"

"రాజూ!" పెద్దగా అరవకపోయినా దుఃఖంతో ఆమె గళం గాద్గదికమైంది. ఆమె కళ్ళల్లోకి అశ్రువులు చెక్కిళ్ళను ఆర్ద్రము చేసినై.

"బలవంతంగా నాకీ పెళ్ళిచేశారు రాజూ!"

"ఒకళ్ళు బలవంతంగా చేయడమేమిటి అనురాధ గారూ! అంతా గీత."

"అలా 'గారూ' అని అవమానం చేస్తున్నావా రాజూ! పరాయిదానినా నేను?"

"పరాయిదానివి కావామరి...ఆమాట అలాఉంచి నువ్విప్పుడు యిలా అర్ధరాత్రి ఒంటరిగా రావడంలో ఉద్దేశ్యం?"

"నీకేమీ చెప్పగలను రాజూ! నాకిక్కడ శాంతిలేదు. మనసులు కలవని జీవితం గడపడం నాకు దుస్సాధ్యంగాఉంది రాజూ!"

ఒకప్రక్క చలపతి హృదయఘోష నా కర్ణపుటాలను ఛేదిస్తూ వినబడ్తూ ఉంటే అన్నాను.

"వివాహం చేసికొనేముందు అన్నీ ఆలోచించుకొని చేయాల్సింది రాధా! ఇంకో మనిషినికూడ అశాంతికి గురి చేయడం భావ్యమేనా! అలా చేయాలని సంకల్పించే యిలా వివాహం చేసుకొన్నావా?"

"ఆనాడు నాన్నకు ఎదురు చెప్పలేకపోయాను."

"కాబట్టి వెట్టిమొట్టి జ్ఞాపకాలతో మనసు పాడు చేసుకోక జీవితాన్ని ఉన్నదాంన్లో సుఖమయం చేసుకో. ఇలా..."

"నాకది అసాధ్యం. నేనిక ఈ యింట్లో వుండలేను."

"ప్రయత్నం చేయకుండా ఒకే పట్టులో ఉంటే వచ్చే దేమీ లేదు రాధా. చలపతి చూడు. వాడి హృదయం ఎంత ఘోషపెడుతోందో! నీమూలంగా వాడి జీవితంకూడా అశాంతి మయ మయింది. నీ తిరస్కృతి వాడిని ఎంతో బాధపడ్తోంది రాధా! మీకేమిలోటు? హాయిగా వుండక. వాడు చాలా మంచివాడు. వాడిసంగతి నాకు బాగా తెలుసు."

"నామనసు ఒప్పుకోవడంలేదు రాజూ! అందరూ నిద్ర పోతున్నారు. నీ సాంగత్యంలో నా జీవితం సమస్తం ఆనం దంగా గడపాలని నా కోరిక రాజూ! పద వెళ్ళిపోదాం, వీరం దరికీ దూరంగా. ఎక్కడికో వెళ్ళి బ్రతుకుదాం."

"ఎక్కడికో వెళ్ళి!..." అప్రతిష్ట. అనూరాధ ఎంతకు తెగించింది! నాకు పట్టలేని కోపం వచ్చేసింది. తమాయించు కొన్నాను. చలపతి భార్యా స్థానాన్ని జ్ఞాపకం ఉంచుకోని అన్నాను.

"ఛీ! ఎంతకు తెగించావు రాధా! నీవిప్పుడు పరిగృహ్యావి (పరోఢవి) అప్పుడెప్పుడో మనిద్దరం స్నేహంగా ఉన్నామని యిక దానినే వదలక బాధపడడమంత బుద్ధితక్కువ ఇంకేమీ లేదు రాధా! సంఘం నియమించిన నియమాలను అతిక్రమిస్తే తర్వాత చాలా బాధలు పడవలసివస్తుంది."

"నీవు పిరికివాడవయితే నేను చూసుకోవాల్సినమార్గం యింకోటి తప్ప, మరేదీలేదు. అతుకని బతుకులోకన్న ఆ మార్గంలోనే ఎక్కువ ప్రశాంతత లభిస్తుంది. అదే... చావు!"

ఏమిటి? ఈమె యింత మొండిగా వాదిస్తూంది. ఈమె గనుక మరణిస్తే యిక చలపతి జీవితం ఎలాంటి మలుపుతిరుగు తుందో చెప్పలేను. ఒక చిన్న అబద్ధమాడితే! చలపతి జీవితం బాగుపడుతుందేమో!

"అదికాదు రాధా! నువ్వు ఎందుకు తెగించినా అన్నిం టికీ నీవు సిద్ధంగాఉన్నా... నేను ఎలా రాగలను? నేను వివాహి తుణ్ణి. ఆమెకు నేనంటే అమితమైన ప్రాణం. ఒక చిన్నారి బాబు కూడా. నేనొస్తే వీరిద్దరి జీవితాలూ ఏం కావాలి? నేను రాలేను. ఇటు నాస్నేహానికి అటు నన్ను నమ్ముకొని ప్రాణాలర్పించి, పూజించేవారికి ద్రోహం చేయలేను. నా ముసలి తలిదండ్రు లేమికావాలి? ఎవరయినా లేస్తారు. త్వరగా వెళ్ళిపో... తొందరగా... ఊఁ... జీవితాన్ని యిలా దుఃఖ పూరితం మటుకు చేసుకోవడం భావ్యం కాదు ఉంటా..." అన్నాను.

రాధ మొహంలో ఆశ్చర్యపురేఖ పొడసూపింది. వెను వెంటనే ఆమె వదనంలో దుఃఖం పెల్లుబికి వచ్చింది. చేతుల్తో ముఖాన్ని కప్పుకొని ఏడుస్తూ చీకట్లో కలసిపోయింది.

మర్నాడు తిరిగి హైదరాబాద్ వచ్చేశాను చలపతితో చెప్పి.

వచ్చేస్తుంటే వాడు పసిపిల్లాడులా ఏడ్చాడు. ధైర్యం చెప్పాను. 'ఆమెకు మాత్రం తెలివిలేదా? చక్కపడుతుందిలే'

అని చెప్పాను. భారహృదయంతో వచ్చేశాను హైదరాబాద్‌కు.

* * * *

యిల్లంతా సందడిగా ఉంది. బంధువులు ఒక్కరొక్కరే వస్తున్నారు. చలపతి వుత్తరం వ్రాశాడు. 'సతీ సమేతంగా తరలివస్తున్నానని. నా పెళ్ళికి నీవు రాకపోయినా? నేనెలా రాకుండా ఉంటానురా రాజిగా!' అని వ్రాశాడు. నా మనసు ఎంతో సంతృప్తి చెందింది. 'వచ్చినా రాకపోయినా, మీరూ అన్యోన్యంగాఉంటే చాలురా చలపతీ' అనుకొన్నాను లోలోపల.

ఇవాళే వాడు వస్తున్నాడు. ట్రైనుదగ్గరకు వెళ్ళాను. అరుగో వచ్చారు... చలపతి ... రాధ చంకలో చక్కటి, వెన్నముద్దలాటి బాబు. యిద్దరిలోనూ నే ననుకోని మార్పు చూచాను. బండి దిగగానే చలపతి నన్ను కావిలించుకున్నంత పనిచేశాడు. నా భుజాలు పట్టుకొని కుదిలించి పారేశాడు.

"వీడేను రాధా! నా ఓల్డ్ ఓల్డ్ స్వీట్ ఫ్రెండ్. పేరు 'రాజు.' నిజంగా రాజాలాంటి వాడులే. వీడిదే పెళ్ళి. ఇదివరకు ఒకసారి మనింటికి వచ్చాడులే. నువ్వు చూసివుండవు." వసపెట్టిన పిట్టలా వాగుతూ ఏవేవో చెప్పుకుపోతున్నాడు శ్రీమతితో. ఇదివరకటి పంథాలో వున్నై వాడి మాటలు.

వాగ్ధోరణిచూస్తే వాడిలో యిదివరకటి చలపతిని చూశాను యిప్పుడు.

రాధ ప్రక్కకు తిరిగి నిశ్శాంతపోయింది. ఆనాటి నా అబద్ధానికి.

వాడి జీవితంలోకలిగిన మలుపుకు కారణం నేనా నాడు రాత్రి ఆడిన అబద్ధం అని వాడికేం తెలుసు?

అబద్ధానికికూడ అనంతమైన విలువ ఉంటుందని మాత్రం నాకు తెలుసు, శ్రీమతి అనురాధకు తెలుసు.

చెదరిపోబోతున్న వారి దాంపత్య జీవితం నా అబద్ధం వలననే నిలబడినట్లయితే అబద్ధానికి విలువకట్టడం మాత్రం దుస్సాధ్యం. అబద్ధానికి విలువ అమేయము, అపారము, అనంతమూనూ.



# జాజిమల్లెలు

"అయ్యో! అలా ఉన్నావేమిటి కమలా?" డాక్టర్ రామారావు నిలువుటద్దంలో చూచుకొంటూ డ్రెస్ వేసుకొంటున్నవాడల్లా సంభ్రమాశ్చర్యాలతో ఈజీ ఛైయిర్‌లో నీరసంగా కళ్ళు మూసుకొని పరధ్యానంగా అదోలా ఉన్న భార్య నుద్దేశించి అన్నాడు.

"ఎలా ఉన్నాను?..." భర్త పిలుపుతో ఆలోచనల మైకంలోంచి బయటపడి రామారావువైపు చూస్తూ పేలవంగా నవ్వేసింది కమల.

"మరి యింకా తయారు కాలేదేం? ఊ. టైమయింది! ఆపరేషన్ కూడా. త్వరగా రా!" హడావుడి చేశాడు రామారావు.

యివాళ రోజుమాదిరిగా హుషారుగాలేదు కమల. వంట్లో బాగాలేదేమో! మరీ ఈమధ్య క్షణం తీరికకూడా లేకుండా ఉన్నది. రెస్ట్ తీసికోమంటే వింటేగా! 'నాకు అలా కష్టపడటంలోనే ఉంటుంది ఆనందం!' అంటుంది డాక్టర్ కమలాదేవి. నిజంగా తన అదృష్టమే. కమల తన జీవితంలో అడుగు పెట్టడం.

యింతలో కమల కాలిసవ్వడి రామారావును బాహ్య ప్రపంచంలోకి లాక్కొచ్చింది.

"ఈవాళ డాక్టర్‌గారుకూడా ఏదో ఆలోచనలో ఉన్నట్లున్నారే! లేవండి టైమయింది! ఆపరేషన్‌కూడా!" కిల కిలా నవ్వింది కమల జోళ్ళు తొడుక్కొంటూ.

రామారావు కర్థం కాలేదు. కమల మనః ప్రవృత్తి క్షణికంలో మారడంలో ఆంతర్యం ఏమిటో ఎప్పుడూ యింతే! ఈ ఆడవాళ్ళకు ఇప్పుడున్న చిత్తం ఇంకాస్సేపటికి ఉండదు.

"సరేగానీ! ఏమిటి, ఇలా ఉన్నావు. అక్కడ ఆప రేషన్ సవ్యంగా జరిగేనా?" కమల గులాబిరంగు చుబుకాన్ని తర్జనితో మెల్లిగా పొడుస్తూ గలగలా నవ్వేశాడు రామా రావు.

"యిలా చేస్తుంటేమాత్రం సవ్యంగా జరుగుతుం దేమిటి? అల్లరి పిల్లాడిలా ఆలస్యంచేయక నడవండి త్వరగా!" నవ్వుతూ రామారావును అనుసరించింది.

వారిద్దరూ నవ్వుతూ వెళ్తుంటే తోటలోని గులాబి సిగ్గుపడి కుచించుకు పోయింది

"కమలా!-కమలా! అయ్యో! డాక్టర్ కమలాదేవి గారూ!"హుషారుగా బూటు టకటక లాడించుకుంటూ వచ్చి స్టెతస్కోపును వంకెకు తగిలించి ఇటుఅటూ చూశాడు రామా రావు కమలాదేవి కోసం.

"ఏయ్ ఎక్కడోయ్! అబ్బ! ఎప్పుడు ఏదో ఒకటి చేస్తూనే ఉంటావుకదా. యివాళ భలే మంచి రోజుకమలా! మేజర్ ఆపరేషన్! గ్రాండ్ సక్సెస్!"ఎంత హుషారుగా గది లోకి అడుగు పెట్టాడో అంత హుషారు చిత్తుగా చప్పబడి పోయింది. కమల బెడ్ మీద దిండులో తలదూర్చుకొని నిశ్శ

ద్ధంగా ఏడుస్తోంది. అప్పుడప్పుడు వెక్కిళ్ళు వస్తూ ఆమె ఏడుపును బహిర్గతం చేస్తున్నయ్.

రామారావు ప్రక్కన కూర్చున్నాడు. కమలాదేవి ముఖాన్ని పైకెత్తి "ఏమిటి యివాళ ఏమయింది? యిలాగున్నావ్? ఏడుపుకూడా ఎందుకు? చెప్పు కమలా? సంతోషంగా ఉండాల్సిందిపోయి ఛ! ఒంట్లో బాగాలేదా?" అనురాగాతిరేకంతో కమలాదేవి చెక్కిళ్ళమీద కన్నీటిని తుడిచాడు.

"ఏమిటి? ఏం మాట్లాడవూ? చూశావా! ఆపరేషన్ మధ్యలో అలా పరుగెత్తుకొచ్చేసారేమిటి? మొదటే చెప్పానుగా విశ్రాంతి తీసుకోమని. ఇవాళ చాల సంతోషంగా ఉంది. కష్టపడ్డా ఫలితం దొరికింది. పాపం! ఆయన యిక బ్రతికి బయటపడ్డట్టే! ఫరవాలేదు. ఈ వూరు కాదుట. ఏదో పనిమీద వచ్చాడట. కారులో వెళ్తూంటే ఈ యాక్సిడెంట్ అయిందట. అదృష్టవంతుడు! బ్రతికాడు. కారుమాత్రం నుగ్గునుగ్గయిపోయిందట."

చెప్పుకుపోతున్న రామారావు వదనంలోకి నిర్నిమేషంగా చూస్తూ ఉండిపోయింది కమల.

"కమలా! చెప్పవా అసలు సంగతేమిటో?"

"ఏమిటో? ఈయన అవధుల్లేని అనురాగం తను బాధపడ్తే భరించలేరుగదా! నిజంగా అమృతమూర్తి!" అంతరాంతరాళాల్లో అనుకొన్నది కమలాదేవి.

"చెప్తాగాని లేవండీ టీ తీసికొందాం. వెళ్ళి డ్రెస్ మార్చుకొనిరండి" అన్నది కళ్ళు తుడుచుకొంటూ.

"ఇప్పుడు చెప్పాలి. అలా తప్పించుకోవడం కుదరదు నా దగ్గర."

"నిజంగా చెబుతాగా! వెళ్ళీరండి. ఇలాచేస్తే కుదరదు. సావధానంగా చెప్పాలి యిటువంటి విషయాల్ని."

"ప్రతిదీ ఇలా సస్పెన్సులో పెడతావ్ కమలా! రెండు ముక్కలు చెప్పేయటానికి నన్ను టాయ్‌లెట్ అవమన్నావ్! టీ త్రాగమన్నావ్?" సాసర్‌లోని 'టీ'ని సిప్‌చేస్తూ ఎదురుగా సోఫాలో కూర్చున్న కమల నుద్దేశించి అన్నాడు రామారావు.

"అలా తోటలోకి వెళ్దాంరండి! హాయిగా ఉంటుంది. ఇవాళ నా మనస్సేం బాగాలేదు. ఎన్నడో జరిగి మరుగున పడిపోయిన ఒక గాథ జ్ఞాపకానికి వచ్చింది. ఆ కథా విషయం లోని విషాదమే నా మనోగ్లానికి మూలం. ఎందుకో హఠాత్తుగా ఈ రోజు జ్ఞాపకాని కొచ్చింది. అలా తోటలో కూర్చొని తీరిగ్గా చెప్తా. నిశ్చలంగా నిర్మలంగా వినండి." కమలాదేవి బయటకు నడిచింది.

రామారావుకు ఏమీ అర్థం కాలేదు. ఎంతోమంది రోగుల జబ్బుల్ని డయాగనైజ్ చేయగలిగాడు. కానీ. :కానీ ఈ తన కమలారాణి మనః ప్రవృత్తి నిజస్వరూపాన్ని డయాగనైజ్ చెయ్యలేకుండా ఉన్నాడు. తను నిశ్చలంగా భారంగా అడుగులేస్తూ తోటలోనికి దారితీసే కమలాదేవిని వెంబడించ డంతప్ప ఏమీ చేయలేకపోయాడు రామారావు.

"ఊఁ. కానీ" జాజిమల్లె ప్రక్కన పచ్చికలో కమలా దేవి వడిలో ఒరుగుతూ అన్నాడు రామారావు.

"ఇక వినండి. మధ్యలో సందేహాలు అవి అని నివేదించ కండి. తెలిసిందా డాక్టరుగారూ!" ఆమె, వదనం అంతట్లో వేయివేల జాజిమల్లెల శోభతో జిగేల్‌మన్నది. తిరిగి ముఖం గంభీరం అయింది. ఆమె వదనం ఏదో అవ్యక్తమైన ఊహా తీతమైన ఆలోచనల వలయంలో చిక్కుకుపోయింది.

"నా చిన్నప్పటిమాట - మాకు బాగా తెలిసిన కుటుంబం ఉండేదండీ" గంభీరంగా మొదలెట్టింది కమల

"తండ్రీ కూతురూనూ-అమ్మాయి తల్లి చిన్నప్పుడే పోయిందట. తల్లిలేని బిడ్డగావటంతో పాపం ఆయనే అమ్మా యిని అమితమైన గారాబంతో పెంచాడు. ఆ రోజుల్లో ఆ అమ్మాయి ఫోర్తుఫారంకూడా చదువుకొంటూ ఉండేదని గుర్తు. ఆడపిల్ల ఎదుగుతున్నకొద్దీ భారమేకదా! సంబంధా లొచ్చినై. వీళ్ళుచాలాబీదవాళ్ళు. కట్నాలు గుప్పించి వరుడిని కొనుక్కోలేరు. వారింటిపక్కనే వాళ్ళకు బాగా పరిచయ మున్న ఎక్కడో దూరపు బంధురికంకూడా ఉన్న కుటుంబం కూడా ఉండేది. ఎలాగో వారిసంబంధంఖాయమైంది. తర్వాత వివాహం జరిగిపోయింది." దీర్ఘంగా నిట్టూర్చింది కమలా దేవి ఎదుట వెన్నెట్లో తెల్లగా తెల్లబోయే అనంతంలోకి చూస్తూ.

రామారావు ఆమె ముఖంలోకి చూస్తూ తదేకంగా వింటున్నాడు. ఆమె చెప్పే బాధల గాధను.

"ఎలాగో అలా వివాహమయితే ఖాయపరిచారుగానీ, ఆ వివాహం ఖరారు గావడానికి వెనుక ఎంత కథ నడచిందో ముఖ్యం. పిల్లాడికికూడా తల్లీ-దండ్రి లేరు. ఒక్క అన్నయ్యా

మాత్రం ఉండేవాడు. చిన్నప్పటినుండి ఆయన పెంపకంలోనే పైకివచ్చాడు ఆ అబ్బాయి. మొదటి పెళ్ళిచూపుల తర్వాతే నాకీ పెళ్ళివద్దు అని ఖచ్చితంగా చెప్పేశాడుట. కానీ ఆ అన్న గార్కి మాత్రం ఈ సంబంధంమీద ఎక్కువ ఇష్టం ఉండడం చేత చిన్నవాడు అట్లాగే అంటాడులే! చిన్నప్పటి నుంచి పెంచానుకదా! అంత నాకు స్వతంత్రం అధికారం లేవా ఏమిటి? అలాగే ఒప్పుకుంటాడులే! అని ఆ పిల్లాడిమీద అమితమైన భరోసాతో అంతాఖాయంచేసి ముహూర్తం పెట్టించాడు. ఆ సంబంధం మీదే ఆయనకు ఎక్కువచూపు ఉండడం ఆ రెండు కుటుంబాలకు మొదటినుండి వచ్చే సాన్నిహిత్యం, స్నేహమే కాలనా లనుకొంటాను. అంతకన్నా మరేమీలేదు.

అంతా జరిగిపోయింది. నే చెప్పలేదా? మా తమ్ముడు ఒప్పుకొంటాడు అని తృప్తిగా గాలి పీల్చాడు ఆ పిచ్చి మనిషి.

కాని ఆ పిల్లాడు మాత్రం పైకి అన్నగార్కి భయపడి మెదలకుండా వూరుకొన్నాడేగాని లోలోపల తను కాదన్నది జరిగిందని తెగ ఉడికిపోతున్నాడు.

కొందరి మనస్తత్వాలు అలాగే వుంటాయి. అంత రాంతరాళాల్లో స్వతంత్రమైన అభిప్రాయాలూ, ఆశయాలూ వున్నా పెద్దవాళ్ళ యెడ గౌరవం మూలంగా నైతేనేమిటి లేక భయంవల్లనయితేనేమిటి, ధైర్యంతో మనసులోని మాటను ఎదురు తిరిగి చెప్పలేరు. అలాంటివారు చివరకి నెంతకు తెగి స్తారో వారిఆలోచనలు ఎంతవరకు వెళ్తాయోకూడా చెప్పడం కష్టం. కాలమే తెలియ పరుస్తుంది.

ముందు ముందు ఆ వివాహపు పర్యవసానం యెలా వుంటుందో ఎవ్వరూ ఊహించలేకపోయారు. తర్వాత కాలమే చక్కటి గుణపాఠం చెప్పింది ఉభయులకీ

తర్వాత శోభనం ఏర్పాటు చేశారు. ఆ రాత్రి పెళ్ళి కొడుకు పరారీ అయ్యాడు. అంతా ఘొల్లుమన్నారు. ఆనాడు గాని తెలిసిరాలేదు. ఆ పిచ్చి అన్నగార్కి తన తమ్ముడికి తనమీద ఎంతవరకు గౌరవమున్నదీనీ - ఆ అమ్మాయి బాధ సరేసరి. లోలోపల కుమిలిపోయింది.

కొన్నాళ్ళకు ఆ అబ్బాయి తిరిగివచ్చాడు. అన్నగారు ఎంతో చెప్పి చూశారు కాని లాభం లేకపోయింది. నయానా భయానా లొంగలేదు. అడ్డమైన తిట్లూతిట్టాడు. నానా రభసా జరిగింది. కాని తాను ఏలుకోనన్నాడు అమ్మాయిని.

ఆ అన్నగారు ఎంతో బాధపడ్డాడు అన్యాయంగా ఒక ఆడపిల్ల గొంతుక కోసేసానని

ఈ ఆడపిల్లవారికి పరిస్థితి అయోమయం అయిపోయింది కొన్నాళ్ళు ఓపికతో చూసారు పరిస్థితి చక్కపడుతుందేమోనని. కాని లాభంలేకపోయింది. కోర్టుకు వెళ్దామంటే తిరిగే ఓపికా, వాళ్ళకు పొయ్యడానికి డబ్బూ, రెండూ పుష్కలంగా లేవు. వాళ్ళకు మెదలకుండా ఊరుకోవడంతప్ప చేయగలిగిందేమీ లేకపోయింది. వారి బ్రతుకు నలుగురిలో నగుబాట్ల పాలయింది.

కాలపు యవనిక ఆ సంఘటనను మరుగు పరచేసింది. ఆ అమ్మాయి అమితమైన అనుభవం సంపాదించింది. మళ్ళ లాయన యిన్నాళ్ళూ తన ఒక్కకూతురు గతి ఇలా అయిందే

నసీ క్రుళ్ళి క్రుళ్ళి కృశించిపోయాడు. ఆ ఆమ్మాయికిన్ని అను భవాలు సంపాదించిపెట్టి తానో బోలెడు అనుభవాలు సంపాదించుకొని ఇక ఇవి చాలని, ఆ అమ్మాయిని అనుభవాల పాలుచేసి, కన్నుమూసాడు ఆ ముసలాయన.

మొదట కష్టాలపాలు చేసినా, భగవంతుడు వారికి ఏదో మరి ఒకదారి చూపించక పోడు. కష్టాలున్నచోట సాను భూతి వాక్యాలు ఉండనే ఉంటయ్. తిరిగి ఆ అమ్మాయి చదువులో ప్రవేశించింది. వీరి వారి సహాయంతో చదివి పైకి వచ్చింది. ఆ ఊరినుండి దూరంగా వచ్చేసిందా అమ్మాయి.

అక్కడ అతను యింకోపెళ్ళి చేసుకొన్నాడు పిల్లలు కూడాను.'' యింక చెప్పలేకపోయింది కమలాదేవి.

"అతను ఎక్కడున్నాడు కమలా? ఏం చేస్తున్నాడు? ఎవరూ?''అంటూ ఆతృతగా లేచి కూర్చున్నాడు రామారావు. అగ్నిగుండాలే అయినవి కమలాదేవి నేత్రాలు.

రామారావు ఆంత్రంగా చూస్తున్నాడు.

"ఇందాక మీరు ఆపరేషన్ చేసిన మనిషే'' అన్నది డాక్టర్ కమలాదేవి దీర్ఘంగా నిట్టూరుస్తూ.

ఈ విషయమే జ్ఞాపకాని కొచ్చింది. నాకు అతన్ని చూడగానే. ఆ అమ్మాయికి జరిగిన అన్యాయం తలుచుకొంటూంటే నాకు ఏడుపు ఆగింది కాదు. అప్పుడు ఆ అమ్మాయికి న్యాయం జరగాలంటే ధనం మూలం అయింది. డబ్బుకు, న్యాయానికి లంకె. డబ్బు లేకపోతే న్యాయమూ లేదన్న మాటే.''

రామారావు ఆమె వాక్ప్రవాహానికి అడ్డొచ్చాడు.

"అయితే పాపం ఆ అమ్మాయి ఎక్కడ ఉన్నది? కమలారాణి" అన్నాడు లోలోపల తన కమల హృదయం ఎంత సున్నితమో, ఎంత మార్ధవమో తలుచుకొని జాలి పడ్తూ.

కమలాదేవి రామారావు ముఖంలోకి సూటిగా చూసింది ఆమె నయనాలు దట్టమైన జలాధారాల్లా మాట్లా డితే వర్షించేలా ఉన్నాయి. ఆమె మనో అంతరాళాల్లో ఘోర సంచలనం చెలరేగుతున్నది. తాను వివరించిన బాధలు గాధ నిజ స్వరూపాన్ని బయటపెట్టడమా లేక ఎలాగో అలా తప్పించుకొని దూరంగా ఉంచటమా అనే సందిగ్ధంలో ఆమె గొట్టుమిట్టాడింది.

ఒకవేళ అసలు సత్యం తెలిస్తే ఈయన మనోనిగ్రహం ఎలా ఉంటుందో! పర్యవసానం సంసారంలో ఎన్ని తుఫాను లకు, ఎన్ని అగ్ని జ్వాలలకు, నాందీప్రస్తావనము అవుతుందో!

ఆ సందిగ్ధంలో భర్తవదనంలోకి తదేకంగా చూసింది కమల. అతని ముఖకళికలు భావసంచలనం నయనాల్లోనే చది వేసిందామె. చివరికు గుండె దిటవు చేసుకొని ఎంతో నిబ్బ రంతో చెప్పింది.

"ఆ అభాగ్యురాలు మీ కమలారాణియే! క్షమించండి" అంటూ రామారావు హృదయంలో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. డాక్టర్ కమలాదేవి ఆమె నయనాలు ఒక్క

మడ్మిగా వర్షించినై. ఆ కన్నీటితో గత సంఘటనల స్మృతులు అన్నీ ప్రక్షాళితమై పోయినై.

రామారావు ప్రేమతో ఆమెను తన హృదయంలో యిముడ్చుకొన్నాడు. అతని కళ్ళు అశ్రుపూరితా లయినవి.

“యింతేనా! దీనికేనా ప్రొద్దుననుండి బాధపడుతున్నది.” కమలాదేవి ముత్యాల్లాంటి అశ్రువుల్ని తుడుస్తూ అన్నాడు రామారావు. “నువ్వు అలాగుంటే బాగుండదు కమలారాణీ! నవ్వాలి! ఊ! నవ్వు వన్, టూ, త్రి, రెడీ!”

కమలాదేవి వదనం సంతృప్తికరమైన నవ్వుతో నిండుగ కనిపించింది. ఆమె నవ్వులో కోటి జాతి మల్లెల శోభ ప్రతిఫలించింది. తెల్లని వెన్నెట్లో ప్రక్కనే జాజి పందిరి మీద మల్లెలు కూడా ఆమె నిండయిన నవ్వుతో తెల్లబోయినయ్.



# నిష్కృతి

అయిదేళ్ళ తరువాత పద్మ జ్ఞాపకం వచ్చింది తనకు.

"పద్మ ఏం చేస్తూ ఉంటుందో! పిచ్చితల్లి!" నిండు అయిదేళ్ళయింది దానిని చూసి. ఇంతకాలం తన ప్రాణంతో సమంగా చూచుకొని పెంచిన తన చిట్టితల్లిని వదలిపెట్టి ఎలా వుండగలిగాడు తను!...అబ్బ! తనలో లేశమంతైనా మమత, మానవత్వము ఉన్నయ్యా! ఉన్నట్లయితే ఇలా కన్నకూతుర్ని బాధపెట్టి దానితో పగ బెట్టుకొనేవాడే కాదు.

పద్మ మనసు ఎంత తల్లడిల్లి ఉంటుంది? తను తొందర పడ్డాడు. అప్పుడు తన హృదయం అంత వజ్ర కఠోరం కావా ల్సిన అవసరం లేదు నిజంగా ఆలోచిస్తే...కాని ఏం చేస్తాడు తను? ఆ ఒకే ఒక కారణం...పద్మను నా నుండి దూరంగా నెట్టేసింది.

నా జీవితాశయాల మాలలు నా మనస్సులోని కోరికల మధుర భావాలు పటాపంచలై శూన్యంలో లయించినపుడు - ఉద్భవించిన ఉద్రేకమూ కోపమే పద్మకు - నాకు అడ్డు గోడ లయి నిల్చినయ్. ఫలితం...పద్మను యింటి నుండి వెళ్ళ గొట్టాను.

నాలో జ్వలించిన ఉద్రేకము, కోపాల వేడిమి చల్లారు తోంది యిప్పుడిప్పుడే. నేను చేసిన తప్పిదం గ్రహిస్తున్నాను పశ్చాత్తాపడుతున్నాను. కాని ఏం లాభం? పొరపాట్లు జరిగిన

తరువాత గాని జ్ఞానోదయం కలుగదుమరి! ...నాపద్మకు తీరని అన్యాయం చేశాను. అయిదేళ్ళ తరువాత పద్మే ఉత్తరం వ్రాసింది. నామీద ఎంత ప్రేమ వుంటే తను చేసిన అన్యాయాన్ని, తను పెట్టిన బాధను మరచిపోయి నిర్మలమైన ప్రేమతో యిలా వుత్తరం వ్రాస్తుంది! నేనంటే ఎంత ఆపేక్షో!

చేతిలో పద్మఉత్తరం గాలికి రెపరెపలాడుతూ తప్పించుకొని స్వేచ్ఛావిహారం చేయాలని ఉబలాట పడుతున్నది.

ఆ ఉత్తరం చూస్తుంటే గతించిన విషాద సంఘటనల స్మృతులతో హృదయం నిర్వేదావృతమై భారమవుతోంది. మళ్ళీ చదువుకొన్నాను.

"నాన్నా! మా నమస్కృతులు!

మీకు నేను తీరని బాధ కలుగజేశానని బాగా తెలుసు కానీ చిన్నప్పటినుంచి మీ స్వహస్తాలతో పెంచిన ఈపద్మను క్షమించలేరా నానా?

ఐదు సంవత్సరాల దీర్ఘకాలానంతరం నాపై మీకు కొంచమయినా వాత్సల్యం ఉండకపోదనే ఆశాలేశంతో ఈ ఉత్తరం వ్రాయడానికి సాహసించాను. నా ఆశ అడియాసేనని తెలిస్తే మాత్రం నా అంత దురదృష్టవంతురాలు ఈ ప్రపంచంలో ఉండదు.

అయినా నేను మీ యిద్దరు మనుమలు కులాసాగానే ఉన్నాం. ఆయన నిజంగా చాల మంచివారు నాన్న. నేనంటే అమితమైన ప్రేమ వారికి.

పిల్లలకు అప్పుడప్పుడూ చెప్తూ ఉంటాను. 'మీకు ఒక తాతయ్య ఉన్నాడురా!' అని. చిన్నవాడికి ఇంకా ఏమీ తెలియదు. బోసినవ్వుతో నవ్వడం తప్ప. పెద్దవాడు మాత్రం 'తాతయ్య ఏడీ, ఎక్కడున్నాడూ!' అని నన్ను వేధిస్తూంటాడు. ఆ ప్రశ్నకు నేనేమి జవాబు చెప్పేది? లోలోపల బాధపడడం తప్ప నేనేమి చెయ్యగలను? వాళ్ళకి నిన్ను చూడాలని ఉన్నది నాన్నా!

ఆయననూ, నన్నూ హృదయ పూర్వకంగా క్షమించ గలిగితే ఒకసారి ఇక్కడకు వచ్చిపోండి. వారుకూడా మిమ్మల్ని రమ్మనమని వ్రాయమన్నారు. ఇక పిల్లలు సరేసరి. 'తాతయ్య వస్తున్నార్రా' అని చెప్తూంటే పెద్దవాడి ఆనందానికి అవధుల్లేవు. మీ కోసం ఎదురుచూస్తూ ఉంటాము.

మీ అమ్మాయి,
పద్మ."

కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై ... భారంగా నిట్టూర్చాను.

నోట్లో లంక పొగాకుచుట్ట నానిపోయింది. చివరలు కొరికి తిరిగి నోట్లో పెట్టుకొన్నాను చుట్ట. ఎదుట చిన్నచిన్న మేఘాల్ని సృష్టిస్తోంది. చిన్న గాలి వీచింది. పొగ చల్లా చెదురైంది.

నాకూ ఇప్పుడు ఇద్దరు మనుమళ్ళన్నమాట. ఇక ఏ మాత్రం ఆలస్యం చేయకూడదు. ఇప్పటికే నా తల్లికి అన్యాయంచేశాను. పద్మ దగ్గరకువెళ్ళి 'ఈ పాపిష్టి నాన్నని, ముసలివాణ్ణి క్షమించుతల్లీ' అని వేడుకొంటాను. తప్పకుండా క్షమి

స్తుంది. మనుమలతో ఆడుకొంటూ ఈ శేష జీవితాన్ని గడి పేస్తాను. చిన్న మనుమడి బోసినవ్వులతో తన బోసినవ్వుల్ని కలపి నవ్వుతూ సంతోషంతో గడిపుతూంటే ఇంకా నాకు ఏంగావాలి...

అయిదేళ్ళ క్రితమే నాకీ జ్ఞానమున్నట్లయితే పరిస్థితి ఇంతవరకు వచ్చేదికాదు. నా తల్లిని ఇంత నొప్పించేవాణ్ణి కాదు.

అదిమాత్రం పెద్దతప్పే చేసింది. తను క్షమించ లేనంత తప్పిదం ఏమీకాదు.

అప్పుడు పద్మ కాలేజీలో బి. ఏ ఫైనల్ చదువు తుండేది. చిన్నప్పటినుండీ అల్లారుముద్దుగా పెంచాను పద్మను. పద్మ నా ప్రాణంకంటె మిన్న. నా కన్నతల్లి మనస్సు మృదు త్వంలో వెన్న. దానికి ఏలోటూ లేకుండా చూచుకొంటూ పెంచాను. అది పుట్టగానే నా సుజాత కన్నుమూసింది. పద్మని అన్నీ నా సుజాత పోలికలే. ఇంకో విధంగా చెప్పా లంటే సుజాతకు పరిపూర్ణ ప్రతిరూపం పద్మ. అప్పటినుండి నేనే తల్లీ, తండ్రీ అయినాను పద్మకు.

దానిని బాగా చదివించాలని ఒక మంచి అయ్య చేతిలోపెట్టి తృప్తిగా జీవితశేషాన్ని గడిపి కన్నుమూయాలని నా ఆశయం.

నా ఆశలూ, ఆశయాలూ సమూలంగా నాశనం గావ డానికి కారణం చివరికి పద్మే అయింది.

•

ఆ రోజు నేను బజార్లో ఏదో పనిఉంటే చూచుకొని వస్తున్నాను. పద్మ కాలేజీనుండివచ్చి ఉంటుంది. నా కోసరం ఎదురుచూస్తూ ఉండవచ్చునని త్వరగా అడుగులువేస్తున్నాను.

తన ఆత్రుత అణగిపోయింది. ఒకానొక దృశ్యం. తన చలనాన్ని స్తంభింపజేసింది. తను ఆపాదమస్తకం కోపంతో కంపించిపోయాడు.

ప్రక్కన పార్కు. పార్కులో పద్మ మరో యువకుడు చేతులు–చేతులు కలిపి కేరింతలుకొట్టూ హుషారుగా నడుస్తున్నారు.

ఇదేనా పద్మ చదివేది? ఇలాంటి పద్మనే తను భవిష్యత్తులో చూద్దా మనుకొన్నదీ?

ఊరుకోగూడదు ... పద్మను దండించాలి. నారయి వంగనిది ప్రమానయి వంగడం కష్టం. నా ఆశయాలు మృగతృష్ణ చందంగా దూరాననే ఉండిపో గూడదు. నా కలలు కల్లలు గావడం నేను ససేమిరా సహించను. పద్మను చివాట్లు పెట్టాలి.

కోపంతో యింటికి చేరాను ఆవేశాన్ని అణచుకొని.

పద్మ వచ్చింది నేను జేసిన గంటకు. మామూలుగా నవ్వుతూ. ఏదో మాట్లాడబోయింది. నా దగ్గరకు వస్తూనే నా ముఖ తీవ్రత కనిపెట్టి జంకింది. తన గదిలోకి పోబోయింది.

"ఆగు! ఇటురా!"

పద్మ వచ్చింది. "ఎవరా అబ్బాయి?" పద్మ క్షణం కాలం నివ్వెరపోయింది

"ఊఁ! చూస్తావేం అలా? చెప్పు ఆ అబ్బాయిఎవరో!"

పద్మ తేరుకొన్నది. నేనెప్పుడూ కోప్పడలేదు దానిని. భయపడ్డది.

"నాతో చదువుతున్నారు. శ్రీధర్ అని. చాలా మంచివారు."

"చదువుకొని బాగుపడదలుచుకొన్న దానివి వాడితో ఏమిటీ తిరుగుళ్లు?"

"నాన్నా!"

"వాడితోయింకోసారి కనుపిస్తే... ఊరుకొనేదే లేదు."

"నేనాయన్ని ప్రేమించాను."

పద్మ ధైర్యానికి ఆశ్చర్యపడ్డాను.

"ఎన్నాళ్ళనుండి ఈ వరస? సిగ్గులేదూ? ప్రేమించిందట! యిదేనా నీవు చదివేదీ? పెద్ద చదువులు వెలగబెట్టి... నీ భవిష్యత్తును చూచి ఎంత మురిసిపోదా మనుకున్నానో? ఏమాత్రం వీలులేదు. వాడితో కలవడం మానెయ్యాలి."

"దయచేసి వారిని నీచంగా అనకండి. ఆయన చాలా మంచివారు, తెలివయినవారు."

"ఏం నాకే పాఠాలు నేర్పుతున్నావా? అయినా వాడు నీకేమవుతాడు? వెనకేసుకొస్తున్నావ్..."

"నేనాయన్ని ప్రేమించాను. ఇద్దరం పెళ్ళిచేసుకొంటాము. మీ ఆశీర్వాదం ఉండాలి. ఆయన మీ కాబోయే అల్లుడు."

నాలో కోపం ప్రచండ రూపం దాల్చింది. ఉద్రేకం ఉచ్ఛస్థాయిలో ఉబికి వచ్చింది. ఆగలేకపోయాను. పద్మ

చెంప చెళ్ళు మన్నది. దానిని చేయి చేసుకోవడం...అది పుట్టిన తరువాత అదే మొదటిసారి. అటువంటి పరిస్థితి కలగ డానికి అదే కారకురాలు.

"నాదే బుద్ధితక్కువ అయింది. నిన్ను బాగా చదివించి, నీ ఉజ్వలమైన భవిష్యత్తును చూచి ఆనందిద్దామని పిచ్చికలలు కనడం నా తెలివితక్కువ కాకపోతే మరేమిటి? ఆ అనామకుణ్ణే కనుక కట్టుకొనేటట్లయితే ఇక నీకూ నాకూ ఎటువంటి సంబాధం ఉండబోదు. గుర్తుంచుకో. తెలివి తెచ్చుకొని ప్రవర్తించు!" నా గదిలోకి వెళ్ళిపోయాను.

పద్మ ఏడుస్తోంది. వెక్కిళ్ళు నా గదిలోకి స్పష్టంగా వినబడుతున్నాయ్!

లోకం అప్పుడే చీకట్లు పులుముకొంటున్నది. ఆకాశంలో అక్కడక్కడా మేఘాలు కదులులాడుతున్నాయ్! కిటికీలోనుండి చల్లని గాలివచ్చి నన్ను ఈ లోకంలోకి తీసికొచ్చింది. ఆకాశంలో ఒక్క తటిల్లత తళుక్కుమన్నది.

పద్మను చేయిచేసుకొని అలా వచ్చేశానేగాని, చాల బాధపడ్డాను. సౌమ్యంగా చెప్పి మనసు మళ్ళించవలసింది. కాని కాలం కదలిపోయింది. విచక్షణాజ్ఞానం శూన్యమై ఉద్రేకము సౌమ్యాన్ని గెలిచింది. ఏం లాభం!

వారం యాంత్రికంగా భారంగా గడిచింది పద్మకూ, నాకూ. ఈ వారంరోజులూ మూగగా మూభావంగా గడచిపోయిందనే చెప్పాలి.

ఆ సంఘటన జరిగిన ఎన్ని రోజులకో సరిగ్గా జ్ఞాపకం లేదు. కాని ఒకరోజు మధ్యాహ్నం పద్మ ఇంటికి వచ్చింది.

సాయంత్రంవరకూ రానిది కాలేజీనుండి సగంలో ఎలా వచ్చే సిందా అని అనుకొన్నాను. వెనుక శ్రీధర్ వచ్చాడు. కోపం వచ్చింది. పద్మ నామాట పెడచెవిని పెట్టింది. శ్రీధర్ కూడ రావడం, ఎందుకో నాకు బోధపడలేదు. ఇంతలో పద్మ వచ్చింది. 'మమ్మల్ని ఆశీర్వదించండి నాన్నా! శ్రీధర్ మీా అల్లుడు యిప్పుడు!'

అంతా అయోమయంగా ఉంది! తల తిరిగిపోయింది. పద్మ పమిటెచాటున మంగళప్రధమైన తాళిబొట్టు తొంగి చూస్తూ వెక్కిరిస్తోంది. పద్మ ఇంత తెగిస్తుందని కలలోకూడ నేను అనుకోలేదు. నాలో కోపం తారాపథాన్ని అంటు కొంటూంది. వున్నపళాన పద్మను పిసికి చంపిపారేద్దామను కొన్నంత ఉన్మత్తత ఆవరించింది. నా ఈ చేష్టలన్నింటికి కారణం ఉన్నది. అవును, నా కలల్ని కల్లలుచేసిన ఈ పాపిష్టి దాన్ని అంతంచేయాలి. తమాయించుకొన్నాను.

నా ఆశయాలు, ఆశలు పేకమేడల రీతి పతనమై నాయనే దుఃఖం నా హృదయంలో లావాలా జ్వలిస్తూంటే పద్మా! అని యిల్లు దద్దరిల్లేటట్లు అరచాను.

"ఛీ! వెళ్ళిపోండి. ఒక్క నిముషం ఈ గడపలో ఉండ డానికి వీలులేదు."

"నాన్నా! నేను చెప్పేది నెమ్మదిగా వినండి."

"ఛీ! పాపిష్టిదానా! నువ్వు నా కూతురివి కానేకాదు. అసలు పిల్లలు లేరనుకొంటాను. లేకపోతే పద్మ చచ్చిపోయిం దనుకొంటాను. వెళ్ళండి. నాకళ్ళ ముందునుండి వెళ్ళిపోండి.

నేనేమీ మాట్లాడ దలచుకోలేదు. నాకు కోపం తెప్పిస్తే మని షిని కాను!''

''మీరు అనేటంత మహాపాపం నేనేమీ చేయ లేదు నాన్నా! మమ్మల్ని మీ అమృత హస్తాలతో ఆశీర్వదిం చండి''

''ఛీ! వెళ్ళండి... మీరు నాకు యిక ముఖం చూపించ వద్దు. ఏనాడయితే నా మాటను కాదని నీ ఇష్టానుసారం ప్రవర్తించావో అప్పుడే నీకూ నాకూ సంబంధ బంధం తెగి పోయింది. ఇక ఈ జన్మలో ఈ యింటి గడప ఎక్కితే చంపే స్తాను ఊఁ! వెళ్ళండి ''బలవంతాన వాళ్ళిద్దర్నీ వెళ్ళగొట్టాను. వాళ్ళు వెళ్ళిపోయూరు. తరువాత ఆప్యూరే వదలివేశారు. నా మనస్సు వికలమైపోయింది. తీరనిఅశాంతి చెలరేగింది. రోజుల తరబడి ఇంట్లోనే అన్యమనస్కంగా, విచారంగా గడిపేవాడ్ని.

ఎన్ని అవరోధాలు ఏర్పడినా ప్రపంచంలో ఎన్ని పరి ణామాలు జరుగుతున్నా కాలగమనానికి మాత్రం అవరోధం కలుగదు. కాలచక్రపు టిరుసు ఐదుచుట్లు గిర్రున తిరిగింది నిండు అయిదేళ్ళు యివాల్టికి - నా పద్మ క్షేమం తెలిసింది. పద్మ దగ్గరకు వెళ్ళాలి... క్షమాపణ కోరాలి. ఇవాళే ఉత్తరం వ్రాస్తాను. బయలుదేరి వస్తున్నాను తల్లీ! అని.

* * * * *

నాన్న వుత్తరం వ్రాశారు బయలుదేరి వస్తున్నానని. నాన్నకు నా మీద కోపం పోయింది. నాన్న మాత్రం ఏం

చేస్తారు? వృద్ధాప్యంలో అనుకోనివి జరిగితే! ఆ గ్రహంవస్తుంది యదార్థం. ఎన్నాళ్ళో అయింది నాన్నను చూసి. ఈ అయిదేళ్ళూ భోజనానికి చేయి కాల్చుకోవడమే కదా! పాపం చిక్కిపోయివుంటారు!

ఆయన లేరు. ఆఫీసుపనిమీద వారంరోజులు టూర్ వెళ్ళారు. ఆయనకూడ నాన్న వచ్చేవేళ్టికి ఇంట్లో ఉంటే చాల బాగుండేది.

"ఒరేయ్ బాబ్జీ! తాతయ్య రేపు వస్తున్నార్రా!"

"తాతయ్య వత్తున్నాలా? ఇదివరకు ఎందుకు లాలేదూ? ఎక్కడలున్నాలూ?" అమాయకంగా ప్రశ్నించాడు బాబ్జీ.

నా కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. వాడు వేసిన ప్రశ్నకు వెలిబుచ్చిన సందేహానికి.

ఏం తోచడందులే–నాన్న వస్తున్నారనే సంతోషంతో ఏ పనీపాటా సాగడంలేదు. ఒకటే ఆనందం. రేపు ప్రొద్దున్నే వస్తారు నాన్న. బహుశః ఎలా ఉన్నారో!

రాత్రి నిద్ర పట్టలేదు. మితిమీరిన సంతోషంలో నిద్ర భోజనాలు అత్యల్ప సమస్యలు.

బాబ్జీతో తాతయ్య గురించి ముచ్చట్లు.

బాబ్జీకి నీళ్ళుపోసి బట్టలు వేస్తున్నాను. "అమ్మాయ్! ఎవరే అక్కడ!"

అదుగో నాన్న గొంతుకే. ఎన్నాళ్టికి విన్నాను.

నాన్నను చూస్తూనే కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై. ఆయనకుకూడ దుఃఖం పెల్లుబికి వచ్చింది.

నాన్నా! అంటు ఆయన హృదయంలో యిమిడి పోయాను. దుఃఖం, సంతోషం మిళితంకాగా అమృత హస్తాలతో తలను ప్రేమతో నిమిరారు.

"ఛీ! తప్పు పిచ్చితల్లీ! ఏడుపా? ఎందుకమ్మా?"

"నన్ను క్షమించాలి నాన్నా! నా మీద కోపం పోయిందా?"

"పాపిష్టివాడ్ని... నేనే నిన్ను బాధపెట్టాను తల్లీ!... నన్ను నువ్వే క్షమించాలి. శ్రీధర్ ఏరీ?"

"తాతయ్యా! వచ్చావా" అంటూ బాబ్జీ పరుగెత్తుకొచ్చాడు.

"ఒరేయ్ వచ్చావుట్రా! నేను తాతయ్యనని ఎలా తెలుసురా? ఓరిభడవా!"

నాన్న వాడిని ఎత్తుకొని ముద్దులతో వాడి రెండు బుగ్గల్నీ తడిపివేశారు.

"తాతయ్యా! మరే అమ్మ ఎందుకో ఏలుస్తోందీ?"

"ఏం లేదు నాన్నా! అమ్మ బుజ్జిపాప కదూ! అందుకనీ ఏడుస్తోంది."

కళ్ళు తుడుచుకొన్నాను పమిట కొంగుతో. నాన్నకు స్నానానికి నీళ్ళుతోడి వంటలో నిమగ్నమైనాను శ్రీధర్ టూర్ కెళ్ళిన సంగతి చెప్పాను.

నాన్న చిక్కిపోయారు. తన మూలంగానే చాలబాధపడ్డారు. నాన్నకు మామీద కోపం పోయింది.

స్నానం చేసివచ్చి గదిలో చిన్నవాడితోనూ, బాబీతోనూ ఆడుతున్నారు. నాన్న వాళ్ళతోపాటు తను కూడా నవ్వుతున్నారు.

బాబీ కూడా ఒకటే అల్లరి. ఎన్నాళ్ళకో వచ్చిన తాతయ్య మరి! భుజాలు ఎక్కి తొక్కుతున్నాడు.

వాళ్ళు ఆడుకొంటున్న గదిలోకివెళ్ళాను. వారి ఆటను, లక్ష్యాన్ని భంగం చేశాను.

"అమ్మాయ్! బాబీ బహు గడుగ్గాయే. చిన్నిగాడు చూడు. బోసినవ్వులు. నా మాదిరిగానే" నాన్నకు ఆనందం ఆర్ణవమైంది.

అలమారాలో ఫొటోల ఆల్బమ్ యిస్తూ అన్నాను. "నావీ, పిల్లలివీ, ఆయనవీ ఫొటోలు ఉన్నయ్ నాన్నా. చూడండి. ఈ మొదటి ఫొటో నేనూ ఎరగను. మా అత్తగారుట. ఆయన చిన్నప్పుడే పోయారుట చూడండి. నాకు ప[ని] వున్నది కాస్త"అని చెప్పివచ్చి వంటలో నిమగ్నమైపోయాను నాన్నకు సుష్టుగా భోజనం పెట్టాలని తలపోస్తూ

*    *    *    *    *

అమ్మాయి ఆల్బమ్ యిచ్చి వెళ్ళిపోయింది. పద్మ నా రాకతో హడావుడిగా ఉంది. నాకోసం ఏవేవో చేస్తోంది. నాతల్లి.

బాబీ ఈ ముసలివాడితో కుస్తీ పట్టి పట్టి అలుపువచ్చి ఎటో వెళ్ళాడు.

అమ్మాయి యిచ్చిన ఆల్బమ్‌ను తిరగవేసాను.

అమ్మాయి అత్తగారు, శ్రీధర్ తల్లి.

తదేకంగా చూశాను.

చేతులు వణుకుతున్నాయ్. హృదయస్పందన లెక్కకు అందడంలేదు. కళ్ళు బైర్లు క్రమ్ముతున్నాయి. ఎవరో కాదు. ఇంత వార్ధక్యంలో కూడా జ్ఞానేంద్రియాలు కర్తవ్యాన్ని సక్రమంగానే నిర్వర్తించినయ్. అవును, ఎవరోకాదు. పార్వతి. అవును–పొరపాటు ఏమీ లేదు. నిజంగా పార్వతే.

ఎదురుగ్గా ఫోటోలు పార్వతి వికటాట్ట హాసం చేస్తూంది.

అవును ఆనాడు తను పిరికివాడై స్వార్థాన్ని చూచుకొని నట్టేట్లో ముంచివచ్చిన పార్వతే, సందేహంలేదు.

పార్వతీ! శ్రీధర్ తల్లీ. అమ్మాయి అత్తగారట. నాకు అన్నీ అవుతుంది. ఏమీకాదు.

ఆ రోజుల్లో మేము గుంటూర్లో ఉండేవాళ్ళం. నేను హిందూకాలేజీలో బి. కాం. చదువుతుండేవాణ్ణి. నాన్నగారు న్యాయవాదిగా ఉండేవారు. ఆయనకు ఆ రోజుల్లో లాయరుగా గొప్ప పేరుఉండేది. సంపాదించడంకూడ బాగానే సంపాదించారు. నే నొక్కడినే కొడుకునవడం మూలంగా చిన్నప్పటినుండి ఏలోటూలేకుండా అల్లారుముద్దుగా పెంచారు నన్ను.

నాన్నగార్కి నేనంటే అమితమైన ప్రేమ. నాన్నగారంటే ఒకవిధమైన గౌరవమూ, గౌరవంతోబాటు భయమూ ఉండేవి.

సూర్యం నా ప్రాణస్నేహితుడు. వాడూ నాతోటే హిందూ కాలేజీలో బికాం చదువుతుండేవాడు. వాళ్ళంతగా ఉన్నవాళ్ళు కాదు. నేనంటే ప్రాణం యిచ్చేవాడు. వాడికి తండ్రి చిన్నప్పుడెప్పుడో పోయాడు. తల్లి, ఒక చెల్లెలుండే వారు. ఉన్న ఒక్క-ఎకరం ఫలసాయంతో సూర్యాన్ని చదివి స్తోందామె. వాళ్ళ కుటుంబంకూడా ఒకానొక రోజుల్లో బాగా వెలిగినదే. వాళ్ళనాన్న ఉన్నరోజుల్లో బాగా అనుభ వించారు. కాని పోయేలోపల వీళ్లకి ఒక ఎకరం పొలంతప్ప ఏమీ మిగల్చలేకపోయాడు. ఆయన సంసారం యిప్పుడు బాగా చిదికిపోయింది.

సూర్యం నా ప్రాణస్నేహితుడు. వాడి చెల్లెలు పార్వతి సూర్యం ద్వారానే పార్వతి పరిచయం అయింది. స్కూల్‌ఫైనల్‌వరకూ చదివించారు పార్వతిని. స్తోమతలేక పైచదువుకు ప్రాకలేకపోయింది.

నేను అప్పుడప్పుడు సూర్యంతో వాళ్ళ యింటికి వెళు తూండేవాడ్ని. అప్పుడు పార్వతితో మాట్లాడే అవకాశం లభించేది. వున్నంతసేపూ పార్వతి చాలా చలాకీగా హుషా రుగా మాట్లాడేది. పార్వతి తెలివి తేటలతోబాటు, మంచి స్ఫురద్రూపి. ఆమె అందమూ, ఆమె తెలివీ నాకు తెలియ కుండానే నన్ను ఆకర్షించినయ్.

వాళ్ళ యింటిలో నాకు బాగా చనువు ఏర్పడింది. సూర్యం లేనప్పుడు కూడా వెళ్ళి పార్వతితో మాట్లాడివస్తూండే వాడిని. పార్వతివాళ్ళ అమ్మ కూడ నేనంటే అమితమయిన వాత్సల్యం కనబరచేవి.

పార్వతి రోజురోజుకూ నాకు దగ్గరవుతోంది. నాకు తెలియకుండానే ఆమె సాన్నిధ్యంలో గంటలు తరబడి గడచి పోయేవి. పార్వతి నాకు అతి ముఖ్య స్నేహితురాలయింది. ఆమెతో నేను చర్చించని విషయమంటూ లేదు.

పార్వతి నామీద ఏదో ఆశ పెట్టుకొన్నదని చూచాయగా గ్రహించాను. నేను కూడా పార్వతిని ప్రేమించానని తెలుసుకోవడానికి ఎంతోకాలం పట్టలేదు.

ఒక రోజున పార్వతిని అడిగాను నన్ను పెళ్ళి చేసుకోవడం నీకిష్టమేనా అని.

పార్వతి వదనంలో సిగ్గుదొంతరలు క్రమ్ముకున్నాయి. సిగ్గు నభినయించే ఆమె వదనం మరింత ఆకర్షణీయంగా కనబడింది నాలో. ప్రేమను ఉద్దీపింప చేసింది. పార్వతిని అక్కున చేర్చుకొన్నాను.

"చెప్పు పార్వతీ యిష్టమేనా నేనంటే?"

సిగ్గుతో ఇష్టమే నన్నట్లు తలపంకించింది. అన్నది: "మీ అంతస్తుకు సరితూగుతామా అని భయంగా ఉన్నది రామూ"

"నువ్వు నా ప్రాణం. నీకోసరం నేనేమయినా త్యాగం చెయ్యగలను. ప్రస్తుతం నాకా-వలసింది నీ అభిప్రాయం. నీకేగనుక నన్ను స్వీకరించడం యిష్టమయితే అన్నీ నేను అడుగుతాను. నాన్నగార్ని రేపే అడుగుతాను. నేనంటే ఆయనకు అమితమైన ప్రాణం. నీవు నిశ్చింతగా వుండు."

పార్వతి సమ్మతించింది. పార్వతికి వాగ్దానం చేశాను.

ఈ విషయం నాన్నకు ముఖాముఖి చెప్పడం బాగుండదని అమ్మ చెవిన వేశాను నాన్నకు చెప్పమని.

మొదటే నా ఆదర్శానికి అడ్డుతగిలింది అమ్మ. 'ఛా! పిచ్చిసన్యాసీ! వాళ్ళెక్కడ మనమెక్కడ: నాన్నగారు వింటే కోప్పడతారు. చెప్పను' అన్నదామె.

"పార్వతినితప్ప ఎవర్నీ పెళ్ళిచేసుకోను. తర్వాత మీ ఇష్టం" అన్నాను కోపంతో. వెళ్ళిపోయాను ఏదో పనిమీద.

ఆ రాత్రి నాన్న చెవిన వేసేవుంటుంది అమ్మ.

ప్రొద్దున కాలేజీకు తయారవుతున్నాను. 'నాన్న గారు పిలుస్తున్నార్రా అన్నాయ్' చెల్లి నాన్న హుకుంను అందజేసింది. నాన్నఅంటే నాకుభయం. జంకాను! కొంపదీసి అమ్మతో మాట్లాడిన విషయం తీయరుగదా!

వెళ్ళాను. నాన్నగారుకూడ ఆఫీసుకు తయారవు తున్నారు.

"పిలిచారుట" అన్నాను జంకుతూ. నేనే ప్రస్తావన తేవడానికి భయపడ్డాను.

"ఏమిట్రా రామూ! అమ్మతో ఏదో అన్నావుట!"

నోరు మెదపలేకపోయాను.

"చూడు బాబూ! ఏదో ఉద్రేకంలో అలాంటి ఉద్దే శ్యాలు కలగడం సహజమే. కాని మనం అన్నీ చూచు కోవాలి. మన అంతస్థెక్కడ-వాళ్ళ అంతస్థు ఎక్కడ. పార్వతిని నీవు పెళ్ళాడటం అసంభవం. నీ ఉద్దేశ్యాన్ని మార్చుకో."

నా మనస్సులో ఉద్రేకం పెల్లుబికి వస్తూంది. కాదు- పార్వతిని ప్రేమించాను. ఆమెనుతప్ప ఇంకెవ్వర్నీ నేను వివా హం చేసుకోలేను అని ఖచ్చితంగా చెబ్దామనుకొన్నాను.

కాని ఏమిటో నాన్నకు ఎదురు చెప్పలేకపోయాను. ధమనుల్లో వేడిరక్త ఉరకలు పెట్తోంది. కాని నాన్న ఉన్నారు ఎదుట. అప్రతిభుడనైపోయాను. ఆయనలో ఉన్న ఏదో అజ్ఞాతమైన శక్తి నన్ను నోరు మూసుకొనేటట్లు చేసింది. కాదు. నా పిచ్చి-నాలోని బలహీనతే అలా నన్ను చవటను చేసింది. పిరికివాణ్ణి-నాన్నకు ఎదురుచెప్పే ధైర్యంలేదు. కాని పార్వతికి వాగ్దానం చేశాను. ఆశలు రేకెత్తించాను.

నాన్న ఏవేవో చెప్పారు. మాటలు కొంచెం కరకు గానే ఉన్నయ్. నేనేగనుక నోరుమెదిపితే నాన్న వూరుకోరు. నాన్న సంగతి నాకు తెలుసు. ఎంత మంచో అంత చెడ్డ.

నాన్న మాట కాదనలేక వారు తెచ్చిన సంబంధం ఒప్పుకొన్నాను. సుజాతతో పెళ్ళయింది. పార్వతి ఏడ్చింది. పార్వతికి తీరని అన్యాయం చేశాను. ఆరోజుల్లోనే గనుక ధైర్యం ఉంటే పార్వతిని పోగొట్టుకొనేవాణ్ణే కాదు.

ధనిక నిర్ధనికాంతర ద్వేషాలు, మూర్ఖపు సిద్ధాంతాలు పార్వతిని నానుండి దూరంగా చేసినయ్. పార్వతిని మోసగించాను. పార్వతి హృదయం ఎంత క్షోభించిందో! పార్వతిఉసురు నన్ను బ్రతికున్నంతకాలం పీడిస్తుంది. ఆమహాపాపం నన్ను జన్మ జన్మలకూ వెంటాడుతూనే వుంటుంది. నిజం. నాకన్న పద్మే నయం. నేను చేయలేనిపని పద్మ చేసింది. పద్మకున్న ధైర్యం బుద్ధీ, జ్ఞానం నా కానాడు ఉంటే సమాజపు ఈ ధనిక, నిర్ధని కాంతర హైన్యపు సిద్ధాంత సృంఖలాలను ఛేదించి పార్వతిని చేరుకొనేవాడిని. తన శ్రీధర్ కోసం నన్నుఎదురించి తనకోర్కె తీర్చుకొన్నది పద్మ. నా పార్వతికోసం నాన్నను ఎదిరించి

నా కోర్కెను తీర్చుకోలేక పోయాను. నాలోని బలహీనత, స్వార్థం నన్ను అలాంటిపని చేయనివ్వక పోయాయి. పద్మ మంచిపనే చేసింది. పద్మేగనుక నా ఆంక్షలకు తలఒగ్గి నేచెప్పి నట్లు చేస్తే పార్వతి గతే అయేది దానికి. నా అంత స్వార్థ పరుడు ఈ లోకంలో లేడు. పార్వతి కూడ నిస్వార్థంతో నా కూతురును కోడలుగా చేసుకొన్నది. అందరూ నిస్వార్థపరులే. నేనే స్వార్థపరుడను. ప్రపంచంలోని స్వార్థానికంతటికీ ప్రతి రూపం నేను. నా కన్నా పద్మే లక్షరెట్లు నయం.

తరువాత నాన్నగారు రిటైరై పోయారు. వచ్చి హైద్రా బాదులో మకాం పెట్టాం మేమందరం. పార్వతి ఏమయిందో తెలియదు. ఇప్పటివరకూ నా పాపానికి నిష్కృతిలేదు.

తర్వాత పద్మ పుట్టింది. అమ్మా - నాన్నా కన్ను మూసారు కొద్దినెలల తేడాతో. పద్మకు సంవత్సరం నిండక ముందే సుజాత కూడ చనిపోయింది. ఇదంతా నా పార్వతిని ఏడిపించినందుకు ఫలితమే. నాకు శాస్తి జరిగింది.

ఎదురుగా ఫొటోలో పార్వతి దీనంగా, విషాదంగా చూస్తోంది.

ఎటుచూచినా కళ్ళకు పార్వతి రూపమే ప్రతిబింబి స్తోంది. 'ఫొటోలు చూస్తున్నావా తాతయ్యా. ఇదే నాయ నమ్మ ఫొటో' అంటున్నాడు బాబ్జీ. బాబ్జీ మొహంలోకూడ పార్వతిరూపం ప్రతిఫలిస్తోంది. ప్రక్కనున్న చిన్న నాయన నిద్రిస్తున్న మొహంలోకూడ పార్వతి. నాకు కనుపించే ప్రతి వస్తువులోనూ పార్వతే గోచరిస్తోంది. అంతా పార్వతిమయం.

తల తిరిగిపోతోంది కళ్ళు బైర్లు క్రమ్ముకుపోతు న్నాయి. మనసంతా గందరగోళంగా ఉన్నది. ఎటుచూసినా పార్వతి కనుపిస్తోంటే అక్కడ కూర్చోలేక యింటినుండి బయటకు వచ్చాను పరధ్యానంగా. ఎటో నడుస్తున్నాను రోడ్డు మీద. వెనుక పద్మ పిలుస్తోంది. 'నాన్నా! ఎండలో ఎక్కడకు వెళ్తున్నావ్!' అని.

రామయ్యపంతులు శరీరం తూలుతోంది. కాళ్లు తేలిపోతున్నాయ్. పరిసరాలు గమనించే పరిస్థితిలో లేడు రామయ్యపంతులు.

ఎదురుగా లారీవస్తోంది స్పీడుగా. రామయ్యపంతులుకు లారీ కనుపించడంలేదు. పార్వతి కనిపిస్తోంది.

రామయ్యపంతులు తప్పుకోలేదు. లారీకూడా తప్పుకోలేకపోయింది. లారీ పోవడానికి త్రోవలేదు.

లారీ డ్రైవర్ కాలిక్రింది ఆక్సిలేటర్ గిలగిల తన్నుకులాడింది.

చేతిలో స్టీరింగ్ ఊగిసలాడి పట్టుతప్పింది. స్పీడామీటార్ గుండె గిరగిర తిరిగిపోయింది.

లారీ ఇష్టంవచ్చినట్లు చిందులు త్రొక్కింది. రామయ్యపంతులు మత్తుగా ముందుకుపోయాడు. లారీకూడా మరీ ముందుకువచ్చింది.

లారీ రామయ్యపంతుల్ని చక్రాలక్రిందకు లాక్కొని కద్దరోదచేస్తూ మెలికలు తిరిగిపోయింది.

రామయ్యపంతులు ఆఖరి చూపులోకూడ పార్వతి దీనంగా లీలగా కనుపించింది.

•

# పతిత

తెల్లవారు ఝామున కాబోలు. మెలకువ వచ్చింది. లోకం సంతరించుకొన్న చిక్కటి చీకట్లు యింకా పలచబడ లేదు. పార్వతి పక్కచూచి ఉలిక్కిపడ్డాను. తలుపు బార్ల తెరచి ఉన్నది.

బయట కారుచీకటి. నిలువునా కంపించి పోయాను. మదిలో పిచ్చిపిచ్చి అనుమానాలు చిక్కగా అల్లుకుపోతు న్నయ్. 'పార్వతీ' అని కేకవేశాను. బయట వికటాట్టహాసం చేస్తున్న రక్కసిలాంటి చీకటికి భయపడి నా పిలుపు నాకే తిరిగివచ్చింది. కటిక చీకటిలాంటి నా మనస్సనీవాలాలో పార్వతిని గురించి అనుమానాలూ, భయం ఒక్కమ్మడిగా పైశాచిక నృత్యంచేస్తున్నాయి. గుండెల్లో దడ ఎక్కువైంది.

గుమ్మం దగ్గరకి వెళ్ళి మళ్ళీ పిలిచాను. గదిలో ఒంటరి తనం భయాన్ని ఎక్కువచేస్తోంది. నా కేకతో గది భోరుమని ప్రతిధ్వనించింది. ప్రక్క వీధిలో వీధికుక్క వికృతంగా అరు స్తూంది.

లోకమంతా చీకటిమయం. నా మనస్సు కూడా ఆ అంధకార బంధురమైన లోకానికి సాదృశంగానే ఉంది. ఆ లోకపు చీకట్లు కొన్ని క్షణాల్లో అదృశ్యమైపోతాయి. లోకం తిరిగి ఉషో రేఖల్తో దేదీప్యమానంగా భాసిస్తుంది. కాని ఈ నా మనస్సులో నా అంధకారావృత క్లిష్టమయ జీవితంలో వెలుగు కిరణాలు ప్రవేశించవు.

•

పార్వతి నన్ను వదలి వెళ్ళిపోయింది. ఏకాంతం నీరవ నిస్తబ్ధత భయాన్ని ఎక్కువ చేస్తున్నాయి. ధభేల్ మని తలుపు వేసి వెళ్ళి పక్కమీద పడ్డాను. దుఃఖం వెల్లుబికి వచ్చింది. నానికృష్టపు నిరామయ జీవితంలో ఘనీభవించిన విషాదం కరిగిపోయి వెల్లువలై పారేవరకూ తనివితీరా ఏడ్చాను.

చివరికి పార్వతి కూడ నన్ను నా జీవితాన్ని ద్వేషించింది. స్వంత కూతురు! దాని ఆసరాతో ఈ శేషజీవితాన్ని గడిపివేద్దామనుకున్న నా ఆశల్ని మంటగలిపి నన్నొంటరి దాన్ని చేసి పోయింది.

అసలు విధే నన్ను ద్వేషించింది. దుఃఖానికి మరో పేరూ, హైన్యానికి ఆమ్రెడితమూ నా జీవితం. నాకు అమ్మ చిన్నప్పుడే పోయింది. నా జీవితం యిలా శిథిలమవుతుందని ముందే తెలిసి, చూడడం యిష్టంలేక కన్నుమూసింది అమ్మ. అమ్మ ఉంటే నా కష్టాల్ని పంచుకొని కనీసం ఓదార్చడాని కన్నా ఒకరుండేవారు. ఆ భాగ్యం నాకు లేదు. అమ్మ నన్ను నాన్నకి వప్పజెప్పి శాశ్వతంగా మమ్మల్ని విడిచి వెళ్ళిపోయింది అమ్మా-నాన్నా చివరికి నాన్నే అయ్యారు. నాన్న నన్ను అతి గారాబంగా పెంచాడు. ఏలోటూ రానివ్వలేదు.

నాన్న పెట్టిన అతిగారాబంతో చదువుకు నాకు ఆమడ దూరం ఏర్పడింది. నాకు చదువు అబ్బలేదు.

వడివడిగా కొన్నేళ్ళు గతంలో లీనమైపోయినయ్. నాకు చదువు రాలేదు. కాని వయస్సు మాత్రం రాకుండా ఉండలేదు. వయస్సు వచ్చింది. నావయసుతోపాటు నాన్నకు భారమూ హెచ్చింది.

యిప్పుడనుకొంటున్నాను. నాన్న గారాబం పెట్టక పోతే బాగుండేదని. ఏ కొంచెం చదువుకొన్న ఈ హీన దశలో కొద్దో గొప్పో ఆసరాగా ఉండేది. కాని కాలం కదలి పోయింది. కదలిపోయిన కాలంలో చేసిన పొరపాట్లు స్మృతులుమాత్రం హృదయాన్ని రంపపుకోతకోస్తూ మిగిలి పోయినై.

బాల్యంలోనే గనుక భవిష్యజ్జీవితపు సుఖ దుఃఖాల పరిజ్ఞానం భగవంతుడిస్తే నాలాంటి అభాగినులు ఎంతోమంది బాగుపడేవారు ముందు జాగ్రత్త తీసికొని.

నాన్న సంబంధాలు వెతకడం ప్రారంభించాడు. కట్నంయిచ్చే స్తోమత మాకులేదు. నాన్న చివరికి మా ఊళ్ళోనే ఒక సంబంధం కుదిర్చారు కట్నాలు, కానుకలు ఏమీలేకుండా లాంఛనాలతో సరిపుచ్చుకోడానికి వప్పు కొన్నారు వాళ్ళు.

సీతాపతితో పెళ్ళయింది ఏమీ గొడవలు లేకుండానే సాఫీగా జరిగిపోయింది. పెళ్ళయి నెలకూడ తిరగలేదు. నాన్న బాధ్యత తీరిపోయింది. నన్ను ఒంటరిదాన్నిచేసి అమ్మ వెళ్ళిన దోవ వెళ్ళిపోయారు.

అమ్మా నాన్న ఎవ్వరూ నాకీ లోకంలో లేరు. అత్త వారు కొత్తవాళ్ళు. నాన్న పోయినరోజున నా స్థితిని తలచు కొని గుండె బ్రద్దలయేటట్లు రోదించాను. కాని లాభంలేదు. పోయినవాళ్ళు తిరిగిరారు. నేను ఒంటరిదాన్ని–అత్తవారింటికి వచ్చాను.

రోజులు గడచిపోయినై. కొత్తలో సీతాపతి బాగానే వుండేవాడు. రెండు మూడు నెలలు గడిచేటప్పటికి సీతాపతి అసలు రంగు బయటపడింది.

మానవుడు వూసరవెల్లి మాదిరిగా రంగులు మార్చ గలడు మరి. సీతాపతి యింటిపట్టున ఉండేవాడుకాదు. ఎప్పుడో అర్ధరాత్రి దాటిన తరువాత వచ్చేవాడు. సౌమ్యంగా మాట్లాడేవాడు కాడు. మాట్లాడితే కసరి కొట్టేవాడు. అత్తయ్య సీతాపతితోబాటు తన పూర్వప్రవర్తనకు స్వస్తి చెప్పి మారిపోయింది. ప్రతిదానికీ సాధిస్తుండేది. మామగారు రోగిష్టిమారివాడు. ఎప్పుడూ మంచంలోనే పడివుండేవాడు. ఆయన ఆయింటి వ్యవహారాలకు అతీతుడు. ఏమీ పట్టేది కాదు.

ఒకరోజున ఉండబట్టలేక అత్తయ్య నడిగాను. ఆయన ఎక్కడ కెళ్తున్నారని.

"మగవాడు ఎటన్నా వెళ్తాడు, ఎక్కడన్నా పని ఉంటుంది. మనమాదిరిగా వంటింట్లో పడివుండడానికి ఆడ ముండా? పడుకో ఫో!" అని కసరి తిట్టింది.

ఆరోజు తెల్లవారుతూండగా జోగుతూ తూలుతూ వచ్చాడు సీతాపతి. తలుపు తెరచాను గుప్పున వాసనకొట్టింది. డోకొచ్చినంత పనయింది. కంపించిపోయాను త్రాగుడు కూడానా అని. పిచ్చి నాన్న కట్నం అక్కరలేదంటే ఉబ్బి తబ్బిబ్బై చేసాడు. తను చేసిన పెళ్ళికి పర్యవసానం ఎలా వుంటుందో చూడకుండానే దూరమయ్యాడు నాన్న. సీతా

పతిని ఏమీ అడగలేదు. అడిగినా, మాట మెదిపినా శిక్షఎలా వుంటుందో తెలుసు. లోలోపల కుళ్ళి కుళ్ళి ఏడ్చాను.

అదేరీతిగా కాలం దొర్లిపోతోంది. అప్పటికే కొన్ని సంవత్సరాలుగా రోగంతో తీసుకొంటున్న మామగారు ఒక రోజు అకస్మాత్తుగా పోయారు. వేళ్ళికి సీతాపతి యింట్లో లేడు. తరువాత రెండు మూడు రోజుల వరకూ రాలేదు. చివరి ఘడియల్లో ముసలాయన అమితంగా బాధపడ్డారు సీతాపతి కోసరం. కర్మకాండ కూడ ఎవరో చేశారు. అంతా అయిన తర్వాత ఒకరోజు అర్ధరాత్రి తాగి...తూలిపోలిపోతూ చేరాడు కొంపకు. తండ్రి మరణవార్త అతన్ని కొంచెంకూడ కదలించలేదు. బాధపడ్డట్టుగా కూడ నాకు కనుపించలేదు.

మామగారు పోయిననాటినుండీ అత్తయ్యకు సాధించడానికి, తిట్లకు మరో కారణం దొరికింది. పనుల్లో ఏదిచేయడం ఆలస్యమయినా తిట్టేది. నువ్వొచ్చావు, ఆయన్ని కాజేశావు! దరిద్రపు మొహానివి - అడుగుపెట్టావు. చావనన్నా చావ రాదూ అనేది. మామగారు చావడానికి నేనే కారణమయ్యాను ఆమె దృష్టిలో. ఎన్నన్నా, ఎన్ని తిట్టినా చివరికి కొట్టినా మెదలకుండా ఊరుకొనేదాన్ని.

ఒక రోజున రాత్రి భోంచేసి మళ్ళీ బయలు దేరారు. నేను సహించలేక పోయాను. ఎలాగయినా ఆయన్ని ఆపాలని ప్రయత్నం చేద్దామనుకున్నాను.

వెళ్ళి ఆయన ముందునుంచుని చేతులు అడ్డం పెట్టూ "ఎక్కడ కెళ్తున్నారండీ?" అన్నాను.

నేను జవాబుకు కూడా తగను. పురుగును విదిలించినట్లు విదిలించేశారు చేతులు నెట్టి అడుగు వేశారు. నాకూ పట్టుదల జాస్తి అయింది. మళ్ళీ అడ్డుతగిలాను. "ఇవాళ మీరు వెళ్ళడానికి వీల్లేదు. ఉండరూ!" అన్నాను. ఇప్పుడు కూడా జవాబులేదు. బలంగా చెంపమీద కొట్టి నెట్టేశారు. ఒక్కతోపుతో ప్రక్కనున్న మంచంకోడుమీదపడిపోయాను. ఆయనకేమీ పట్టనట్టు మెదలకుండా వెళ్ళిపోయారు. కోడు డొక్కలో పొడుచుకొన్నది. ప్రాణం పోయినంత పనయింది. కానీ నిజంగా ప్రాణం పోలేదు. పోతే ఈ కష్టాలన్నీ అనుభవించడానికి మనుష్యులు తరుగయి పోతారు. ఈ గలభాకి అత్తయ్య పరుగెత్తుకొచ్చింది. ఒకవైపు నేను కోడుతగిలి నరక యాతన పడ్తూంటే... ఆమె తిట్టడం మొదలుపెట్టింది.

"వాణ్ణికూడ బతకనివ్వవుటే వచ్చి ఆయన్నిమింగావు. వాడు మొగవాడు. ఎటన్నా తిరుగుతాడు. అదిచాలక వాణ్ణి ఎక్కడకూ కదలనివ్వవేమిటి? శాస్తి జరిగింది. చావనన్నా చచ్చావుకావు" అంటోంది ఏదో జవాబు చెప్పాను. జవాబుతో ఆమె రెచ్చిపోయింది జుట్టుపుచ్చుకొని యిష్టంవచ్చినట్లు కొట్టింది. ఆరోజున అన్నంలేదు – వళ్ళంతా నొప్పులు. ఆ రాత్రి నాబాధ పరమాత్మకే తెలుసు.

సీతాపతి ఇంటిపట్టున ఉండడంలేదు. అలాగే రోజులు గడచిపోయేవి. ఒకరోజున అత్తయ్యే తిట్టుతూ అసలు సంగతి బయటపెట్టింది. "చావరాదుటే; శని వదలగడై పోతుంది. మా నాయన ఆ రాధమ్మను తెచ్చుకొంటాడు" అని. అదికి

పోయాను. రాధమ్మను తెచ్చుకుంటాడు. నేను చచ్చిపోవాలి. నన్ను చేసుకొన్నది ఎందుకు?

సీతాపతి రాధను ఉంచుకొన్నాడుట. వాళ్ళు – వీళ్ళు చెప్పుకొంటే విన్నాను. యిప్పుడు దానిని తెచ్చుకోవాలని, నన్ను ఎలాగైనా వెళ్ళగొట్టాలని ప్లాను వేస్తున్నది. రాధకు బాగడబ్బున్నదట. కరణం శివకామయ్య కూతురట. మొగుణ్ణి చంపిందట. ఎప్పుడూ వాళ్ళిద్దరికీ పడేది కాదట. విషంయిచ్చి చంపిందని అంటారు అందరూ. మొగుణ్ణి విషం యిచ్చి చంపిన ఆ రాధమ్మతో మరి సీతాపతి ఏం నెగ్గుతాడో తెలియదు.

అత్తయ్య నాచేత ఇంటెడుచాకిరీ చేయించేది. సరిగ్గా తిండిపెట్టేదికాదు. ఒంట్లో ఓపిక లేకుండాపోయింది. నీళ్ళల్లో తిరగడం–పనులు చేయడం మూలంగా కాళ్ళు తెల్లగా పాచి పోయిపుండయేవి. ఏ కారణం చేతనైనా నన్ను వెళ్ళగొట్టాలని చూస్తోంది కాబోలు. నాకు కుష్టురోగమని పుకార్లులేపింది అత్తయ్య. యింటికివచ్చిన వాళ్ళందరితో నాకు కుష్టురోగమని చెప్తూండేది.

నాకు అప్పుడు ఎనిమిదోనెల. ఒక్కో–రోజు దగ్గరపడు తున్నకొద్దీ నాలో భయం పెచ్చుమీరిపోయేది. ఈ కష్టాల్లో భాగం పంచుకోడానికి నాకు తోడు యింకో పాపిష్టి ప్రాణి అడుగుపెట్టబోతోంది. పురుడువచ్చేలోపలే చచ్చిపోతానేమో ననిపించేది. ఓపిక చచ్చిపోయింది.

ఆరోజు, నా యీ నికృష్ట నిస్సారహీన జీవితానికి నాంది ప్రస్తావన పలికినరోజు. అతిభయంకరమైన రోజు. నా జీవితాంతం మరచిపోలేదు.

ఆరోజు బయట వాన కుండపోతగా కురుస్తోంది. వానకు తోడుగా కటిక చీకటి. వాతావరణం అతి భయంకరంగా ఉన్నది. ఏదో ఆలోచిస్తూ పడుకొన్నాను. అర్థరాత్రి కావస్తోంది. ఇంతలో సీతాపతి వచ్చాడు అదే మామూలు స్థితిలో, తూలుతూ,జోగుతూ. గ్రాందీకంపు గుప్పునకొట్టింది. అత్తయ్య తలుపు తీసింది. వాళ్ళిద్దరూ ఏదో రహస్యంగా మాట్లాడుకొన్నారు. అత్తయ్య విసవిసా వచ్చి రెక్క పుచ్చుకొని బలవంతాన ఒక్క వూపుతో నన్ను లేపింది. ఈ అకస్మాత్సంఘటనతో బెదిరిపోయాను. "ఏమి టత్తయ్యా!" అన్నాను. "ఏమీలేదు నోరు మెదపకుండా ఇంట్లోనుండి నడు. రేపు మా నాయన రాధమ్మను తెస్తున్నాడు" అన్నది విసురుగా. స్థంభించిపోయాను. బయట గాడాంధకారం. ఎముకలు కొరికే చలి. ఆకాశానికి చిల్లిబడ్డట్టు వాన. ఈ పరిస్థితిలో యింట్లోనుండి వెళ్ళాలి ఎలా? నేను కదలక పోయినా వాళ్ళే బలవంతాన నెట్టేస్తారు. తప్పదు.

"ఊఁ! కానీ, చూస్తావేం? పద బయటికి!" అని అత్తయ్య ఘీంకరించింది రెక్క నొక్కివేస్తూ. అత్తయ్య కాళ్ళమీద పడ్డాను. ఎన్నో విధాల వేడుకొన్నాను. నేచేసిన తప్పేమిటని అడిగాను. సీతాపతి వచ్చాడు. ఆయన పాదాలమీద వాలి శతవిధాల ప్రాధేయపడ్డాను. రాధమ్మకు మీకూ నేనేమీ అడ్డంకిగా ఉండను. మీయింట్లో దాసీగా వుంటాను

తిండిపెడ్తే అంతేచాలు అని మొరపెట్టుకొన్నాను. లాభం లేకపోయింది.

అత్తయ్య బరబరా యీడ్చి వానలోకి తోసింది. వెంటనే ధనేల్‌మని తలుపు వేసుకొన్నారు. సీతాపతి వికృతంగా నవ్వాడు.

వెళ్ళి మెట్ల క్రింది బండరాయి మీద పడ్డాను. కళ్ళు తిరిగిపోతున్నాయి. సత్తువలేదు. చుట్టూ ఏమివున్నదీ కన్ను పొడుచుకున్నా కనుపించనంత చీకటి భయంకరంగా ఉన్నది. పైనహోరున కుంభవృష్టి... పూర్తిగా తడిసిపోయాను. ఒంట్లో రక్త నాళాలు కుంచించుకొని రక్తం పిడచ కట్టుకు పోతోంది.

అలా ఎంత సేపు పడివున్నానో తెలియదు. మూర్ఛ నుండి తేరుకొని కళ్ళు విప్పేసరికి వాన వుధృతం ఇంకా తగ్గలేదు. అప్పుడే ఠాణాలో రెండు గంటలు నిశ్శబ్దాన్ని చీల్చుకొని కొన ప్రాణంతో వున్న నాకు వినిపించినయ్. యింకా ఆ యింట్లో నాకుతావులేదు. రేపు సీతాపతి రాధను తెస్తాడు. ఇకనుండి ఆ యింట్లో నా అడ్డంకి ఉండబోదు. పోనీ ఆ రాధతో నన్నా సుఖంగా ఉంటే అంతే చాలు. ఆయన సుఖమే నేనూ కోరేది.

ఆ భయంకర నిసీధంలో తోచినట్లు నడిచాను. ఊరు వదలి కాళ్ళు ఎటు తీసికెళ్తే అటు ఒక గమ్యాలేకుండా నడిచాను. వాన తగ్గలేదు. ఎన్ని గంటలు అలా నడిచానో నాకే తెలియదు. ఏదో ఊరు వచ్చింది. ఓపిక క్షీణించింది. ప్రాణంపోతున్నట్లు భయంకరమైన అనుభూ

తితో... బాధతో... వానలో... బురదలో... మూర్ఛపోయి పడిపోయాను.

కళ్లు విప్పి చూచేసరికి ఎవరో ఆడమనిషి ఆతృతగా చూస్తోంది. వానలో... అలా పడిపోతే తెల్లవారు ఝామున అటూ ఏదో పనిమీద పోతూ చూచి ఇంటికి చేర్చారట.

నా గురించి ఎన్నో అడిగారు నేనేమీ చెప్పలేదు. నాకు ఎవ్వరూ లేరని మాత్రం చెప్పాను. రెండు రోజుల తరువాత ప్రాణం తిరిగి కుదుటపడ్డది. వారికి కృతజ్ఞతలు తెలిపి తిరిగి నా గమ్యంలేని ప్రయాణం మొదలుపెట్టాను.

అలా పోవడంలోని నా ముఖ్యోద్దేశ్యం సీతాపతినుండి అతి దూరంగా వెళ్ళిపోవడమె.

ఒక ఊరి పొలిమేరల్లో ఉండగా నొప్పులు మొదలు పెట్టినై. ఈ బాధ కూడా ఈ సంకట పరిస్థితిలోనే మొదలయింది. నాకు అప్పుడు భగవంతుడుతప్ప రక్ష ఎవరూ లేరు. నా బాధల భాగస్వామిగా ఇంకో జీవిని నాకిచ్చేకన్నా నన్ను తన దగ్గరకు పిలుచుకొమ్మని భగవంతుణ్ణి ప్రార్థించాను. క్షణం గడిచినకొద్దీ బాధ జాస్తీ అయింది. తల్లడిల్లిపోయాను. అప్పుడే సంజెచీకటి సన్నగా అల్లుకొంది. ఎదురుగా ఎవరో పల్లెమనిషి తలమీద గడ్డిమోపుతో వస్తోంది. కళ్ళు తిరిగి పడిపోయాను.

ఆ పల్లెమనిషి మోపుపడేసి ఎవర్నో కేక వేసింది. నన్ను వాళ్ళింటికి చేరవేశారు. నేనెంత ప్రాధేయపడ్డా భగవంతుడు నన్ను తన దగ్గరకు పిలుచుకోవడం లేదు. ఆ పల్లెమనిషి పేరు గంగి. గంగి సపర్యలతో తిరిగి కోలుకొన్నాను. ఆడపిల్ల...

నా కష్టాల్ని తలచుకొని ఆ పిల్లను కావిలించుకొని కుళ్ళి కుళ్ళి ఏడ్చాను. గంగికి నా గాథంతా వెళ్ళబోసుకొన్నాను. ఆ వూరి వాళ్ళ దయవల్ల ఒక చిన్న గుడిసెవేసుకొని అక్కడే స్థిరపడిపోయాను.

గంగితోబాటు నేనూ అలవాటు లేకున్నా కూలికి వెళ్ళేదాన్ని. ఎన్నడూ అలాంటి పనికి అలవాటు పడ్డదాన్ని కాదు.

అలాగే మూడేళ్ళు గడచిపోయినయ్. పిల్ల ఎదుగుతోంది. పాపకు పార్వతి అని పేరు పెట్టాను. ఈ మూడేళ్ళలో వూరు చాలా మారిపోయింది. గంగివాళ్లు ఎటో వెళ్ళిపోయారు.

మా యిద్దరి జీవితాలూ ఎలా వెళ్ళబోసుకోవాలో నా కేమీ పాలుపోయేది కాదు. ఒక పూట తింటే మరో పూట పస్తు. చదువువిలువ తెలిసివచ్చిందప్పుడు. చదువు గనకఉంటే ఈ హీనదశలో కొంత ఆదుకొనేది. కూలీ దొరికేదికాదు. రోజులు అతి భారంగా దొర్లిపోతున్నయ్.

ఒకరోజున అకస్మాత్తుగా పార్వతికి తీవ్రంగా జ్వరం వచ్చింది. అదే తగ్గుతుందిలే అని వూరుకొన్నాను. కానీ మరునాటికికూడ తగ్గలేదు. మరీ ఎక్కువైపోయింది. ఒళ్లు సల సలా కాగిపోతోంది. రోజురోజుకూ జాస్తి అవుతుందేతప్ప, తగ్గుమొహం కనుపించడంలేదు. మన మాటా-మంచీ ఏమీ లేకుండా పార్వతి మాచాన వుంది. చేతిలో డబ్బు నాస్తి.

వెంటనే డాక్టరు దగ్గరకు పరుగెత్తాను. డాక్టరుకు వచ్చినందుకు, మందిచ్చినందుకు డబ్బు కావాల

న్నాడు. పూటకి గంజికిలేని దాన్ని. డాక్టరుకు ఫీజు ఎక్కడనుండి తెచ్చేది. భయం వేసింది. పార్వతి నాకు దక్కదేమోనని. ఆ రోజుకూడ ఏమీ మందు లేకుండానే పార్వతి విపరీతమైన కాకతో మంచంలో పడివుంది. రోజులు గడుస్తున్నకొద్దీ పార్వతి ప్రాణానికే ముప్పువస్తుందేమోనని భయంవేసింది. లేదు పార్వతి చావకూడదు. నాకీ ప్రపంచంలో నా అనేవాళ్లు లేరు. ఈ ఉన్న ఒక్క అనుబంధాన్నీ దక్కించుకోవాలి.

ప్రక్కనేఉన్న వకీలు వర్ధనరావు మేడలోకి వెళ్ళాను. పిల్లకి జ్వరంగా ఉన్నదని పదిరూపాయలు యివ్వమని త్వరలో తిరిగి యివ్వడానికి ప్రయత్నం చేస్తానని ప్రాధేయ పడ్డాను.

యిస్తానని పైకి మేడమీదికి రమన్నాడు. ఆయనతో పాటే పైకి వెళ్ళాను. అలమారాలోనుండి పది రూపాయల నోటు తీశాడు. నేను ఏదో ఆలోచిస్తూ ఎటో చూస్తున్నాను. వెంటనే వర్ధనం తలుపు వేసేశాడు. నేను నిర్ఘాంతురాలై పోయాను. వర్ధనం నవ్వుతున్నాడు. దగ్గరకు వస్తున్నాడు. నా కళ్ళు తిరిగి బైర్లు కమ్ముతున్నయ్. వర్ధనం చేయి నా భుజం మీద పడింది. నా శరీరం భయంకరమైన బడబాగ్నిలో దహించుకొని పోతూంది. కాని పార్వతి!... చావు బ్రతుకుల మధ్య పాప దీనవదనం నా కళ్ళలో మెదులుతోంది. ఒకవైపు పార్వతి కావాలి. తప్పదు. పార్వతి కావాలంటే మందులకు పది రూపాయలు అధమం కావాలి. ఆ పది రూపాయలకు ఈ వర్ధనం ఈ నీచపు పనిని పణంగా పెట్టాడు. పార్వతి కావాలంటే

పదిరూపాయలు కావాలంటె యిప్పుడు తప్పైనా ఒప్పైనా వర్ధనం కాంక్షించేది పోయినా ఫరవాలేదు. యిప్పటికే పార్వతికి ఆలస్యం అయిపోయింది. ఈ ఆలోచనలనుండి తేరు కొనే లోపలే వర్ధనం తన కోరిక తీర్చుకొన్నాడు. పార్వతి మీది మమకారంతో వర్ధనం పైశాచిక కృత్యానికి లొంగి పోయాను. పుష్పంనుండి మత్తుగా బయటపడ్డ భ్రమరంలా వర్ధనం లేచాడు.

వకీలు వర్ధనం న్యాయస్థానంలో నీతి నిజాయితీలను న్యాయాన్ని బల్లగుద్ది శాహటంగా వాదంచే న్యాయవాది వర్ధనం. నీతి యిదే!

పళ్ళు యికిలించాడు. నేను నిర్వికారంగా స్తంభిభూతు రాలనై లేచి నిలబడ్డాను. చేతిలో 10 రూ॥ల నోటున్నది.

మళ్లా అసహ్యంగా నవ్వాడు. డబ్బు తిరిగి యివ్వాక్క లేదులే అన్నాడు.

కళ్ళల్లో పార్వతి దీనవదనమే గోచరిస్తోంది. జరిగినది ఆలోచించకుండా ఆతృతగా డాక్టరు దగ్గరకు వెళ్లాను. సీసాలో ఏదో రంగునీళ్ళు పోసిచ్చాడు. తీసుకొని గబగబా గుడిసెకు వచ్చాను. పార్వతి యింకా నీరసంగా అలానే మంచానికి కరచుకొని ఉన్నది. పిలిచాను. కళ్ళువిప్పి చూచింది బలహీ నంగా సీసాతో మందు త్రాగించడానికి వంగాను.

తీవ్ర జ్వరంతోకూడ పాప అగ్గిలాంటి ప్రశ్న వేసింది. 'అమ్మా! రవికముడి పెట్టుకోలేదా? మరచిపోయావా?' అని.

తల తిరిగిపోయింది. ఉన్నపళాన పాతాళానికి అణగారి పోయినట్లు అనుభూతితో అదిరిపోయాను. పార్వతిమీద

బెంగతో తత్తరలో జరిగినపని అది. పార్వతికి ఏమి జవాబు చెప్పేది? నిష్కారణికలాంటి ప్రశ్న అది.

పార్వతికి జ్వరం తగ్గింది. రోజులు అలాగే కటకటగా దొర్లిపోతున్నాయ్.

మా ఇద్దరి పోషణానికి క్రొత్త వృత్తిలోకి దిగాను. ఎలాగో నేను మలినమైపోయాను. వకీలు వర్ధనం ఘనకార్యం ముతో నా జీవనపథంలో కొత్త మలుపు సృష్టించ బడింది. ఉదర పోషణార్థం అదే నీచపుకార్యం వృత్తిగా చేసుకున్నాను కొత్తలో వర్ధనం రాకపోకలు సాగించేవాడు. పెళ్ళాం కలరా వచ్చి చచ్చిపోయిందట. పిల్లలులేరు. అంత బంగళాలో అతను ఒక్కడేట. వచ్చినప్పుడల్లా బాగానే డబ్బులు యిచ్చే వాడు. తర్వాత రోజులు దొర్లినకొద్దీ ఎంతోమంది రావడం మొదలుపెట్టారు. నా యౌవ్వనంతో మిసమిసలాడే శరీరంతో బంతులాట లాడుకొనేవారు. వారి దృష్టిలో నేను ఒక విలాస వస్తువుని మాత్రమె! వచ్చిన ప్రతివాడినీ పార్వతితో... ఏదో వరసతో...మామయ్యా అనో, బాబాయనో పిలిపిస్తూండే దానిని. డబ్బు పుష్కలంగా ఉంటోంది. అదే వృత్తిలో జవ సత్వాలు సహితం సర్వం ఉడిగిపోయినయ్. నాయౌవ్వనాన్ని, రక్తాన్ని, షాంపేన్ త్రాగినట్లు త్రాగేశారు విటులు. పార్వతిని నామాదిరిగా కాకుండా పట్టణంలో బోర్డింగులో చేర్పించాను. బాగా చదివించాను. పార్వతి ఇప్పుడు బాగా పెద్దదయింది.

ఇన్నాళ్ళూ బెల్లపు చీమల్లా నా యింటికి వచ్చిన విటాగ్రేసరులంతా ఒక్కొక్కరూ రావటం మానుకున్నారు. నా వంట్లో ఓపికకూడా క్షీణించింది. ఒకరోజున ఒకడన్నాడు:

"ఇంకా నీ దగ్గరేముంది? నీ పాప. ఎక్కడో వున్నదంటావే గాని ఒక్కసారి చూపించలేదు. తీసికొని రారాదా బాగుంటుంది" అని.

ఆ మాటలతో ఆపాదమస్తకం భయ కంపితురాలనయ్యాను. పాపను తీసుకొని రావాలట. తిరిగి ఈ వృత్తిలోనే దాని జీవితం సర్వం నాశనం చెయ్యాలట. కాదు. అలా ఎన్నటికీ జరగదు. దానిని కూడా ఈ దౌర్భాగ్య జీవితంలోనికి ఈ పాప పంకం లోనికి దింపను. కలలో కూడా జరుగదు. అలాగనే నా మనో అంతరాళాల్లో దృఢంగా నిశ్చయించుకొన్నాను.

వారం రోజుల క్రితం పార్వతి శెలవుల్లో వచ్చింది. అంతకుముందు నా జీవన వృత్తాంతం దానికి అసలు తెలియదు. చిన్నప్పటినుండి... బుద్ధి తెలిసినప్పటినుండి దాని జీవితం బోర్డింగులోనే గడచింది. ఈ వారంరోజులూ నా జీవితాన్ని, నా చుట్టూ పేరుకొని కరుడుకట్టుకొనిపోయిన మాలిన్యపు వాతావరణాన్ని, క్షుణ్ణంగా పరిశీలించి అసహ్యించుకొన్నది. నన్ను పూర్తిగా ద్వేషించి యిష్టంలేక నానుండి దూరంగా పారిపోయింది.

నా హైన్య జీవితపు సింహావలోకనంనుండి తేరుకుని ఆర్ద్రిమలైన కళ్ళతో భారహృదయంతో తలెత్తి చూచాను. ఒంటరితనం వికృతంగా భయపెట్టోంది. గుండెలు మండిపోతున్నాయి ఏడ్చి ఏడ్చి నిద్రపోయాను.

* * * * *

వంటరిగా భారంగా రోజులు గడుస్తున్నాయ్. ఇప్పుడు పొట్ట గడవటం దుర్భరంగా ఉంది. ఎవ్వరూ కన్నెత్తి చూడడంలేదు. ఇదివరకు నా సాంగత్యాన్ని అభిలషించి నా దర్శన మాత్రానికే తపించి పడిగాపులు పడిపోయినవారు యిప్పుడు దూరం దూరంగా భయపడినట్లు తప్పుకుపోతున్నారు. యిక యిక్కడఉండి ఆకలిచావు చచ్చేకన్నా, అడుక్కొన్నా కొంత క్షుద్బాధ వుపశమించకపోదనే భావంతో పట్నం చేరాను. పగలల్లా అడుక్కోవడం సాయంత్రమయ్యేటప్పటికి సత్రపు వరండాలో వీధి కుక్కలా చేరడం. తీరికగా కూర్చుని నా దౌర్భాగ్య జీవితాన్ని తలచుకొని హృదయం పగిలేలా దుఃఖించడం దినచర్యగా మారిపోయింది.

పార్వతి నన్ను వదలివెళ్ళి ఐదేళ్ళయింది. నా జీవితం యింత అధోపతనం చెందుతుందని కలలో కూడ అనుకోలేదు. పార్వతి దాని భవిష్యత్తును అదే తీర్చిదిద్దుకొన్నది. నా కుళ్ళు పరిసరాలనుండి దూరంగా వెళ్ళిపోయింది. నా జీవితంలో ఎన్ని అనుభవించాలో అన్ని జరిగిపోయినై. చిన్నారి పాపగా తల్లిదండ్రి లేని అనాధగా, గృహిణిగా, పడుపు కత్తెగా, చివరికి దిక్కులేని బికారిణిగా నా జీవన్నాటకంలో ఎన్ని వేషాలు!

ఉదయం పదవుతుంది. ఎండ తీవ్రంగా ఉన్నది. రెండు రోజులనుండి ఎవ్వరూ యింత పెట్టలేదు. ఆకలికూడ ఎండ మాదిరిగా దహించేస్తోంది. నోరు పిడచకట్టుకు పోతున్నది. ప్రతి యింటిదగ్గరా ఆగడం తిట్లు తినడంగా ఉన్నది. కళ్లు తిరిగిపోతున్నాయ్. అలాగేయాంత్రికంగా నడచిపోతున్నాను.

ప్రాణం శోషిల్లిపోతున్నది. ఒక యింటిదగ్గర ఆగాను. ప్రాణం పోయినంత పనయింది. శరీరం తేలిపోతోంది చుట్టూ మనుష్యులూ. యిళ్ళూ గిర్రున తిరిగిపోతున్నయ్. తూలి కప్పగా కూలిపోయాను.

తరువాత ఏం జరిగిందో తెలియదు. తేరుకొని చూచేసరికి ఎక్కడున్నానో తెలియడంలేదు. అంతా అగమ్య గోచరంగా ఉన్నది.

కళ్ళు తెరిచాను. ప్రక్కన ఒకఆడమనిషి స్టూలుమీద కూర్చుని వున్నది. కళ్లుబైర్లు కమ్ముతున్నాయి. పరీక్షగా చూశాను. ఏడుస్తోంది ఆమె. కలా నిజమా అనుకొన్నాను. ఎవరోకాదు పార్వతి.

పార్వతి అమ్మా అంటూ హృదయంలో యిమిడిపోయింది. చివరికి నాకీగతి పట్టిందని విపరీతంగా దుఃఖించింది

కళ్ళముందు మసక పేరుకు పోతోంది. గొంతు ఎండిపోతోంది. దాహం వేస్తోంది. పార్వతికి సౌజ్ఞచేశాను నీళ్ళు కావాలని.

"సీతయ్యా! నీళ్లు పట్టుకురారా" అన్నది పార్వతి.

ఒక ముసలివాడు నీళ్ళు తెచ్చాడు. అంతా అగమ్య గోచరంగా ఉంది. మత్తు విడిపోయింది. కలగంటున్నానా అనిపించింది.

సీతయ్యా కాదు సీతాపతి. నా జీవితంలో ఈ దారుణ పరిణామానికి ముఖ్య కారకుడయిన నా పూర్వపు భర్త. శాస్త్రోక్తంగా నన్ను పెళ్లాడి, తృణీకరించి నన్ను నానా బాధలు పెట్టిన సీతాపతి... సీతయ్యా... సీతాపతి.

సీతాపతి పిచ్చిగా చూస్తున్నాడు. నేనూ నిర్విణ్ణురాలిగా ఏమీ తెలియనట్లు పిచ్చిగా చూస్తున్నాను. సీతాపతి వదనంలో రంగమాండుతున్నది. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నై. ఇక ఆగలేకపోయాడు. పద్మా! అంటూ నా కాళ్ళమీద పడిపోయాడు.

"క్షమించు పద్మా! రాధ మోసంచేసింది. అమ్మకు విషమిచ్చి చంపేసింది. రాధమీద గుడ్డి ప్రేమతో పొలం దానికి రాసేశాను. అంతా చేజిక్కించుకున్న తరువాత నువ్వు ఎవరో పొమ్మంది. అంతా నిన్నేడిపించినందుకు శాస్తి... జరిగింది పద్మా! నన్ను క్షమింపవూ" అని వలవల ఏడుస్తున్నాడు.

పార్వతివేపూ, సీతాపతివేపూ చూస్తుండి పోయాను. "నీ కూతురు సీతాపతీ!... పార్వతీ!" అన్నాను. సీతాపతి అయోమయంగా చూస్తున్నాడు. పార్వతి సంగతి తెలుసుకొంది.

"నాన్నా" అని అరుస్తూ సీతాపతిమీద వాలిపోయిన పార్వతినీ, సీతాపతిని చూస్తూ స్తబ్దంగా ఉండిపోయాను.



# పోస్టాఫీసులో...

పోస్టాఫీసు జనానికి తంతి తపాలా సౌకర్యాలే కాక, యింకా కొన్ని అదనపు సౌకర్యాలుకూడా అమితమైన అప్యాయతతో అడగకుండా వాలంటరీగా కలుగజేస్తుంది.

వానాకాలం అనుకోకుండా ఆకాశం మేఘావృత్తమై సడన్‌గా వర్షిస్తే, దారేపోయే దానయ్యలకు తడవకుండా యింటికి చేరదలచుకొన్న వారికి, ఛత్ర విహీనులకు అందు బాటులో ఉండే ఆసరా... పోస్టాఫీసు వరండా...

గాలికి తిరిగే గార్ధభ రాజాలకు, కులాసాగా తిరిగే శున కాములకు, మజాగా మేసి, నెమ్మదిగా, సజావుగా, నెమరు వేసే మహిషాలకు కూడా విశ్రాంతి స్థానం... ఎవరూ లేపని విరామ స్థావరంకూడా అదే వరండా...

పూసలు, ఊలు, దారాలు, కుంకుమ భరిణెలు, పిన్నీసులు వగైరా సన్నని సరుకులు సరసమైన ధరలకు అమ్ముకొంటూ రోజుకొక ఊరు తిరిగే దిక్కులేని దేశదిమ్మరులకు బిచ్చగాళ్ళకు, ఫుట్‌వాత్ పుణ్యాత్ములకూ పోస్టాఫీసు వరండా అడ్డులేకుండా వచ్చే అమోఘమైన ఆసరా...

అలాంటి సమస్త జన, జంతుజాల సహాయకారి అయిన తపాలా ఆఫీసువద్ద ఒకానొక రోజు ఉల్లాసమైన ఉదయాన...

పైన చిటచిట వాన.

పోస్టాఫీసు వరండా పైనున్న ఎస్బెస్టస్ రేకులు చినుకులకు చిటపట మంటున్నాయ్.

పాంథుల పాదపద్మాల కంటుకొన్న పంకిలం పట్టెడు దిగుమతి అయింది. తప్పనిసరిగా వరండాలోనికి వరండా అంతా చిందర వందర—చీదర ఘుడ్తోంది. చిత్తడి చిత్తడిగా ఉన్నది.

కిటికీలు తెరవలేదింకా. లోపల గుమస్తాల గుసగుసలు ఎవేవో వాళ్ల పోస్టల్ పరిభాషలో కేకల్లాంటి కూతల సందడి.

"ఖాసింసాబ్! మనిఆర్డర్ ముహర్ నహీంబదలేనా!"

"భూల్ గయాసర్కార్! అభీబదల్కే దేవుంగాసాబ్! అభీ ఆయా! అరే అన్వర్ చాచా యిదర్ ఆవ్‌నా!"

"టక్ టక్ టక్ టక్ టక్ టక్" జనం వ్రాసినకార్డులు, కవర్లు వగైరావంటి మొహాలమీద, స్టాంప్ పాడ్ మీద అద్దుతూ, యినప ముద్దర్లతో యిష్టమొచ్చినట్లు మోదుడు

"క్యా దస్తాగీర్! టపా ఆయాసర్కాహై? సబ్ థైలే ఆగయేనా!"

"జీ హాన్ సబ్ ఆగయే. సబ్ మిలాకే, పాంచ్ బ్యాగ్ సర్కార్. ప్యాకెట్ బ్యాగ్ భీ ఆయా!"

"అచ్ఛా, అచ్ఛా. అరే శాప్‌రే టైమ్ హోగయీనా ఖాసిం. మెరే మణిఆర్డర్‌కీ ముహర్ లావో."

"ధన ధనధన ధనధన" కిటికీ చప్పుడు.

"పంతులూ! కారటు కావాలె"

"ఏటి బాబూ! పోస్టాఫీసు తెరిచే టైం గాలేదేంటి?"

"అయితే తెరుస్తాము గదటయ్యా! హడావుడి మీరూనూ?"

కిటికీ కవాటాలు కిర్రుమనే చప్పుడు, కౌంటర్‌లో కౌంట్ చేయలేనంతమంది జనం, వరండా రేకులపై వర్షజల తరంగాల ఇంపైన స్వనం-గుంపును గుర్తించిన గుమాస్తా గురునాథం గుండెల్లో గుబులు. కానీ తప్పదు.

“ఏవాంటు బుకె కాల్‌ప్లీజ్!” సాగదీస్తూ ఒక డబ్బ రొట్టెలాంటి మొహం మూలుగు.

“నెక్ట్స్ కౌంటర్ ప్లీజ్! మీ కేం కావాలి... మీ కే.”

“మూడు కార్డులు, రెండు ఇంగ్లాడు కవర్లు. (ఇన్‌లాండ్ కొచ్చిన బాధ) ఐదుపైసల బిళ్ళలారు, ఒక ఎక్స్‌ప్రెస్ బిల్ల.”

“ఆగవయ్యా మహాత్మా! నువ్వైతే పారాయణం చేస్తున్నావుగానీ యిక్కడ నా బుర్రలో అన్నీ ఎలా యముడ్చుకోనేది.”

“హలో... హలో... హలో... హలో... ఎక్స్ఛేంజ్... హలో... హియర్... టు నైన్ పిసివో—టేక్ ఎ కాల్‌ప్లీజ్! ఒక కాలండీ... అవును... అవునూ... ఆఁ టు నైన్ పి సి వో కాల్ టు హైద్రాబ్యాడ్... హైద్రాబాద్ నైన్ త్రీ ఫోర్ టు ఫోర్... అవును ఫోరే... పి. పి. పిచ్చేశ్వరరావు... హలో బుకింగ్ టైమ్... ఏంటో యింటరప్షన్... ఉహూఁ... ఓకే.”

“గివ్ మి టు ఫోల్డర్స్ ప్లీజ్” ఫోల్డర్స్ ఇన్‌ల్యాండు కొచ్చిన తిప్పలు. రెండుఫోల్డర్లకు పదిరూపాయల నోటు—

“ముప్పై రూపాయల పది పైసలకు మనియార్డరు కమీషన్ ఎంతేటి బాబూ?”

“అరవై పైసలు”

"అంతమరీ మండిపోయాలా చెప్తావేటి బాబూ?—ముప్పయి పైసలున్నాయి చేయూరాదేటి!!"

గుంపులో గుండులా ఉన్న గురవయ్య నవ్వుతూనే ఆపుకోలేక హ్రీం ఈ—ఈ—అని సకిలించి పారేశాడు పళ్ళు యికిలించి.

"గుడ్ మోర్నింగ్ ఫ్రెండ్స్! ఎనీ లెటర్ ఫార్ మీ" ఈ ఈ ఒక వృద్ధ సింధి కేరాఫ్ పోస్టుమాస్టర్ ఉత్తరాలకోసం దీర్ఘాలు.

"విల్ యూ ప్లీజ్ గివ్ మి యూన్ ఎక్స్ప్రెస్ డెలివరీ స్టాంప్ మ్యాన్—థాంక్యూ వన్ లేబుల్ ఆల్సో,— అరే హిహి గివ్ మి గమ్ బాటిల్ ఫర్ ఎ నైల్. అతుక్కోవడం లేదండి. అచ్ఛా!...ఇఫ్ యూ డోన్ట్ మైండ్..."

గుమాస్తా గురునాధం (స్వగతం)"మాకిచ్చే యఫ్ ఎస్ సి యే మీకు గంబాటిల్సుకు చాలదు—మ్ బాగానేఉంది!"

గమ్ బాటిల్ పని అయిందిగా. యిక అటు పారేసి పోయినా బేఫికర్.

"ఏక్ అందర్ దేశీయ్ పత్రదీజీయే. ఔర్ ఉసే రిజస్టర్ స్టాంప్ భీ రసీద్ తలబ్ పర్చా—"

"జీ బహుత్ సుక్రియా — అరె అల్లా అరే అల్లా థోడా పర్చా టాక్ నే కేవాస్తే తాగా ఔర్ సూయియా దీజియేగాతో బడీ మెహర్బానీ."

"తాగా సూయియా దేనేకేవాస్తే యే బనియాకా దుకాన్ నహీం మౌల్వీసాబ్! ఘుర్ జాకె సీకర్ లాయియే—"

"అరే ఉత్నా గరమ్ మత్ హో బేటా అచ్ఛా అచ్ఛా బుడే ఆద్మిహూం!"

"మిస్టర్ గురునాథ్! వాటీజ్ దిస్? ఐ విల్ లాడ్జ్ ఎ కంప్లైంట్ ఎగైనెస్ట్ యువర్ పోస్టాఫీస్! చూడండి ఎక్స్‌ప్రెస్ డెలివరీ కవర్ కదా! బెజవాడలో మొన్న వేశారు. ఈ రోజు అందింది. మూడు రోజులటండి ఎక్స్‌ప్రెస్ డెలివరీ అని పేరు పెట్టడం ఎందుకూ—"

"ఎక్స్‌ప్రెస్ డెలివరీ అంటే మీకు అసలు మొదలుకే అర్థం కాలేదు మాస్టారూ! మీ లెటర్ కోసం స్పెషల్ సర్వీసు ఎక్కడ వేస్తారండీ! లెటర్ డెలివరీలోనే మేముత్వరపడేది. ట్రాన్స్మిషన్ అంతా మిగతా లెటర్లతోటే"

ఫిర్యాదుకోసరం వచ్చిన పిచ్చిమనిషి తన యింగ్లీషు భాషా ప్రావీణ్యానికి తనలోనే పిచ్చినవ్వు—ఎన్ని తప్పులైనా కప్పుతుంది. నవ్వు—

"హలో! హలో ఆఁ... హియర్ టునైన్... అవునండీ ...కాలా?...జస్ట్ ఎ మినిట్!—ఆఁ—గోఆన్ ప్లీజ్!—విజయనాడా వన్‌జీరో సెవెన్ టూ—ఐజక్ త్రీ ఫోర్...ఆఁ పి.పి. పీతాంబర్—దాస్‌జీ—ఓకే—సీరియల్ నంబర్ ఫోర్ త్రీ పి. పి. నాటిన్ ఎక్స్‌పెక్టెడ్—ఓకె— నథింగ్ డ్యూ ప్లీజ్ ...ఆఁ...హహహ. యిందాకటి మాకాలుతీసుకోమంటారా? ఓహో ఇవ్వండి."

"హల్లో పిచ్చేశ్వరరావ్! నేనూ రంగయ్య మాట్లాడుతూంట...గల్లంతు జరిగిందిరా...అమ్మాయి...అదే మన అమ్మాయి పెద్దదిరా. రాధ రాత్రి కృష్ణమూర్తితో వారి

పోయిందిరా హైడ్రాబాద్! స్టేషన్లో కాఫ్రుకాయి. అఁజాగ్రత్త సేనొస్తా వెనకాల ఏమీ అనబోకు. కాలంమారిందిరా మనమే భయపడలి. అవునుమరి—టైము కావస్తోంది—వెంటనే వెళ్ళాలి. మిగతాది అంతా బాగానే ఉంది. అఁ మూడు నిము షాలు అయినట్లుంది. రైటో... వస్తా... ప్లెయ్.

"హలో—ఓవర్—అఁ మాకాలు కాలుకాదండీ! కాల్—అదే హ్లాఁ హ్లాఁ హ్లాఁ? బెజవాడది పిపిర్డెడీ తీసుకోండి అఁ—"

"హలో—హలో—కోణ్? మీ పీతాంబర్ బాత్ కర్ రయియో. రామ్ రామ్ లాలా... ఇమ్లి క్యా భావ్ హై యిమ్లి—"

టెలిగ్రాఫ్ డెపార్ట్మె ఎడా తెరిపే లేకుండా ఒకటేగోల. కట్టు కట్టు కట్టు కడ కడ.

"ఖాసింసాబ్ ముజే కుచ్ ఖత్ ఆయీా క్యా!

కౌంటర్లో గుంపు రొద, యిటు డెమిర్ట్మెపక్కన సిగ్నలర్ చేతిక్రింద టెలిగ్రాములు కోకొల్లలు... "గ్రాండ్ మదర్ సీరియస్. స్టార్ట్ ఇమిడియట్లీ." సెలవకోసరం సృష్టిం చిన తాతమ్మ చావు టెలిగ్రాం. ఆ గ్రాండ్ మదర్ ఎన్నడో గ్రాండ్ గా చచ్చిపోయి ఉంటుంది. అవసరం కోసరం మళ్ళీ చంపారు పాపం హతోస్మి!

"వైర్ టూ హండ్రెడ్." జాలీగా జాయ్ గా గడిపే పట్టణంలోని సుపుత్రుడు పాపం తండ్రికిచ్చిన మనిరిక్విజిషన్ మెసేజ్ ఓన్లీ టూ హండ్రెడ్.

"కంగ్రాట్స్ ఆన్ బికమింగ్ ఎ ఫాదర్" సంతానం కన్నందుకు సంతోషంతో, సంబరంతో శుభాకాంక్షలు. జనం ఎక్కువవుతున్నకొద్దీ భోజనానికి యిబ్బంది అవుతుందని తెలిస్తే ఆ ఆలిగ్రామూ ఉండదు, కన్నందుకు ఈయనకు కలకలమూ తప్పదు.

"దొరా! బిల్లలు ఐదు బిల్లలు గావాలె దొరా!"

"ఏం బిల్లల్రోయ్!"

"అదే దొరా? బిల్లలు తిక్కట్లు గదేదో దొరా. నాకు సమఝుగాడు పైసల్ తీసికొంటందుకు అతుక పెడ్తరు చూడు గదే—"

"రసీదు టిక్కెట్లా? యివేనా?"

"ఆఁ...ఆఁ గవ్వే దొరా యియ్యి."

కొద్దిగా ఆలస్యమైనందుకు ఒక కోలమొహం కొరకొర చూపు.

"యిదిగో మిస్టర్! ఒక కార్డు యివ్వు," అంత అదిరిపాటూ? ఒకే కార్డు కోసరం

"ఆగు మిస్టర్! ఆత్రపడ్తావేం? మర్యాదకు మర్యాద. పబ్లికు ఆఫీసులో పగలేమిటి? మర్యాదగా మాట్లాడాలి. ఎంత పబ్లిక్ సర్వెంట్ అయినా వీడూ మనిషేగా? వీడికి చీము-రక్తమూ ఉండవూ? కోరేదల్లా మంచిమాట మాత్రమే. కదూ?"

"ఒక మనియార్డరు ఫారం యిస్తారూ గురునాథం గారూ! సెలవనుండి ఎప్పుడొచ్చారు? అరే! యింకో వస్తా రేకీ శర్మగారూ?"

"నేను రాగానే ఎక్కడికో డెప్యూటేట్ చేశారు సార్! అందుకనే ఈ గొడవ."

"మాస్టారో! ఆఫీసుకు వేళయింది, కాని టైము లేదూ! ఈ వంద డిపాజిట్ చేసి పుస్తకం మీావద్దే ఉంచండి మా అబ్బాయివస్తే యివ్వబాకండి. సాయంత్రం తీసుకొంటా. ఓకే—"

కౌన్టర్‌లో ఉన్న గళ్ళ బుష్కోటు జగ్రాయ్ మూరెడు మూతి ద్వారా - తూములాంటి నాసికా రంధ్రాల ద్వారా చార్మినార్ ధూమ విసర్జన.

"ఏయ్ మిస్టర్! సిగరెట్టు అవతల పారేయ్! ఛీ! నాన్సెన్స్-నాన్సెన్స్."

"బాబోయ్! నా పర్సు! రెండొందలుండాలండోయ్ —నాపర్సు రెండొందలు—డొందలు—దలు—" రష్‌లో పర్సును మిస్ చేసుకున్న నిద్రమత్తు నిషారావు రాగాలాపన— ప్రేలాపన——

మళ్ళీ రంగయ్యకు పిచ్చేశ్వరరావు దగ్గరనుండి కాల్. అపర రాధాకృష్ణుల రిజిస్టర్డ్ మ్యారేజి శుభవార్త. రంగయ్య గుండె ఠంగున పగిలింది. లోలోపల సంతోషమే. ఒక్కటే— పెళ్ళైనాన్న అయిందని. కట్నాల కావిళ్ళ మోత ఈజీగా తీరి పోయింది.

"పంతులుగారూ మనిఆర్డర్లు?"

"లేదయ్యా! టైమైంది. మూడు పది. మూడింటికే క్లోజ్! చూడు గీతకూడా కొట్టేశాను." గురునాథం గుండెలో జి. టి.లు పరుగెత్తుతున్నాయి.

మని ఆర్డర్లు ఒకటీ రెండూ కాదు. మనీ సర్క్యులే షన్న దొంతర్లు! దొంతర్లు! మానవుని ధనాశకు తార్కాణాల దొంతర్లు—

"అయ్యాదణ్ణం! మాదొర మీకు సలాం చెప్పమన్నాడు దొరా! ఎట్లాగయినా ఈ మనిఆర్డరు యివాళ పంపాలె." తాలూకా ఆఫీసు పరిభాష అదీ ఈ ప్యూను కలిపించి మాట్లాడినదే!

కాసేపటికి గుమాస్తా ఫ్రీగా గాలి పీల్చి వేసెను.

ఇంకొక్కటుంది. అదయితే అయినట్టే ఆ రోజు ఎక్కౌంటు.

"అమ్మోయ్! మాస్టారూ ఇరవై షార్ట్—బాబోయ్. ఒకటీ అరా కాదు. మీరిందాక ఖాసింకు యిరవై మనిఆర్డరు పేమెంటుకు ఇచ్చారు కదండీ?"

"హి హి హి—థ్యాంక్యూ—ట్యాలీడ్ ఖాసిం రెండు స్పెషల్ చాయ్ తీసుకొని రా."

ఎక్కౌంటు ట్యాలీ అవుతే బోలెడు సంబరం. ఏరోజు కారోజు అంతే ఆనవాయితీ.

అర్ధరాత్రి పదింటికి.

మాష్టారూ! అని గావు కేక. అది పిలవటం—హైద్రాబాద్ ట్రంక్ కాల్ట, కన్సెషన్ రేట్—మాస్టారు ఆవులింతతో ఆగమనం.

నిద్రబోతూ లేస్తూ ఆ కాలొచ్చే టప్పటికి ఠాణాలో పన్నెండు గంటలు.

రెండో ఆట జనం.

"మాస్టర్ సాబ్! దో కార్డ్ మిల్ సక్తా హైక్యా?" అర్ధ రాత్రి నిశాచరుని అర్థంలేని అభ్యర్ధన.

"ఖైరో! మున్షీసాబ్ ఆయేంగే సాడే బారాకో...జబ్ మిల్తా...వహ్వా తష్రీఫ్ రఖో—" మాస్టర్ సాహబ్ మనస్సు నుండి మాటాడిన వ్యంగ్య ధోరణి.

"ఏ టపాఖానా వాలేభీ ఐసాబాత్ కర్తే కభీకభీ" పైజమా సవరించుకొంటూ తనని తాను సమర్థించుకొంటూ దీర్ఘాలు తీస్తున్నాడు తోటి స్నేహితుడితో.

మాస్టారు నిద్రమత్తులో అనంతమంత అవులింత— కాల్ కేన్సిల్. కిటికీ ధడేల్.

తెల్లారుతుంది. ఇంకాసేపుంటే మళ్ళీ మొదలు. చంక్రమణం.

అగర్ ఫిర్ దౌస్ బార్ ఎజమీన్ అస్త్ అమీన్ అస్త్ అమీన్ అస్త్ అని దేన్ని చూసో స్వర్గధామం అంతా ఇక్కడే ఉంది అన్నాడు మహాకవి. కాని అప్పుడు పోస్టాఫీసులు లేవేమో! ఇప్పుడు చూస్తే ఆ స్వర్గధామం అంతా ఈ టపాఖానాలోనే అంటాడు తప్పక!



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B 128 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 189 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |